అనెడి వాతులాద్యాగమాలు చేపట్టి, రుద్రేశ్వర సదాశివులు దేహాంతరాలం గూడి దేవతలు అయినారు గనుక వారు ముగ్గురున్ను శుద్ధ తత్వాలు, విష్ణు బ్రహ్మలు దేహాంతరాలం గూడి............ నారు గనుక శుద్ధాశుద్ధ తత్వాలు, జీవులు దేహాంతరాలం గూడి తమతమ నిజమును మరిచినారు గనక అశుద్ధ తత్వాలు అని చెప్పుదురు కొందరు గుణోపాధివల్ల, బహిస్సత్వం అంతస్తామసం విష్ణువు, గుణోపాధివల్ల బహి స్తామసం అంతస్సాత్వికం శివుడని చెప్పుదురు. ఈ మతాలన్నిన్ని "సర్వం ఖల్విదం బ్రహ్మ" "నేహనా నాస్తి కించన" "ఆత్మైవేదంగ్ సర్వం" "బ్రహ్మై వేదంగ్ సర్వం" అనెడి శ్రుతులకు విరోధ మాయెను. "సర్వం బ్రహ్మేత్యుపాసీత" అని కలదు గనుక, అన్నిటికిన్ని బ్రహ్మమే ఉపాస్యము. ఇందుకు శ్రుతి "సర్వం బ్రహ్మే త్యేవ జానాత్" అని కలదు గనుక, ఈ కర్మభక్తులకు చిత్తశుద్ధే తాత్పర్యము. జ్ఞానాధికారికే దృఢవై రాగ్యమున్ను బ్రహ్మచర్యమున్ను, శరీర హేయమున్ను, వివేకమున్ను కలుగవలెను. "ఆత్మవిద్యా తపోమూలం" అని బ్రహ్మో పనిషత్తు పలికెడిని, "ఔషధ వద శన మాచరేత్; యతయో భిక్షార్థం గ్రామం ప్రవిశంతి" అని ఆరణ్యోపనిషత్తు పలికెడిని. "యదహరేవ విరజేత్త దహరేవ ప్రవ్రజేత్" "నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః। లాభా లాభౌ సమౌభూత్వా"అని జాబాలికోపనిషత్తు పలికెడిని. "అసాన పుత్రమిత్ర కళత్ర బంధ్వాధి నాంశిఖాయజ్ఞోపవీతం స్వాధ్యాయం సర్వకర్మాణి సన్యాసః స్వవపుః కుణపమివ దృ శ్యతే। సావర్ణా దినాంనైవ పరిగ్రహేత్" అని పరమహంసో పనిషత్తు పలికెడిని. అనేక ఉపనిషత్తులున్ను పరమ కల్యాణా వాప్తికి వైరాగ్య నిష్ఠే పరమసాధనమని చెప్పు చున్నవి. జ్ఞానదర్శన సద్బ్రవాపత్తి కలిగిన సద్గురువువల్ల భవబంధ నివృత్తయి ముక్తుండవును. ఇందుకు శ్రుతి "అధీహి భగవన్ బ్రహ్మవిద్యాం వరిష్ఠాం సదా సద్భి స్సేవ్యమానాం నిగూఢామ్, యయాచిరా త్సర్వ పాపం వ్యపోహ్య పరాత్పరం పురుష ముపై తివిద్వాన్[1]. అని కైవల్యోపనిషత్తు పలికెడిని. ఆచార్యుండు తనందు ఉపసన్నుండైన శిష్యుని తారతమ్య మెరింగి, నానా మత భేదాలున్ను ఖండించి, నేతి ముఖాన సంశయ మిధ్యా జ్ఞానాలనున్ను తొలగించి, మహా వాక్యార్థమును బోధించు నాతండే సద్గురువు. అక్కడ నానా మత భేదాలనంగాను, సాంఖ్య బౌద్ధ తార్కిక మీమాంసక చార్వాకాదులున్ను, సాధారణ శ్రుతులంబట్టి బహు యుక్తులచేత ఆత్మను వేరేవేరె ప్రతిపాదింతురు. అది యేలాగంటేను, "అన్నం బ్రహ్మే తివ్య జానాత్" అనెడి శ్రుతినిబట్టి, అన్నమే బ్రహ్మమందురు. "ప్రాణో బ్రహ్మే తివ్యజానాత్" అనెడి శ్రుతినింబట్టి ప్రాణమే బ్రహ్మమందురు. "మనో బ్రహ్మే తివ్యజానాత్" అనే శ్రుతినిబట్టి మనసే బ్రహ్మమందురు. "విజ్ఞానం బ్రహ్మే తివ్యజానాత్" అనే శ్రుతిని బట్టి విజ్ఞానమే బ్రహ్మమందురు. "ఆనందో బ్రహ్మే తివ్యజానాత్" అనెడి శ్రుతిని బట్టి

(1) చూ॥ కైవల్యోపనిషత్తు 2. ఓ భగవంతుడా! శ్రేష్ఠమైనదియును, ఎల్లప్పుడు సత్పురుషులచే నుపాసింపదగినదియును. రహస్యమైనదియును, దేనివలన జ్ఞానియైనవాడు శీఘ్రముగా సకలపాపములను పోగొట్టుకొన్నవాడై పరమాత్మను పొందునో అట్టి బ్రహ్మవిద్యను ఉపదేశింపుడు.

ఆనందమే బ్రహ్మమందురు. కొందరు "ఆకాశ శరీరం బ్రహ్మ" అని ఆకాశమే బ్రహ్మమందురు. మరి కొందరు "ఓమితి బ్రహ్మ" అందురు. కొందరు "మాతృదేవోభవ" అందురు. మరికొందరు "తస్యైష ఏవ శారీర ఆత్మా" అనెడి శ్రుతినింబట్టి శరీరమే ఆత్మ అందురు. మరికొందరు "ఆదేశ ఆత్మా" అందురు. కొందరు "యోగ ఆత్మా" అందురు. "అనద్బ్రహ్మేతి" "బహుశ్యాం ప్రజా యేయేతి" "అనద్వాయిద మగ్ర ఆసీత్" "తతోవై నదజాయత" (ఇతి) ఈ ప్రకారాన నానా విధాలుగాను ఆత్మను ప్రతిపాదింతురు. ఆ మతాలెల్లా, ఏకదేశ జ్ఞానమనే తెలియవలెను. అంధకులు గజస్పర్శం చేసి, తమతమ యెరుకచేత, ఒకరొకరు ఆ గజాన్ని మునలమంత అనిన్నీ, కొందరు భేరిఅంత అనీన్నీ చెప్పుదురు. కన్నులు గలవానికి ఆగజమే లక్ష్యమౌను. నమస్త మతభేదాలయందు ఆయా మతాలకు బ్రహ్మమే లక్ష్యము, ఇందుకు శ్రుతి, "సర్వం తత్ప్రజ్ఞానేత్రం" అని కలదు గనక. అయితే ఇందులో నిశ్చయజ్ఞానం ఏది అంటేను, నచ్చిదానంద నిత్య పరిపూర్ణ శబ్దములయందు లక్షిత మైనటువంటి పరబ్రహ్మమే తా ననేది యిప్పుడు రహస్యము. అయితే బ్రహ్మమందు పంచ పదప్రయోగం యేలా అంటేను పర్వతాలయందున్ను నదంశం ఉన్నది గనక, తన్నిరననార్థమై చిత్పద ప్రయోగం. నచ్చిత్పదాలున్ను చంద్ర సూర్యాగ్నులకు కలిగిఉన్నవి గనుక తన్నిరననార్థమై ఆనందపదప్రయోగం. నచ్చిదానందములున్ను హరిబ్రహ్మదులయందు కలవు గనక తన్నిరననార్థమై నిత్య పదప్రయోగము. నచ్చిదా నంద నిత్యత్వమున్ను బ్రహ్మమైన చోట ప్రాదేశిక శంకా నిరననార్థమై పూర్ణ పదప్రయోగము. ఈ నచ్చిదానంద నిత్యపరిపూర్ణ గుణాలవల్ల, బ్రహ్మము గుణిఆయె గదా అంటేను, "ప్రకృష్టః ప్రకాశశ్చంద్రః" అనే మర్యాదయందు, స్వరూపలక్షణమే కాని గుణ గుణిభావం గాదు. అటువంటి చిన్మాత్రవస్తువును యిప్పుడు అని చెప్పగాను, అనజ్జడ దుఃఖ అనాత్మ ప్రాదేశికమైన తాను వస్తువనుట యేలాగంటేను, నిర్మల చిత్తంవల్ల దేహేంద్రియాది జగదధ్యానను "నేతి" వాక్యాలచేతం ద్రోసి నిలిచిన యెరుకె మహా వాక్యాలచేత లక్షితమైనవస్తువు. అదెట్లంటేను శ్రుతి; "మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధంచాశుద్ధమేవచ అశుద్ధం కామనంకల్పం శుద్ధంకామవివర్జితం" "మనఏవ మనుష్యాణాంకారణం బంధమోక్షయోః బంధాయవిషయానక్తం ముక్తంనిర్విషయం మనః అతోనిర్విషయ స్యాన్యమనసో ముక్తిరిష్యతే। అతోనిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా" అని అమృత బిందూపనిషత్తు కలుగంబట్టి, తన ఎరుకందా దేహేంద్రియాది జగత్సంబంధం కలదనేది యేది కలదో అది జీవాత్మ, అందు యీ జగజ్జీవభావం తొలంగినిలిచిన తెలివే పరమాత్మ. ఇంకను అధ్యాన లనెడివి బహు విధాలై ఉండును. అది యేలాగంటేను, మిథ్యాధ్యాన, యితరాధ్యాన, యితరేతరాధ్యాన, నత్యాధ్యాన లనెడివి. ఈ యధ్యాన లక్షణాలు యేలాగంటేను, రజ్జువందు నర్పబుద్ధి యేలాగు అలాగునే. తన యెరుకయొక్క సాన్నిధ్యమందు జడదృశ్యాలైన దేహకల్పన యేది కలదో అది మిథ్యాధ్యానము. జపాకుసుమ నంయోగాన స్ఫటికాన కు రక్తిమ గలిగినట్టే, తన యెరుకగూడి బుద్ధ్యాదాలవంటి చక్షుశ్రోత్ర ద్వారాలకు,

కనే వినేశక్తి కలుగంబట్టి దశేంద్రియాలున్ను యితరాధ్యాన. తప్తాయః పిండం వలెనే వహ్నియొక్క దాహకత్వమే లోహనకు వచ్చి, లోహదీర్ఘ కృశత్వాది ధర్మాలే వహ్నికి వచ్చినట్టు తనయెరుకగూడి అంతఃకరణాలు జడాలయినాను విషయపదార్థాల నెరుంగును. ఆ యెరింగెడి చైతన్యశక్తి అంతఃకరణాలకు వచ్చిన్ని విషయ పదార్థ స్మరణ లేదుకాబట్టి, అంతకరణాలున్ను చైతన్యంతో గూడిందిగాగాను అంతః కరణాలూ యితరేతరాధ్యాన, యీ యర్థమందు శ్రుతి, "అగ్ని సంగాత్త ధాలోహమగ్నిత్వ ముపగచ్ఛతి, అత్మసంగాత్త థాగచ్ఛత్యాత్మతా మింద్రియాదికం సదేహో పినజీవోపి నభవేదు భయంతతః। జాత్యేతరాదికం భ్రాంతం సత్యేస్వాత్మని కల్పితం" అని సప్తగ్రంధి కలదుగనుక బ్రాహ్మణియందు ఆ బ్రాహ్మణత్వము వ్యవహారానకు సత్యమైనాను, వికల్పించి చూస్తే దబ్బరౌను. చిదహం అనేది తనయందు అహం ప్రత్యయం సత్యమైఉండిన్ని పశ్చాత్కాలమందు దబ్బరై పోవుచున్నది గనక యిది సత్యాధ్యానము

భిన్న పాశస్తదా జీవః సంసారం సరతె సదా।
యధానిర్వాణ కాలేతు దిపాదు దిపాదు లయంవ్రజేత్॥

అని క్షురికోపనిషత్తు కలదు గనక సర్వ భ్రాంతులున్ను "నేతి" ముఖానంగాని భిన్న పాశం కావు; పాశభేదం యేలాగంటే,

"ఏతస్మాత్తమివేంద్ర జాలమపరం యద్గర్భ వాసస్థితమ్।
రేతశ్చేత తిహస్త మస్తక పద ప్రోద్భూత నానాంకురమ్॥"

"పర్యాయేణ శిశుత్వ యౌవన జరావేషైరనే కైర్వృతమ్, పశ్య త్యత్తి శ్రుణోతి జఘ్రతి యథాగచ్ఛత్య థాగచ్ఛతి"అని చిత్రదీపికకలదు గనక, దేహమున్ను అత్మగాదు. అది యెలాగంటే షడ్భావ వికారాలు "యిదం" అని తోచెగనుక దేహము నెరిగేది అత్మ. కర్మేంద్రియాలు అత్మగాదు. వచనాది విషయసాధనాలు అయిన్ని "యిదం" అని తోపుచున్నది గనుక యీ కర్మేంద్రియాల నెరింగేది అత్మ. శ్రోత్రాది బుద్ధీంద్రియాలున్ను అత్మగాదు. అది ఎట్టంటే శబ్దాది విషయ సాధనాలయిన్ని "యిదం" అని తోచె గనుక, వాటిని యెరిగేది అత్మ. మనసాద్యంతఃకరణాలు అత్మగావు, అది యెలాగంటే, మంతవ్యాది విషయసాధనాలయిన్ని, "యిదం" అని తోచె గనక వాటి నెరిగేది అత్మ. ఇందుకు శ్రుతి "అహంకారాది దేహాంతంభేదో నాత్మాఘ పాదివత్" అనిన్ని "మనసోమనః చక్షుశ్చక్షురితి తస్యభాసా సర్వ మిదం విభాతి" అనిన్ని"నవేత్తివేద్యం నచ తస్యాస్తి వేత్తా"అనిన్ని శ్రుతులుపలికెడిని. ఇంక జాగ్రదాది అవస్థాత్రయాలున్ను అత్మగాదు. అది యెలాగంటే ఒక అవస్థలో మరొకఅవస్థ లేదు గనక, వాటి నెరిగేది అత్మ. "తస్యత్రయావస్థా స్వప్నాః" అని శ్రుతి. "జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే। తద్బ్రహ్మహమితి జ్ఞాత్వా సర్వ బంధైః ప్రముచ్యతే" అని కైవల్యోపనిషత్తు పలికెడిని. సాధారణ ద్రష్టు సర్వద్రష్టు మొద

లైన సర్వ ప్రపంచమున్ను వేద్యం గాబట్టి ఘటంవలెనే విషయం. వాటిని యెరిం గేదే ఆత్మ. సాధారణ ద్రష్టనగాను "త్వం"పదానకు ముఖ్యార్థమైన జీవుండు, ఆ జీవత్వమును యెరుగుచున్ను ఉండేది స్వాశ్రయాధిష్ఠాన చైతన్య మనెడిదె "త్వం" పదంయొక్క లక్ష్యార్థమైన కూటస్థ చైతన్యము. సర్వద్రష్టు అనంగాను తత్పదానకు ముఖ్యార్థమైన యీశ్వరుడు, ఆ యీశ్వరత్వమును యెరిగియుండేటటువంటి, సర్వా ధిష్ఠాన చైతన్యమనియడిదే తత్పదంయొక్క లక్ష్యార్థమైన బ్రహ్మము. ఘటాకాశ మహాకాశాలకు అయిక్యం కద్దు. కూటస్థ చైతన్యానకున్ను బ్రహ్మానకున్ను అయిక్యం అని చెప్పెడిదే "అసి" పదం. "స ఆత్మా తత్త్వ మసిశ్వేత కేతో" అని ఛాందోగ్య మందు, నవకృత్వాధ్యాన కలదు. పంచానంద పంచదీపాలయందున్ను, చిదాభాసకు పూర్ణమై యుండేది సూర్య కిరణాలు. స్వచ్ఛదర్పణాలయందు, ప్రతిబింబించే నిజ కిరణాలకు చలనం లేకున్నాగాని, దర్పణోపాధివల్ల అభాస కిరణానకు చలనం కలు గుచు నుండును. ఆత్మ ప్రకాశమున్ను అంతఃకరణాలు స్వచ్ఛమై యుండగాను, అక్కడ ప్రతిబింబించిన చిదాభాస తేజస్సు అంతఃకరణోపాధింబట్టి వ్యవహరించు గనక అ దిప్పుడు జీవుండని చెప్పుదురు. క్షేత్రజ్ఞ, సాక్షి, కూటస్థ, అంతర్యామి, మహా ప్రాణ, ప్రత్యగాత్మ, అని తమతమ మతాలయందు చెప్పుచునుందురు. అక్కడ త్రితయ ప్రతిభాస కలదు గనుక, వాటిని "నేతి" ముఖానం దెలిసిన తెలివే ఆత్మ సచ్చిదానంద నిత్య పరిపూర్ణమనెడి, అయిదు పదాలలోను, చిత్పదానకు వ్యతిరిక్త మైన నాలుగు పదాలున్ను అనుభవమందు వేద్యమై ఉండు గనుక, వాటిని "నేతి" ముఖానం ద్రోసి నిలిచిన చిన్మాత్రజ్ఞప్తి స్వరూపమే ఆత్మ. "నేతి" ముఖానం దెలిసిన సకల ప్రపంచానకున్ను, సంయోగ సమవాయ నిమిత్తకారణా లనెడి కారణత్రయ మున్ను లేదు. గనుక, ప్రపంచం లేదుఅనేదే సత్యము. "అఘటిత ఘటనాపటీ యసీ మాయా" అని కలదు గనక, మాయె ఘటించి తోచును అంటే ఆ మాయ అవిచార మందే సత్యము. విచారపూర్వకంగా జూస్తే అసత్యము, మిథ్య యనుట. అయితే జగత్తు తోచెగదఅంటే, ఘటమందు తోచినభావమెల్లాను మృత్తికేకాని ఘటమనేదిలేదు. చిన్మాత్రమైన తనయందు ప్రపంచం లే దనేదే సత్యము. ఇందుకు శ్రుతి, "నామ రూపే వ్యాకరవాణి। వాచారం భణంవికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం" "ఏకంసత్యం బహుధా కల్పయంతి" అని ఛాందోగ్య శాఖోద్ధారం కలదు. "తదే తత్కృతకం తత్తదనిత్యం" అని దృశ్యంలేదు గనుక చిన్మాత్ర వస్తువుకు దర్శనాది క్రియాభేదాలు లేవు. తనందు తోచేదిలేదు గనక, స్వగత భేదం అనెడిది లేదు. తన వలెనే మరొక వస్తువు తోచలేదు గనక, స్వజాతీయభేదం అనెడిది లేదు. ప్రతి యోగిత్వం లేదు గనక, విజాతీయ భేదమనెడిది లేదు. శుద్ధజ్ఞప్తి స్వరూపమే తా ననె డిది ప్రసిద్ధము. ప్రత్యక్షాది ప్రమాణాలున్ను శ్రుతిశాస్త్రాలున్ను తనయందు ఔప చారిక మనెడిదె తాత్పర్యము. ఈ యర్థమందు శ్రుతి, "పరాత్పర తరం బ్రహ్మ" అనిన్ని "నిర్వికల్ప మనంతంచ హేతుదృష్టాంత వర్జితం। అప్రమేయ మనాదించ యాథార్థ్య ముచ్యతేబుధైః। ననిరోధో నచోత్పత్తి, బంధో ర్నచపాతకః। నముముక్షు

ర్నవై ముక్తః, యిత్యేత త్పరమార్థతః" అని అమృత బిందూపనిషత్తు పలికెడిని. బ్రహ్మ విత్తయిన అతనికి సంచితాగామి కర్మాలు లేవు గనుక, జనన మరణాదులున్ను లేవనెడిదే సిద్ధము. విధి నిషేధకర్మాలున్ను అతన్ని అధికరించనేరవు; ఈ యర్థమందు శ్రుతి. "నైవచింత్యం నచాచింత్యం నచింత్యం చింత్యమేవతత్। పక్షపాత వినిర్ముక్తం బ్రహ్మను విద్యతె తథా సత్వం రజస్తమ ఇతి ప్రపన్న జనాతి కృతెర్నాత్మ నోగుణాః" "నకర్మణా విలిప్యతే పాపఃకేన మనీషిణోసోగ్ని పూతోభవతి" "యతోవా చోనివర్తంతేఅప్రాప్యమనసానహ" "ఆనందంబ్రహ్మణోవిద్వాన్" "అవచనె నైవప్రోవాచ"ఇతి శ్రుతయః. "యస్సర్వం విజానాతి మూఢధీః నజానా మితిజానాతి తదేవజ్ఞానముచ్యతే" "త్యజధర్మమధర్మంచఉభే సత్యానృతెత్యజ। ఉభేసత్యానృతేత్యక్త్వాయే న త్యజతితంత్యజ" "ఆత్మవంతం నకర్మాణి నిబధ్నంతి ధనంజయ" అనిన్ని "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురు తెర్జున" అనన్ని, "యథారవిస్సర్వ రసాన్ ప్రభుజ్తే। హుతాశన శ్చాపిహ సర్వభక్షకః। తథైవయోగీ విషయాన్ ప్రభుజ్తే। నలిప్యతే కర్మ శుభాశుభైశ్చ" యిటని స్వరూప నిశ్చయం చెప్పంబడెను.

ఇతి పరమహంస పరివ్రాజ కాచార్య వర్య పరమానంద తీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యా సుధార్ణవే యోగశాస్త్రే
ప్రాకృతసృష్టి పంచ ప్రళయ ప్రపంచ
నటనా వైచిత్ర్యస్వరూప నిరూపణం
నామ ద్వితీయ ప్రకరణం
సమాప్తమ్.

---

# మూడవ ప్రకరణము

నమోస్తుతస్మై గురవేతిమాయినే, సమస్త సిద్ధాంత రహస్యగాయినే।
శిష్యాన్ కృతార్థాన్ బహుధా విధాయినే, ప్రజ్ఞావతాం బ్రహ్మవిధాన దాయినే॥

సదసత్త్వ వివేచనోచితాం విదుషాంతత్త్వ వినోద కౌముదీం।
జనయత్యతి చిత్రమన్వహం పరమానంద యతీంద్ర చంద్రమాః॥

ఉత్తమాధికారులయిన ముముక్షువుల విషయీకరించి పరమానందతీర్థులు సూక్ష్మ వివేకమున్ను నివర్త్య నివర్తక భావమున్ను మననార్థ వ్యాజంగాను ఈ ప్రకరణమందు నిరూపిస్తున్నారు. అది యెట్లన్నను, మొదట సూక్ష్మ వివేకం యేలా గంటేను, "నిత్యశుద్ధ, బుద్ధ, ముక్త, సచ్చిదానందాద్వయ పరిపూర్ణప్రమాణ ప్రత్య యాతీత, జననాదిక్రియా విదూర, స్వతస్సిద్ధ స్వానుభవైక ప్రమాణవేద్య, స్వయం ప్రభః". పరమార్థ తత్త్వాతీత రహస్యము సమ్యగ్బోధము. ఈ యర్థమందు శ్రుతి, "బృహత్వా ద్బృంహణత్వా చ్చతత్‌బ్రహ్మే త్యభిధీయతే" అనిన్ని "ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ" అనిన్ని. ఈ నిజజ్ఞప్తి తత్త్వంలోను జగదుత్పత్తి క్రమోప సంహార మెట్లన్నను, "అత్రాయం పురుషః, స్వయంజ్యోతిః", అనెడి శ్రుతులే కారణంఅవును గనుక, పరమాత్మ స్వయంప్రకాశమని అంగీకరించవలెను. స్వయంప్రకాశ మనే టందలి "స్వయం" అనెడి "స్వ"శబ్దము, ప్రకాశనిష్ఠమై యుండును. దాన్ని అనుసం గించుకొని "అహ"మనే ప్రత్యయం, అధ్యస్తమాయెను. అది యేలాగంటేను, "స్వయం", "అహమ్" అనే శబ్దాలు రెండున్ను, అన్యత్వంతో ప్రతిద్వంద్వత కలి గింది కనుక, తమలోతమకు పరస్పరవిరోధం లేదు. అది యేలాగంటే, బ్రహ్మము పూర్ణమై యుండగాను ప్రకాశనిష్ఠమైన సత్త్వమున్ను సర్వత్రాధిష్ఠితమై యుండును. తద్వారా "అహం"శబ్దము అధ్యస్తమాయెను. అట్లయితే, "తదిదం" శబ్దాలు సమీచి నాది శబ్దాలకు సర్వత్ర వ్యాపకత్వం కద్దు, అంటేను, "స్వయ మహమాది" శబ్దాల వలెను అన్యత్వంతో ప్రతిద్వంద్వత లేదు గనుక, పరమాత్మయందు యథార్థ నిష్ఠత దానికి దొరకదు. అన్యత్వంతో ప్రతిద్వంద్వత కలిగిన చైతన్యనిష్ఠమైన "స్వయం" శబ్దంతోను, "అహం" శబ్దానకు సహచర్య కలిగింది గనుక, "స్వయం" శబ్దమే "అహం" శబ్దానకు యోనిభూతమని తెలియగలదు. "స్వయం" అనే పదము, ప్రకాశమనే పదానకు అధికరణమాయె. కనుక, "స్వయం" శబ్దమందున్ను బ్రహ్మమే వివక్షితము. "స్వయం" శబ్దము పూర్వభావిత్వం గాబట్టిన్ని, "అహం" శబ్దము పశ్చా

ద్భావిత్వం గాబట్టిన్ని, అధ్యాసయనెడి సత్యానృతమే ధ్వనీకరణమని చెప్ప వలసెను. ఈ యర్థమందు చిత్రదీపిక చెప్పుచున్నది,

అన్యతాయాః ప్రతిద్వంద్వీ స్వయంకూటస్థ ఇష్యతాం।
త్వంత్వాయాః ప్రతియోగ్యేషో హమాత్మని కల్పితః॥
అహంత్వాన్యత్వ యోర్భేదే రూప్యతే దంతయోరివ।
స్పష్టేపిమోహ మాపన్నా ఏకత్వం ప్రతిపేదిరే॥

"అహమితి ప్రథమోధ్యాసః" అని వ్యాససూత్రం కలదు గనుక, "అతస్మిన్ తద్బుద్ధి రధ్యాసః"అని అధ్యాసలకణం కద్దు. "స్మృతి రూపఃపరత్ర, పూర్వదృష్టావ భాసః" అని వాచస్పతియందు కలదు. అధ్యాస యనియెడిది నివృత్తికాలమందే కాని, ప్రవృత్తి కాలమందు ఘటించదు, అది యేలాగంటే, "యావద్బాధం ప్రామాణ్యం" అని కలదు గనుక, ఆ ప్రవృత్తి నివృత్తి యేలాగంటేను, అక్కడ ప్రవృత్తి యనగాను, అహమనే అధ్యాసంవల్ల తోచిన వైచిత్ర్య ప్రపంచంవల్లనున్ను, నానా యోనిభేదాలయిన జీవరూపాలవల్లనున్ను భ్రమసును. ఆ భూతేంద్రియ సమష్టి అనగాను, "అహం ప్రాణ ఘ్రాణ గంధాభువోర్ధాత్వా తూరర్థతః। చిత్తాపానరసజ్ఞాస్యుః గుహ్యం చాపాం రసోర్థతః। బుధ్యుదానౌ రూపపాదౌ తేజసార్థాశ్చ లోచనం। మనస్త్వ క్స్పర్శ పాణిచ। వాయోర్వ్యానేర్థ తోర్థతః। సమాన శ్రోత్రశబ్దా వాగ్వ్యమార్థ జ్ఞాతృ భాగతః। పాయూరసో దృగ్వ్యానశ్చ జ్ఞాతృత్వం చాన్యవర్జితం" ఈ ప్రమాణాన తోచి దేహద్వయాభిమానైన జీవుండు, స్వకర్మ వశుండై నానా యోనులయందున్ను పుట్టును. అదెట్లంటేను, "విసర్గకాలే శుక్లశ్య జీవఃకరణ సంయుతః। ప్రీత్యా ప్రవేశతే యోనింకర్మ భిర్విర్నియోజితైః" అని కలదు గనుక దేవదత్తునియందు జడమైన లింగశరీరం తోచెను. మ్రాకులుగట్టిన యింటికి చలనం లేకున్నాను, తత్తద్రూపా లయిన మ్రాకులనైన పీటలు మ్రాకుతట్టలు మొదలయిన గృహోపకరణాలకు చలనంగలిగియుండును. భూతాలవల్లనైన బ్రహ్మాండానకు చలనం లేకున్నాగానిన్ని, పిండాండానకు చలనం గలిగియుండును. ఆ గృహానకున్ను, గృహోపకరణాల కున్ను అభిమాని ఒక్కడే; అటువలెనే బ్రహ్మాండ పిండాండాలకు అభిమాని ఒక్కడే, వృత్తిభేదంవల్ల జీవేశ్వరాభిధానంవల్ల వినోదిస్తుండును, ఈ యర్థమందు శ్రుతిః

నమహత్వం యథోపేక్ష్య కశ్చిద్విప్రో మురూహయా।
అంగీక రోతిశూద్రత్వం తథాజీవత్వ మీశ్వరః॥

అని కలదు గనుక, ఆ యీశ్వరత్వమందలి సామర్థ్యము జీవత్వమం దుండనేరదు. అది యేలాగంటేను, మ్రాకు మొదటం గలిగిన బలుపు, శాఖోపశాఖల యందు లేదు. కార్యోపాధి గలిగిన జీవులయందు విశేషమయిన అధిక్యం గలుగదు. జీవులయొక్క యెరుకలున్ను నానావిధాలయి యుండునాఅంటే, నీల, పీతాది బహు

విధ వర్ణాలైన రత్నాలు, ఎండలో వరుసగాపెట్టితే రత్నవర్ణ భేదాలవల్లను సూర్య కిరణాలున్ను తత్తద్వర్ణ విశిష్టమేర్యై ప్రతిబింబించి తోచును. ఆ జీవులయొక్క కర్మ సంస్కార భేదాలవల్లను, అంతఃకరణాలున్ను బహు విధాలైన సంస్కారాలం గూడగాను అక్కడ ప్రతిబింబించిన చిదాభాస తేజస్సుకున్ను బహువిధాలైన మెరుక యుండును. ఈ యర్థమందు చిత్రదీపిక:

చైతన్యం యదదిష్ఠానం లింగదేహశ్చ యాపునః।
చిచ్ఛాయా లింగదేహస్తా తత్సంగో జీవఉచ్యతే॥

అని కలదు గనక, కర్మాల యుదయాటమందు తద్విశిష్టమైన అభాస తేజస్సుకు చలనం గలిగియుండు నింతేకాని, నిజ సూర్యకిరణాలకు చలనం లేదు. లింగశరీరోపాధివల్లను చిదాభాసకు జననమరణాది వ్యాపారం కలుగు నింతేకాని, కూటస్థ చైతన్యానకు వ్యాపారం లేదు. ఈ యర్థమందు శ్రుతి:

అధిష్ఠాన తయా దేహ ద్వయావ చ్ఛిన్నచేతనః।
కూటవన్నిర్వికారేణ స్థితఃకూటస్థ ఉచ్యతే॥
ఘటవచ్ఛిన్నఖే నీరం యత్తత్ర ప్రతిబింబితః।
సాభ్ర నక్షత్ర అకాశో జలాకాశ ఉదీర్యతే॥
అయంజీ వో నకూటస్థో వివిన క్తి కదాచన।
అనాదిరవివేకోయం మూలావిద్యే తిగమ్యతామ్॥
జలవ్యోమ్నో ఘటాకాశో యధా సర్వస్తిరోహితః।
తథాజీవేన కూటస్థః సోన్యోన్యా ధ్యాన ఉచ్యతే॥

అని కలదు గనుక ఘటవచ్ఛిన్నాకాశో పాధిని కూటస్థునికి చలనం లేకుం డిన్ని, జలోపాధివల్ల, సాభ్రనక్షత్ర అకాశానకు వ్యాపారం గలిగినటువలెనే జీవునికి వ్యాపారము. అదివిలాగంటేను, చంద్రసూర్యాగ్నుల తేజస్సున్ను పూర్ణమైయుండిన్ని, భూమి, కుడ్య వృక్షాద్యాశ్రయాలయందు కానుపించు నింతేకాని, శుద్ధమయిన బయట కిరణాలు ఉన్నాగాని స్థూలదృష్టికి గోచరంగాదు. పరమాత్మయును సర్వపరిపూర్ణమై యుండిన్ని, లింగశరీరమనే ఆశ్రయమందు ఉపలభ్యమౌను. ఇంతే కాని, అన్య స్థలాలయందు కనిపించదనేది లేదు.

ఈ చిదాభానకు స్వకర్మ ఫలభోగము, సద్యస్స్పష్టత, అగంతుకస్పష్టత, కాలాంతర ప్రస్పష్టత అని మూడు విధాలై యుండును. సద్యస్స్పష్టత యనంగాను, దినగతిని తోచెడికీర్తి అపకీర్తులున్ను, సుకృతవిశేషంవల్ల తోచిన తత్త్వవివేకం మొద లయినవిన్ని. అది యేలాగంటేను పత్ర పుష్ప ఫల శాఖాదిశక్తులు గల బీజమందు సద్యస్స్పష్టతగల అంకురాదులు, కాలాంతర స్పష్టతగల శాఖోపశాఖలు, అగంతుక స్పష్టతగల పత్ర పుష్ప ఫలాదులుండును. అందువల్ల, సుకృత విశేషమువల్లను

కాలాంతర స్పష్టతనుగూడి ఫలించిన గురుకారుణ్యంవల్లను నిజస్వరూపాభిముఖుండై లింగశరీరోపాధి తొలగిన చిదాభాస, కూటస్థ చైతన్యమందు ఏకత్వమై యుండును. అది ఏలాగంటేను, దర్పణోపాధి గలిగిన అభాసకిరణమున్ను, వర్తమానమందు నిజ సూర్యకిరణాల, అధారముననుండిన్ని, దర్పణం చెడితె నిజ సూర్యకిరణాలలో యేకత్వమై యుండును.

చిచ్ఛక్తి శ్చ పరాశక్తి రాదిశక్తి స్తథైవచ।
ఇచ్ఛాజ్ఞాన క్రియారూపా అశక్తయః షడ్విధామతాః॥

అని అగమగ్రంథం గలదు గనక, అనిర్వాచ్యమైన మాయ ఒక్కటే షడ్విధాలై తదుపాధివల్ల బ్రహ్మమే సదాశివ, ఈశ్వర, రుద్ర, విష్ణు, విధాత, అత్మ తత్వా లనెడి షడ్విధాలయందున్ను తోస్తుండును. ఆదేలాగంటేను, జలమొక్కటే మధురామ్లాద్యుపాధివల్ల షడ్విధాలై తోచును. ఆ మాయయే వైచిత్ర్య లక్షణం కలిగిందై, అరంభ, వికార, పరిణామ, అవయవ, విస్ఫులింగాలు మొదలయిన నానా విచిత్రరూపాలై తదుపాధివల్ల బ్రహ్మమే ఇతి వర్తభూతమై యుండును. పూర్వరూపం ఉండగానె, రూపాంతరంగా తోచేది వివర్తం. "యథాకటక మకుటాదివత్", అని లక్షణగ్రంథం కలదు. అది యేలాగంటేను, తెరలోన భారతరామాయణాది కథలాడే బహుచిత్ర ప్రతిమలంగల భిత్త్యోపాధిని ప్రకాశించే దీపప్రభే, విచిత్ర చతురంగసేనలై తోచును. పరమాత్మయు మాయోపాధివల్ల జీవ జగదాకృతియై తోచుననెడిదే ప్రసిద్ధం. ఈ యర్థాన శ్రుతిః వ్యోమేహం భాత్వి చిత్రభంగ్యానేక వ్యవస్థా వ్యవహార హేతుః। మానికృతా దర్శవదాభ్యాసా సానర్వ చిద్భావ పదంచిదస్మి।,

ఛిద్రభేదైర్యథా వాయుః వృత్తి భేదైర్యథానలః
స్థానభేదైర్యథా సూర్యః తద్వచ్ఛేష్టా విభిద్యతే॥

అని సూక్ష్మమైన అధ్యాసక్రమం చెప్పంబడెను. ఇంక అవస్థాత్రయ నిరాకరణం ఏలాగంటే, అతి సూక్ష్మ నివృత్తి క్రమము. ఆ అతిసూక్ష్మ నివృత్తి క్రమము అనంగాను, ప్రపంచ క్రమానను శ్రుత్యను మానాలచేతను, ప్రతిషేధించుట యేది కలదో అది యిప్పుడు నివృత్తి. శ్రుత్యనుమాన మనగాను నామరూపేణ్య కరవాణి అని ఛాందోగ్యశ్రుతి కలుగంబట్టిన్ని వివాదపదం మిథ్య. దృశ్యత్వాత్స్వప్నవత్, అనెడి ప్రసిద్ధానుమానంవల్ల, ప్రపంచం లేదనెడే తాత్పర్యము. అయితే అవస్థాత్రయ రూపాలుగాను ప్రపంచం తోస్తున్నదిగద అంటేను, ఆ యవస్థలే ఒకటిలో ఒకటి తోచదు గనక మిథ్య. అయితే, అంగుళీత్రయ, ఘట త్రయాలు, ఒకటిలో ఒకటి తోచకుండిన్ని సత్యమైయున్నదిగద అంటేను, ఆ యంగుళీత్రయ ఘటత్రయాలయందు, సమకాల స్వతస్సద్భావిత్వము ఉన్నది. అవస్థాత్రయాలయందు, సమకాల స్వతస్సద్భావిత్వం లేదు గనుక, మిథ్య. అయితే గిరి త్రయ పురత్రయాలయందున్ను సమకాల స్వతస్సద్భావిత్వం లేకున్నాను, సత్యమై యున్నదిగదా అంటే, ఆ గిరిత్రయ పురత్రయాలయందు సమకాలస్వతస్సద్భావిత్వం

లేకున్నాను, స్థానాంతరమందు సమకాల స్వతస్సద్భావిత్వవర్తన కలదనేదే ప్రసిద్ధము. అయితేను, పత్ర పుష్పఫలాదులయందున్ను సమకాల స్వతస్సద్భావిత్వ నియమం లేకుండిన్ని సత్యమైయున్నదిగదాఅంటేను, అక్కడ కాలనియమం గలిగియుండును. ఈ యవస్థాత్రయాలయందు, పత్ర పుష్పాదులవలె కాలనియమం లేదుకాబట్టిన్ని, గిరిత్రయ పురత్రయాలవలెను సమకాలస్థానాంతర ప్రతీతి లేదు కాబట్టిన్ని అంగుళిత్రయ ఘటత్రయాలవలె సమకాలదర్శనం లేదు కాబట్టిన్ని, వేద్యములు గాబట్టిన్ని, మిథ్య. అయితే తోస్తున్నదిగద అంటేను, ఇంద్రజాల విద్య కనేటప్పుడు అందుల వ్యాపారం సత్యమైయున్నాగానిన్ని యుక్తియందు మిథ్యైనట్టే అవస్థా త్రయాలున్ను మిథ్యనెడిదే సిద్ధము. మృతి మూర్ఛ, యోగం, తుర్యం, తుర్యాతీత మనెడి అనేకావస్థలున్ను జాగ్రమందే అంతఃపాతమైన కారణంవల్లను, అవిన్ని మిథ్య లనే యెరుగునది. ఈ యర్థమందు శ్రుతి, "తస్యత్రయ అవస్థాత్రయ స్వప్నాః" అని కలదు గనుక, బుద్ధ్యాది నవగుణవిశిష్టమైన అభిమాన చైతన్యమందున్ను ఆత్మత్వం ఉండదు గనుక, అదిన్ని మిథ్య. అదేలాగంటేను, "గుణ గుణినో సమవాయః" అని కలదు గనుక, గుణమును విడిచి గుణి యుండదు. స్వశరీరాదికర్మంవల్ల వాయువుకు వేద్యత గలిగున్నట్టె, బుద్ధి, సుఖ, దుఃఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న. ధర్మా ధర్మభావ నలు మొదలైన అనేక గుణాలున్ను వేద్యాలు గాబట్టిన్ని, జడాలు గాబట్టిన్ని, తద్విశిష్టమైన అభిమాన చైతన్యానకున్ను వేద్యత గలిగుండంబట్టి జడమనేదే తాత్పర్యము. "దృశ్యాపేక్షయా ద్రష్టుత్వం" అని కలదు గనుక, దృశ్యలక్షణమేవ నిర్గుణజ్ఞప్తి, చైతన్యం వేరనేదే ప్రసిద్ధము. ఆ ఎరుకయును సుషుప్తికాలమందు చెడి పోదా అంటేను, "సుఖ మహమస్వాప్యం నకించి దపివేదిషం" అనెడి స్మృతికలదు. గనక, సుషుప్తికాలమందున్ను యెరుక స్వయంప్రకాశమై ఉండుననేదే తాత్పర్యము. ఆ యెరుక అణుపరిమాణమైయుండును. అంటేను, గజాదిస్థూల శరీరాలలోను, ఒక అవయవమందు, అణుపరిమాణాన ఉంటేను మరొక అవయవాన లేకుండవలెను. అయితే మధ్యమపరిమాణ మగును అంటేను, అధిక శరీరాలయందు పరిమితమై న్యూన శరీరాలయందు పట్టకేయుండవలెను. అయితే మహత్పరిమాణమౌగాక అంటే, పిపీలికాది శరీరాలయందు తోపకే యుండవలెను. అయితే, కర్మోపాధివల్ల తత్తచ్ఛరీర పరిమాణ మవుగాక అంటేను, "తదేతత్కృతకం తత్తదనిత్యం" అని శాస్త్రాను మానం కలదు గనుక కర్మాలున్ను చేయంబడ్డవి గనుక, తత్తద్దేహ పరిమాణమనెడి దిన్ని మిథ్య. ఈ యర్థమందు శ్రుతి "అ స్థూలమణు హ్రస్వం" అని బృహదారణ్యకం కలదు. అయితే, ప్రపంచమును యెరుగుచున్నాడు గనక, జ్ఞానగుణి ఆత్మ అగును. అంటేను, ప్రపంచం మిథ్యగాబట్టి, ఆత్మ యిచ్ఛాయత్నాదుల నెరిగేది కాదు గాబట్టిన్ని; అహమాది గుణాలవలెను, సాపేక్షకుడు కాడు కాబట్టిన్ని ఆత్మజ్ఞాన గుణి అనేది కూడదు. సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వాధి గుణాలు సోపాధికాలు గాబట్టి, నిర్విశిష్ట ప్రత్యక్చైతన్యమందు, సవిశేషగుణ భేద ప్రపంచము సత్యంగాదు. అది యేలా గంటేను, సుఖాన నిద్రించే పురుషుండు స్వప్నములో నానావిధ మృగపక్షులై భీకరా

కృతులైన అనేక లుబ్ధకనివహమున్ను తానే అయి ఘోరాటవులయందు మృగవ్యసనానక్తుండై తిరిగి బడలి, కన్నులు దెరచి మేల్కొని తాగన్న స్వప్నప్రపంచమున్ను తనలోనే దబ్బరై, తానే సుఖియైయుండె గనక, ప్రపంచభావమున్ను మిథ్య. అయితేను, తోచేది చెడలేదుగద అంటేను, గవాక్షుల ఉపాధినిగనిపించే పరమాణువుల వ్యాపారం, బయటంగల మహాప్రకాశాన గనిపించనట్టె, దృఢవివేకానజూస్తే ప్రపంచమనెడిదేలేదు. అఖండాద్వయజ్ఞప్తిపరిపూర్ణమే తాననెడిది సిద్ధము. "విద్యాయా-మనచింతాయాం వేదాంతవాక్యశ్రవణజాతస్యాత్ ముక్తిరాత్మపరమైకృతాధియా మోహబంధవిలయెనిజస్థితిః" అని నివృత్తిక్రమం చెప్పంబడెను. ఇంక నివర్త్య నివర్తకభావం నిరూపిస్తున్నారము. అదియేలాగంటేను, అవిద్యనివర్త్య, విద్యయిప్పుడు నివర్తకమని చెప్పవలెను. అయితే, నివర్తకలక్షణమున్ను పరమాత్మకుగారాదా అంటే, అక్కడ అవిద్య అనేదే తోచకేయుండవలెను. అదియేలాగంటేను, అస్మదాదులయందు కూటస్థచైతన్యానకున్ను అవిద్యకున్ను సహచర్యగలిగియున్నది గనక, పరమాత్మకున్ను అవిద్యకున్ను విరోధంలేదని తెలియవలెను. అందు అవిద్యకు, వివేకజ్ఞానం విరోధం. అదియేలాగంటేను, తత్వజ్ఞులయందు వివేకజ్ఞానం గలిగియున్నది. గనక, అందువల్ల అవిద్యకు విద్యేవిరోధము .విద్యావిద్యలురెండున్ను మాయాశౌర్యాలు గనక, మాయయొకటియందే నివర్త్య, నివర్తకమనేద్వైరూప్యమున్ను ఘటిస్తున్నదన్నట్టే. అమాయ గుణత్రయసామాన్యంవల్ల ప్రకృతి అనిపించుకొనును. దుష్కర్మవిశేషంవల్ల తామసప్రధానమై సాత్వికమును మూసుకొని అవిద్య అనిపించుకొనును. సత్కర్మసామర్థ్యంవల్ల, సాత్వికగుణప్రధానమై అవిద్యకు విరోధమై విద్య అనుపించుకొనును. అదియేలాగంటే స్వల్పోదకాలనయిన పంకిలానకు, బహుళోదకము విరోధైయుండును. అవిద్యామూలమునున్ను విద్యేచెరచును. ఈ యర్థమందు చిత్రదీపికకలదు. "తచ్ఛేద్విరోధికేనేయమావ్యతిర్యనుభూయతాం। వివేకస్తువిరోధిస్యాత్ బ్రహ్మజ్ఞానినిదృశ్యతామ్॥ అని కలదు. అవిద్యా నివర్తకమైన విద్యయు బ్రహ్మనిష్ఠమైయుండును. బ్రహ్మమున్ను అవిద్యాకారిగాబట్టి, విద్యానివర్తకంగానేరదు. విద్యయును తనకుదానే చెడునంటేను యిప్పుడు, అంధకారం తొలగించిన దీపప్రభాశక్తి అంధకారమునున్ను తొలగించి తానూచెడిపోవునా అంటేను తిరుగాను అంధకారమున్ను ప్రాప్తంగావలెను. అందుకై విద్యకు నిత్యత్వమే చెప్పవలెను. అయితే వాస్తవమైనందువల్ల, బ్రహ్మమున్ను విద్యావంతమాయెనా అంటేను, "గుణానామాశ్రయోద్రవ్యం," అని పూర్వపక్షంగలుగంబట్టె. అక్కడ బ్రహ్మమున్ను గుణియై, పంచభూతాలవలెనె ఖండం గావలసియుండును. ఈ విద్యాశక్తి వైచిత్ర్యం గలిగిందై, లక్షణంగలిగింది గాబట్టి, పృధ్వ్యాది గుణాలవలెనే అనిచెప్పరాదు. అయితే, గంధాదివైచిత్ర్యమున్ను మహేంద్రజాలమందుకలదాఅంటేను, అమహేంద్రజాలమున్ను పురుషుని శక్తియుక్తిసాధ్యమైఉండును. ఈ విద్యాశక్తిన్ని అచింత్య వైచిత్ర్యం గలిగిందిగాబట్టి, పృధ్వ్యాదిశక్తులవలె నంగీకరించరాదు. గుణాలున్ను బంధకంగాదా అంటే, అప్పుడు తనసామర్థ్యమున్ను ఒరులంబంధించునింతేకాని,

తనసామర్థ్యం తన్నే బంధించనేపదు. అయితే, బ్రహ్మనిర్గుణమని ప్రతిపాదించే శ్రుతులకు అనర్థంవచ్చెగదా అంటే, ఛేదక్రియంజేసిన పురుషుండు గొడ్డలి అవల వేయును. రాజసతామసాలంగల అవిద్యను తొలగించిన విద్యయొక్క సత్వగుణం కార్యార్థంగావచ్చేవాటితోగూడా బోయెగనక నిర్గుణమై శుద్ధవిద్య అనిపించుకొనును. అయితే గుణిగుణాలకు సమవేతత్త్వలక్షణం కలదుగనుక, గుణంతోడనే గుణిన్ని చెడిపోదా అంటేను, అమాయ "అచింత్యత్వాద్వైచిత్ర్యాత్," అనే హేతువువల్లనున్ను అఘటితఘటనాపటీయసిమాయా, అనేలక్షణం గలిగింది గాబట్టి అమాయ, గుణ సంయోగిన్నీ గుణాతీతానూ అయియుండిన్ని నివృత్తికాలమప్పుడు నిర్గుణశుద్ధవిద్య అనిపించుకొనును. అటుగనక మాయ అనిర్వాచ్యశక్తి అయినందువల్ల, స్వానుభవ రహస్యమింతేకాని, నానామతభేదకల్పితాలు ఘటించనేరవు. అటుగనక బ్రహ్మ మన్నాను శుద్ధవిద్యయన్నాను వృక్షమహీరుహమన్నట్టె పర్యాయవాచి, యింతేకాని గుణగుణిభావంగాదు అటుగనక, ఈ మాయ అనెడిది ప్రవృత్తికాలమందు గుణ త్రయానుషంగియై జీవజగదాకృతితోడను, అతిస్థూలరూపమై, నివృత్తికాలమందు గుణత్రయాలనుమీరి అతిసూక్ష్మరూపంతోచేటట్టు శుద్ధవిద్య అనే అభిధానంతో బ్రహ్మ మందే లీనమాయెననేదిప్పుడురహస్యము. అయితే ప్రపంచము మిథ్య అయినందువల్ల విద్యా విద్యాత్మకమైన మాయయును మిథ్యకారాదా అంటే, అక్కడ చిత్రకారుడు యుక్తిని గల్పించిన చిత్రపత్రికలు మిథ్యఅయినచోట, అందుతోచేట్టు ఆ కల్పించిన యుక్తులు జెడిపోక ఆదేవదత్తునందే లీనమౌను. ఇప్పుడు కాలోచిత ప్రస్తుత వాక్యా లను పలికి రంజింపజేసేవానియందు, ఆ వాక్యవైచిత్ర్యంతోచి మిథ్యఅయినచోట, ఆ విద్వాంసునియొక్క యుక్తివిశేషము అతనందె అనుషంగించుకొనియుండును. అలాగే, నివృత్తికాలమందున్ను, గుణత్రయాలనున్నుమీరి అతిసూక్ష్మరూపమై శుద్ధ విద్యరూపంతోచును. ఆ మాయే బ్రహ్మమందు లీనమాయననెడిదిప్పుడు రహస్యము. ఈ యర్థమందు స్వాత్మయోగప్రదీపికకలదు. "సదసదితరభేదాత్స్వాత్మమోహాదనా దిర్యభిధమపిజీవేశాదిభేదైర్విభాతి శ్రుతిగురుకృతబోధాన్మోహనాశేతదేకమ్ స్ఫురతి మనుజంతద్బ్రహ్మసస్వాత్మయోగః," అని నివర్త్యనివర్తకభావం చెప్పంబడెను. ఇంక మోక్షలక్షణము. అదియేలాగంటేను, "నిరతిశయానంద నిత్యస్వయంప్రకాశ స్వతస్సిద్ధపరమాద్వైత పరిపూర్ణమైన నిలుకడ యిప్పుడు మోక్షము. " అవిద్యాస్తమ యోమోక్షః" అని వేదాంతన్యాయం కలుగంబట్టి అవిద్యానివర్తకమే మోక్షంకారాదా అంటే, బ్రహ్మనకు అవిద్యానివృత్తి అనెడిది ఘటించదు. అదియేలాగంటేను, బ్రహ్మ సదంశానకు ఆవరణమని అంగీకరిస్తే, ప్రపంచానకు అధికరణం లేకుండ వలెను. అయితే చిదంశానకు ఆవరణమా అంటె, "మోహం'' అనే యెరుక లేకుండ వలెను. ఆనందానకు ఆవరణమా అంటే, క్షణికసుఖవృత్తిలేకపోవలెను. పూర్ణత్వానకు ఆవరణమా అంటే, అగమాదిప్రమాణాలతోడట్టు సకల ప్రపంచంలోను యెరుకలేక పోవలెను. ఆవరణమనగాను మరుపే. అందువల్ల సచ్చిదానందాలకు ఆవరణం లేదు గాబట్టి, మోక్షమున్ను బంధప్రతియోగి అనెడిది ఘటించదు. అయితే, అవిద్యలేకుంటే

ప్రపంచంతోచేది యేదిఅంటే, అవిద్యవుండబట్టి, ఆత్మ తన్నుతానేరిగేటప్పుడు అవిద్య విరోధిగానేరదు. అదియేలాగంటేను బహుజనసంఘమందు, ఒకరికొకరు తమ భోజనాదిక్రియలప్పుడు కట్టినతెరలు, పరదృష్టికి బంధకములంతేకాని తమకు మరుగుగానేరవు. ఏకాత్మ పక్షమందు తన్ను తెలిసేవేళ అవిద్య మరుగుగానేరదు. అనేకాత్మపక్షమందున మరుగుగానేరదు. తనకావృత్తికలదనేటందు, "అహమజ్ఞ" అనెడి ప్రమాణంగారాదా అంటే; ఆ అజ్ఞత్వము నెరుగుచున్నాడు గనుక, ఆవరణంగానేరదు. చోర, నటన యింద్రజాలాదుల కృతక మున్ను పరవంచనార్థమింతేకాని తనకు మోహకంగానేరదు. అటువలెనె యింక సూక్ష్మవివేకంచేతజూచే ఆత్మ నిత్యముక్తమనేదె ప్రసిద్ధము. ముక్తత్వమే సహజ మయితేను, బోధధోరణి యేలాగంటే, "సుప్తోహం, మృతోహం", అనేవానికి, యేలాగున పలికెను అంటేను, నీవు సుప్తుండవుగావు మృతుండవుగావు అనును. తనకు నాలుకలేదు అని పలికేచోటను నాలుకలేకుంటే, నీపలుకెక్కడనుండి వచ్చును. "మోహం" అనే యెరుకముందుగా ప్రపన్నుడైనవానికి, గురుమహా వాక్యంవల్ల నిత్యానంద స్వరూపివి నీవని మునుపు ముక్తుండైనవానినే ముక్తుండనె నంతేకాని, వేరే ఒకముక్తిని కొత్తగాదెచ్చియియ్యలేదు. గాబట్టి నిరతిశయానంద మనెడిదే ప్రసిద్ధము. ఈ యర్థమందు శ్రుతి, "ముక్తశ్చముచ్యతేజంతుః" అని ఛాందోగ్యంగలదు. "అవిద్యాస్తమయోమోక్షః," అనే లక్షణానకు తాత్పర్యం యేలాగంటేను, బహువాదాలవారున్ను, మత భేదాలవల్ల మోక్ష వస్తువు అనిర్వచనీయ ధర్మం అభావమనిన్ని, "ఏకవింశతిదుఃఖవిభేదలక్షణోమోక్షః," అనిన్ని, "మృత్యురే వాపవర్గః", అనిన్ని, "విశిష్టాదృష్టతేమోక్షః", అనిన్ని, మనోగుప్తి, వచనగుప్తి, కాయ గుప్తి అనిన్ని, సమ్యగ్దర్శనమనిన్ని బహువిధాలబలికేది క్రియాసాధ్యము. సాతిశయ మోక్షాలకు క్షయిష్ణుత్వసాధన పారతంత్ర్యసాతిశయమనెడి, దోషత్రయంగలదు గాబట్టి, జడమని ప్రతిషేధించెడిచోటను, "అవిద్యాస్తమయోమోక్షః," అనెడిది తాత్పర్యము. మరికొందరనుభవమెరుగని శుష్కవేదాంత శాస్త్రజ్ఞానులయందు వ్యవహారమున్నది కనుక, ఆత్మకజ్ఞానావరణం కద్దందురు. అదియేలాగంటేను "పృథుత్వధౌతతే," కాంతివిశేషంగలిగిన స్ఫటికమందు, జపాకుసుమంయొక్క పృథుత్వానకున్ను, కాంతివిశేషానకున్ను, ఆవరణంగాక ధౌతానకు మోహకమై స్ఫటికమనిపించుకొనును. "ఇదంరజతం" అనే చోటభ్రాంతిన్ని, శుక్తియొక్క యిదమంశమునున్ను, .... .... .... అచ్ఛాదించకే, నీలవృష్ఠత్రికోణాలను అచ్ఛా దించును. సచ్చిదానందనిత్యపరిపూర్ణములనెడి అయిదు పదాలయందున్ను, సద్రూప చిద్రూప నిత్యరూపములు, సర్వత్ర జనానుభవసిద్ధములై ఉన్నవి గనక, ఈమూడు విధాలకున్ను, ఆవరణంలేదు. గనుక, పరమాత్మయొక్క ఆనంద పరిపూర్ణ పదాలకు అవిద్య ఆవరణమై ఉండునందురు. అయితే కించిత్సుఖప్రవృత్తికలిగి ఉన్నదికదా అంటే క్రొత్తకడవలోనిండిన ఉదకము, తుషారరూపముచేత వెలుపలకు ద్రవించును. ఆవరణమై ఉండిన్ని క్షణిక విషయానందాలు యితరాలయందు తోచును శ్రుతి

గురుస్వానుభవం వల్ల, దేహేంద్రియాద్యావరణవిక్షేపాలకు విలక్షణమైన అతండు ముక్తుడందురు. విలక్షణమనగా తనకు అగుణాలు లేవనుట. అందు అవరణశక్తికి స్వరూపం జ్ఞానోదయమందు పర్యవసానము. పర్యవసానమనగా విరగడ అనే అర్థము. విక్షేపశక్తికిప్రారబ్ధము తోడ పర్యవసానమనెడిది. ఈషద్భేదం వల్ల "అవిద్యా స్తమయో మోక్షః", అందురు. అది నమ్య క్స్వానుభవం వల్ల జూస్తే, త్రికాలాలయందున్ను అవరణవిక్షేపాలు లేవుగా బట్టి, నేను అని పలికెడిది కల్పితము. విక్షేపశబ్దమున్ను దేహం వల్లనైన రోగకుటిల, సహజనిత్య, నిరుపమనిర్వికార, నిరతిశయపరిపూర్ణా నందము. మోక్షమనెడిదిప్పుడు ప్రసిద్ధము. అందుకు శ్రుతి, "ప్రజ్ఞానమా నందో బ్రహ్మ, జింహ్వామే స్తనమెత్యు క్తిర్లజ్జాయై కేవలం యథా, నబుధ్యతె మయా బోధో బోద్ధవ్య యితి తాదృశ, ఇదంహి నత్యం మమ నాస్తి విక్రియా, వికారహేతుర్నహి మేర్ధయత్వతః నపుణ్యాపాపేనచ మోక్షబంధనె, నజాతివర్ణా శ్రమకా శరీరతా" అని ఉపదేశ సహస్రిక కలదు గనుక "విహాయకామాన్యః నర్వాన్పుమాంశ్చరతి నిస్పృహః। నిర్మమో నిరహంకారః, నశాంతి మధిగచ్ఛతి"[1] అని భగవద్వాక్యం కలుగంబట్టి, సూక్ష్మవివేకం నివర్త్య నివర్తకభావం చెప్పబడెను.

ఇతి శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ యతికృతౌ బ్రహ్మవిద్యాసుధార్ణవే యోగశాస్త్రే సూక్ష్మవివేక నివర్త్యనివర్తక భావనిరూపణంనామ తృతీయప్రకరణం నమాప్తమ్

[1] చూ భగవగ్గీత 2, అ శ్లో 71.

# నాల్గవ ప్రకరణము

నమామి సద్గురుం శాంతం ప్రత్యక్షం శివరూపిణమ్ ।
సిరసా యోగపీఠస్థం ముక్తికామార్థసిద్ధయే ॥
భూయః కర్కశతర్కవక్రవచసాం దుర్మేధసాం దంతినాం,
శశ్వద్గల్లచపేటపాటవవిధౌ దుర్వీక్ష్యహర్యక్షతామ్ ।
లభ్యేత్యనురతాహ్యనేన పరమానందేన కర్మందినా,
నీయంతె సుఖమత్ర దుర్లభతరా మధ్యాత్మపథ్యాంజనాః ॥
మోక్షధీదత్తహస్తేన మహావాక్యార్థవాదినా ।
పరమానందతీర్థేన నిర్మితా దశవర్ణతా ।
ప్రత్యక్షసిద్ధం భేదంహి మత్వా తార్కికపండితాః ।
యుక్త్యైవ కేవలం ప్రజ్ఞాస్త్రాన్వయం బోధయామహె ॥

కృతకృత్యులైన ముముక్షువులు కేవలశబ్దాడంబరంవల్ల మదోన్మత్తులై, తర్కవివాదపరాయణులై, అనిశ్చితసిద్ధాంతులైనటువంటి కొందరు విద్వాంసులు బ్రహ్మానుభవసిద్ధి కలుగం జేసుకోనెరుగరు గనుక, ఆముముక్షుజనుల విషయీకరించి పరమానందతీర్థులు, ఏకాత్మవాదము నవలంబించి, యీప్రకరణమందు భేదవాదఖండనమున్ను కర్మకాండమున్ను నిరూపిస్తున్నారు. జీవేశ్వరులకు తమలో భేదప్రతిపత్తిని సంపాదించెడి నయ్యాయికశాస్త్రమును శ్రుత్యనుమానాలచేత ప్రతిషేధించుటే భేదవాదఖండనం. అందు ఒకటికొకటిగా యెంచిచూపె శిలాకాష్ఠాలయందు ఖండితాది క్రియలచేతను సాధ్యరూపమైన ద్వైధీభావం గల్గుటయేలాగో అలాగే, యేకాత్మవాదమును సిద్ధవత్కారం జేసేది. వేదాంతశాస్త్రమును కొన్ని యుక్తులచేత ఖండించి తత్ఫలరూపమైన ద్వైధీభావంగల, నయ్యాయికశాస్త్రానకు వేదాంతోపాధిగలదా అంటే కలదు. అక్కడ పూర్ణమైన ఆకాశానకు సాధనం ఘటించకుండిన్ని, ఖండితాది దోషమును యేలాగు పొందకుండిన్ని, అలాగే పూర్ణత్వమే సిద్ధంగా గలిగిన వేదాంతశాస్త్రానకు ఖండితాది దోషమనెడిది యథార్థంగానేరదు. ప్రాదేశకలక్ష్యంవల్లను ఒకటెంచి తోచెకాష్ఠశిలాదులయందు కుఠారసాధనం గలిగినందువల్ల, ఖండితాదిదోషం యేలాగు అలాగే, ప్రాదేశకలక్షణాలంగల భేదసిద్ధాంతం ఒకటను ఖండితాదిదోషం ఉండును. అదియేలాగంటేను, "నానాత్మనో వ్యవస్థాతః । ఆత్మత్వసామాన్యవాణ । దేహేంద్రియాద్వ్యతిరిక్తః । ప్రతిశరీరం భిన్న విభుః ॥ నిత్యః సుఖదుఃఖాద్యనుభవో వ్యవస్థా" అని భేదసిద్ధాంతులు ఆత్మను ప్రతిపాదించే యిష్టవాక్యాలు. అందు "నానాత్మనో వ్యవస్థాతః" అనే వాక్యానకు విచారం కశ్చిత్సుఖీ కశ్చిద్దుఃఖీ అనేవ్యవస్థనుండి, ఆత్మలు అనేకాలు, ఈలాగు

గాకుంటె "యేకముక్తా సర్వముక్తి ప్రసంగః," అనెడి బాధకం కలదని భేదవాదులు ప్రతిపాదింతురు. అందుకుత్తరం. ఒక ఆత్మకు ఏకకాలమందె "పాదే మే వేదనా, శిరసిమే సుఖం" అనెడి జ్ఞానద్వయమున్ను, సార్వజనితమై యుండును. అక్కడ యీపశ్చాత్కాలభేదం గలదంటివా, ప్రారబ్ధవైచిత్ర్యము నిమిత్తానకు చెల్లదుగనక, కాలభేదమును అనుసరించేదిగాదు. అందు నానాత్మలనే పక్షాన ప్రమాణం లేదు అటుగనుక నానాత్మలనేవాక్యం నిరస్తమాయెను. "ఆత్మత్వసామాన్యవాన్" అనే వాక్యానకు విచారం. మీయాచార్యమతాన వ్యక్తిభేదం లేదనేటందువల్లను, జాతి భేదం లేదు గనుకనున్ను, మేము ఆత్మకు ఏకత్వం సాధిస్తున్నారము గనక, ఏకవ్యక్తియందు సామాన్యమనెడిది లేదు గనకనున్ను, "ఆత్మత్వ సామాన్యవాన్" అనే వాక్యం నిరస్తమాయెను. "దేహేంద్రియాది వ్యతిరక్తః" అనే వాక్యానకు విచారం. ఏకాత్మ అయిన పట్టున సమానము. "ప్రతిశరీరం భిన్నః" అనే వాక్యానకు విచారం. భిన్నః అనెడిది అన్యోన్యతాదాత్మ్య స్వరూపాలయందు మూడు విధాలై యుండును. అందు విచారం. భేదస్స్వాత్మనాసిన్వర్తతె, అని భేదమును సాధించెనంటివా, అప్పుడు ఆత్మాశ్రయదోషమవును. మరొకభేదం చేతను యీభేదానకు సిద్ధియని, ఆత్మాశ్రయదోషమును పరిహరించెనంటివా, ఉత్తరభేదం సిద్ధించక పూర్వభేదం సిద్ధించదు. పూర్వభేదం సిద్ధించక ఉత్తరభేదమున్ను సిద్ధించదనెడి అన్యోన్యాశ్రయదోషం గలుగును. ఏతద్దోషపరిహారార్థమై, యికనొక భేదమంగీకరింతునంటివా, అప్పుడు చక్రికాశ్రయదోషం కలుగును. భేదాంతరమందు సిద్ధియంటివా, ఆభేదమున్ను మరొకభేదంవల్ల సిద్ధంగావలెను అనేపరంపరవల్ల, అనవస్థాదోషం ప్రసక్తమౌను. భేదమనెడిది నిర్వహించ శక్యంగాదు గనక, ప్రతిశరీరం భిన్నః అనే వాక్యం నిరస్తమాయెను. విభుః అనే వాక్యానకు విచారము. విభుః అనెడిది ఏకవస్తునిష్ఠ ఒక్కటి వికల్పము. అందు అనేకత్వాలంగల దిక్కాలాకాశాదులయందు విభుత్వమేలాగో ఆలాగే. అనేకవస్తునిష్ఠమైయుండు నంటివా, అందు దిక్కాలాకాశాదులు విజాతీయమైన కారణాన, అందు విభుత్వప్రసంగం గలుగును. దర్పాంతమైన జీవులు ఆత్మత్వేన సజాతీయత్వమనెడిది అదిక్కాలాకాశాదికాలకు గుణాలున్ను స్వరూపమున్ను భిన్నమైన కారణాన గుణాలయందు భేదమున్ను ఉన్నది గనక, ద్రవ్యత్వేన సజాతీయమనేది యేకత్వసాధకం గానేరదు. అవునంటివా, అప్పుడు నవద్రవ్యాలకున్ను యేకత్వప్రసంగం సంభవించును. అటుగనక, అనేకాత్మపక్షానను విభుః అనే వాక్యమున్ను నిరస్తమాయెను. నిత్యః అనే పదానకు విచారము. నిత్యత్వము యేకవస్తు నిష్ఠమే అని వికల్పం. అందు అనేక వస్తు నిష్ఠయంటేను, కార్యజాతానకు నిత్యత్వప్రసంగం ఘటించక నిత్యవస్తువు లయినందుకే నిత్యత్వం గాక కార్యజాతానకు నిత్యత్వంగారాదా అంటివా, అప్పుడు ఆత్మవ్యతిరేకేన నిత్యవస్తువె సంభవించును. ఈయర్థానను "ఆత్మన ఆకాశస్సంభూతః" అనే వాక్యమే ప్రమాణము. అందువల్లన నేకాత్మపక్షమందు నిత్యమనే పదమున్ను నిరస్తమాయెను. ఈవాక్యబలాననుండి భేదసిద్ధాంతమున్ను నిరస్త

మాయెను. అంటేను సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వాది భిన్నగుణాలుగల జీవేశ్వరులున్ను ప్రత్యక్ష ఆగమ సిద్ధంగా నుండబట్టి ఖండితమాయె నంటివా, అందు గుణాలకు సమవాయ సంబంధమైనందువల్ల గుణానంగూడి గుణిన్ని ఐంద్రికమే కావలెను. అయితే మాకు యిష్టాపత్తి అంటివా, గుణత్వసామర్థ్యంవల్ల ఈశ్వరుడున్ను ఐంద్రికమే కావలెను. అవుగాక అని అంటివా, "న్వర్ణానుమేయో వాయుః" అన్నట్లు ఈశ్వరునికి వేద్యత్వప్రసంగం గలుగును. వేద్యత్వమనగా యేమనంటివా వేరొక వేతృవువల్ల దృశ్యమై జడమై యుండుననుట. అటు గనక గుణభేదాలవల్ల భేదప్రసక్తి అనేడిది ఘటించదు. అయితే మాయాత్మలయందు అభేదవ్యవహారానకు యేలాగంటేను అమాయె మనసిద్ధాంతమందు బహుయుక్తుల చేత విచారసిద్ధం, విచారేణ లయమని నిర్వహిస్తిమి గనక, మాయాత్మలయందు ద్వైధీభావమనేది లేదు. నీయొక్క భేదమనేదిన్ని యీమాయాకార్యమైనందువల్ల అవిచారసిద్ధమేకాక, భేదమనేది సత్యంగాదు. అయితే "ద్వాసుపర్ణా సయుజౌ సఖాయా" అనే శ్రుతి భేదవాచకం గాదా అంటివా, అశ్రుతిన్ని "తయోరన్యః పిప్పలం[1] స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి" అని కలదు గనక, అవిచారసిద్ధమైన జీవుండె కర్తృ భోక్త కూటస్థచైతన్యమై నిత్యతృప్తమైయుండును. అని వర్తన ప్రశంసను చేసేటందలి తాత్పర్యంగాని అశ్రుతికి భేదసిద్ధియందు తాత్పర్యమనేది లేదు. అయితే, భేదో జీవః ఈశ్వరాద్భిం నహః యిత్యాది ప్రపంచభేదము ప్రత్యక్ష సిద్ధమై ఉన్నదిగదా అంటివా, ప్రత్యక్షమందు శంకితాది దోషాలు గలవంటె శ్రుత్యను మానాలు ప్రబలం గాక ప్రత్యక్షమున్ను ప్రబలం గాదు. అటైనా ప్రత్యక్షమే ప్రబలమంటివా అప్పుడు స్వప్నమహేంద్రజాలాలు మొదలుగా గలిగినవి తమతమ కాలాలయందు యధార్థమనేటట్టే ఉన్నవి గనక వాటికిన్ని ప్రామాణ్యం గలుగవలెను. అయితే "యావద్బాధం ప్రామాణ్యం" అని కలదు గనక వాటికి ప్రామాణ్యం గలిగితేనేమి అంటివా అప్పుడు శుక్తిరజితాదులయందు ప్రామాణ్యం కలుగవలెను, అనేదిప్పుడు దోషం. అశుక్తిరజిత స్వప్న మహేంద్రజాలాదులయందు ఉత్తరోత్తరభావకం గలుగంబట్టి అవిన్ని ప్రాతిభాసకమాత్రమే కాని సత్యంగాదు. తమ అచార్యులు ప్రమాణలక్షణం చెప్పేటప్పుడు సంశయ, మిధ్యాజ్ఞానమును తొలగించవలె గనక యధార్థానుభవప్రమాణం చెప్పినారు. యధార్థానుభవవిషయమైన సకల వికల్పనిర్వికల్పాత్మకమైన యీ యర్థేంద్రియ సన్నికర్షత అనెడి ప్రత్యక్షమున్ను మిధ్యాజ్ఞానోపాధి అనరాదాఅంటివా నీకు యీప్రత్యక్షంవల్ల ప్రతీతమానమై సిద్ధవత్కారం చేసుకొన్న యీభేదప్రపంచమున్ను యేలాగైనా యధార్థానుభవజ్ఞాన విషయమైతే యిప్పుడు బాలకుడు అని కన్నప్రత్యక్షమందు కాలాంతరమందున్ను ప్రత్యక్షమై యుండవలెను. మొలక అనిపించుకొన్న చెట్టున్ను కాలాంతరమందు అ వృక్షము మొలక అనిపించుకోవలెను. మునుపు బాలకుడు అనిపించుకొన్న యీ యధార్థానుభవజ్ఞానేంద్రియ సన్నికర్షరూపమైన ప్రత్యక్షమే, యౌవనమనే

---

[1] పిప్పలమనగా కర్మఫలము.

ప్రత్యక్షంవల్ల బాధింపబడుచున్నది. అయౌవనమనే ప్రత్యక్షం వార్ధకమనే ప్రత్యక్షం చేత బాధకమౌచున్నది. అవార్ధకమనే ప్రత్యక్షమే వినశ్యతి అనే ప్రత్యక్షంచేత బాధకమౌచున్నది. ఆ వినశ్యతి అనే ప్రత్యక్షము అనూత్తరమై యున్నది గనక, నీ యొక్క ప్రత్యక్షంవల్ల ప్రతీతమానమైన యీజగత్తు వినశ్యతి అనే ప్రత్యక్షం చేత బాధింపబడుచున్నది. గనక శుక్తిరజితోపాధియందు మిథ్యాజ్ఞానప్రతీతి గాక, యథార్థానుభవప్రమాణవిషయమనెడిది ఘటించదు. అయితే వినశ్యతి అనేటి సంజ్ఞవల్లనైనా, ప్రత్యక్షమనియెడిది యథార్థమై యున్నది గదా అంటివా అక్కడ వినశ్యతి అనెడిదిన్ని ప్రపంచముయొక్క అభావరూపమంతే కాని ప్రయోజకంగానేరదు. అయితే శుక్తిరజితాది ప్రత్యక్షమున్ను కదాచిత్కర్మమాత్ర మింతేకాని, యీసృష్టి పరంపరవలెను అవ్యవచ్ఛిన్నమై ప్రవహిస్తున్నది అంటివా అందు నీయొక్క సృష్టిప్రవాహమనెడిది అతిచాంచల్యమైనది. పరుగెత్తివచ్చే ఉత్తమాశ్వం వల్లం గన్నదెకాక మునుపు నడచిన స్థలాననున్ను ఆయశ్వం లేనిది యేలాగో అలాగే యీసృష్టిప్రవాహమనెడిదిన్ని మునుపె ప్రవహించినది అనేదిన్ని ఉండక లక్షణమాత్రమైనటువంటి వర్తమానప్రవేశమై యుందిగాబట్టి కదాచిత్కర్మమాత్రమంతే కాని, అవ్యవచ్ఛిన్నప్రవాహమనెడిది ఘటించదు. అయితే తపోబలంచేత భూత భవిష్యద్వర్తమానప్రపంచ ప్రవాహమున్ను కనిపించుగదా అంటివా, అందు క్షుత్తు అడగిన పురుషునికి పూర్వదివసభోజనజ్ఞానం వల్ల ఉత్తరదివసమందు వస్తుంది అనెడి భోజనజ్ఞానంవల్ల ఆకలి దీరక వర్తమానమైన అన్నమే క్షుత్తడగేటందుకు ప్రయోజకమైనట్టు, యీసృష్టియందున్ను వర్తమానముమాత్రమే ప్రయోజకమైనట్టు ఊహించేదంతేకాని, భూతభవిష్యత్ జ్ఞానమందు ప్రయోజకమనేది లేదు. అప్రయోజకమనెడి భ్రామకము పుట్టించెడి యీవర్తమానవ్యవహారప్రతీతి అనేదిన్ని, వర్తమానమున్ను క్షణరూపమయింది గనక సాంగోపాంగ దర్శనానకు వ్యవధానంగా లేదు. అటు గనక యీక్షణికప్రతీతమానమయిన భేదప్రతీతి అనెడిదిన్ని, శుక్తిరజితోపాధియందు అవిచారమాత్రమంతే కాని సత్యంగాదు. అయితే నీవు అద్వైతమని ప్రతిపాదించం ... .... .... .... గానె అద్వైతమనెడిదిన్ని ద్వైతపూర్వకమౌ గాక అంటివా, అందుకు ఒకచంద్రునందు కాచకాది దృష్టిదోష భ్రాంతివల్ల, "చంద్రమసౌ ద్వౌ" అనెడి భేదజ్ఞానము ప్రాప్తమైనది గాబట్టి, చంద్రుడు ఒక్కడే కాని యిద్దరు లేరని అభేదజ్ఞానము ప్రతిషేధించినట్లె, మునుపు గలిగిన ఒక్క వస్తువందు అవిద్యావశంవల్ల, భేదభ్రాంతి దోచగాను, తత్ప్రతిషేధార్థమై, అద్వైతమనెడిది రూఢంగాను ప్రతిపాదించవలసెను. ఈకారణాన ఆ శ్రుత్యనుమానప్రమాణాలచేతను, అతద్వ్యావృత్తిముఖాన స్వరూపలక్షణమై సాక్షాత్కరించినటువంటి సత్యజ్ఞానాత్మకమైన బ్రహ్మమొక్కటె అనెడిదిప్పుడు సిద్ధాంతము. ఈయర్థమందు శ్రుతి:

"ఏకో దేవస్సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ।
కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస స్సాక్షీచేతః కేవలో నిర్గుణశ్చ ।"

అనిన్ని "ఏకం సత్ బహుధా కల్పయంతి" అనిన్ని, అనేకశ్రుతిసిద్ధమై యున్నది గనక భేదవాదఖండనం చెప్పంబడెను. పరంపరా కర్మకాండ సాధనత్వాత్ జ్ఞానకర్మ సముచ్చయః నాస్తీతి మత్వా జ్ఞానాదిమోక్షయిత్యుపదిశ్యతే॥ మోక్షసాధనమైన కర్మకాండ నిరూపిస్తున్నారము. అది యేలాగంటేను, కర్మ మనెడిది మోక్షానకు పరంపరయా సాధనమయింది గాబట్టి చెప్పవలసి ఉండెను. ఆకర్మము మోక్షానకు సద్యస్సాధనంగారాదా అంటేను బ్రహ్మం సిద్ధమైంది గాబట్టి, పరిజ్ఞానమాత్రమంతే కాని, ఉత్పాద్య, ప్రాప్య, సంస్కార్య, వికార్యాలనెడి చతుర్విధ క్రియాసాధ్యంగాదు గనక "జ్ఞానాదేవతు కైవల్యం'' అని ఏవకారవిశిష్టంగాను శ్రుతి చెప్పుచున్నది. అయితే మోక్షవిషయమందు, కర్మజ్ఞానాలకు సముచ్చయంగారాదా అంటే, అక్కడ సకలకర్మాలకున్ను సాతిశయ మోక్షమే సాధ్యం, వివేకజ్ఞానాలకు నిరతిశయ మోక్షమే సాధ్యం. అటుగనక సాధ్యాలు భిన్నమైన చోట సాధకానకు సముచ్చయసమధికల్పం ఘటించదు. అది యేలాగంటే "వ్రీహిభిర్వా యజేత" అని కలదు గనక పురోడాశమే సాధ్యంగాగల వ్రీహులకు సముచ్చయ సమవికల్పత ఘటించదు. అది యేలాగంటె సుఖదుఃఖాలనే భిన్నసాధ్యాలకు, తత్సాధనభూతాలయిన పుణ్యాలకు సముచ్చయ సమవికల్పత ఘటించని చేలాగో అలాగే, సాతిశయ నిరతిశయ మోక్షాలున్ను భిన్నమైన కారణాన బట్టి, తత్సాధనరూపమైన కర్మజ్ఞానలకు సముచ్చయసమవికల్పన అనేది ఘటించదు. అటు గనక, కర్మాలున్ను సాతిశయ మోక్షవిషయమందే. కర్మభక్తులవల్ల చిత్తబుద్ధిద్వారా, జ్ఞానంవల్ల నిరతిశయ మోక్షమైనందువల్ల, క్రియను నిరతిశయ మోక్షమందు పరంపరయా సాధనమని చెప్పవలసి ఉండును. ఆక్రియల స్వరూపం యేది అంటేను స్వర్గనరకాద్యనేకలోక వ్యాపారానకు సాధనమై జీవులకు స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమైన గుణభేద, రూపభేద, భోగభేద భ్రమను బుట్టిస్తున్ను జాతినిష్ఠ ఆశ్రమనిష్ఠమైన కూటస్థచైతన్య స్వరూపమున్నూ తాననేదిన్నీ మరచి దేహకరణాద్యభిమానంచేత తోచేజీవుండనేను అనెడి తత్వాన చేష్టించుకొనెడిది క్రియ. బాహ్యసంవృత్ప్రదమైనందు వల్లను, పూర్వాచార్యులు "అథాతో ధర్మజిజ్ఞాసా" "చోదనా లక్షణార్థో ధర్మః॥ఆమ్నాయస్వ క్రియార్థత్వా దానర్థక్యమతదర్థానాం" అనెడి సూత్రాలచేత, క్రియనే ప్రతిపాదించినారు. శ్రుతులు "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి.""జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" యిత్యాది శ్రుతులున్ను క్రియనే బహుళంగాను ప్రతిపాదించెను. ఆక్రియలున్ను నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధప్రాయశ్చిత్తాలని అనేకప్రకారాలై యుండును. అందు అకరణీయ ప్రకరణీయ, ప్రత్యవాయమనెడి సంధ్యావందన బ్రహ్మయజ్ఞాదులు నిత్యకర్మాలనిపించుకొనును. ఋషి పితృదేవతలనుద్దేశించి చేయంగల యుగాది మన్వాది పైతృకాదులు, నైమిత్తిక కర్మాలనిపించుకొనును. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అనెడి యజ్ఞ, వ్రత, దానాదులు కార్యములనిపించుకొనును. కృచ్ఛచాంద్రాయణాదులు ప్రాయశ్చిత్తకర్మము లనిపించుకొనును.

"న సురాం పిబేన్న కలంజం భక్షయే" దనేవి నిషిద్ధకర్మాలనిపించుకొనును. ఇత్యాది కర్మకలాపము యింకను గర్భసంస్కార రూపమైన ప్రథమావర్త గర్భాదాన సీమంత జాతకర్మాదులు జాతినిష్ఠకర్మాలనిపించుకొనును. మరిన్ని జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయనాదులు గలిగిన బ్రహ్మచారికి అధ్యయన, పఠన, భైక్ష చారణాదులును, గృహస్థుకు శ్రౌతస్మార్త రూపాదులైన సకలాగ్ని హోత్రాలును, వానప్రస్థునకు కందమూలవాతాద్యాహార, అరణ్య వాస, ధ్యానతీర్థ యాత్రాదులును ఈఆశ్రమనిష్ఠకర్మాలున్ను ప్రవృత్తికర్మాలు అనిపించుకొనును. సన్యాసకర్మమనెడిది నివృత్తికర్మ మనిపించుకొనును. అదియేమి అంటేను, "స్నానం శౌచం తథాభైక్ష్యం నిత్యమేకాంతశీలతా, భిక్షోశ్చత్యాది కర్మాణి పంచ మన్న విధియతే" యివి నివృత్తికర్మము లనిపించుకొనును. ఇంకను సకలజన నిష్ఠమైన కర్మాలు వృక్షస్థాపన తటాకస్థాపనాదులు యిత్యాది కర్మములు కార్మిక కాయిక వాచిక మానసికములనెడి చతుర్విధ రూపాలం చెప్పబడుచునుండును. అది యేలాగంటేను, ద్రవ్యదండనమే కార్మికమనిపించును, దేహదండనమే కాయికమనిపించును, వాగ్దండనమే వాచికమనిపించును, మనోదండనమే మాన సికమనిపించును. ఈ క్రియలకు ఫలం యేదిఅంటేను, అన్నవస్త్రహిరణ్యాది దానరూపాలయిన కార్మికమనే తపస్సు, తారతమ్యానం బట్టి బహువిధభాగ్యసం పన్నుం డయ్యేది అందుకు ఫలం. ఉపవాసతీర్థయాత్రాది దేహదండనమనే క్రియ తారతమ్యానం బట్టి, నరలోకమందు ద్విజశ్రేష్ఠత్వమైనాను సురలోక మందైనాను సేవ్యమానత్వం గల దేహం గలుగుట అందుకు ఫలం. అధ్యయనాది జపస్తోత్రపఠనరూపమైన వాఙ్మయ తపస్సు తారతమ్యానం బట్టి, అణిమాద్యష్ట సిద్ధి, త్రైలోక్యాకర్షణ, ఖేచరత్వ సకలకలాభిజ్ఞత అందుకు ఫలం. నిత్యానిత్యవస్తు వివేకం యిహాముత్ర ఫలభోగవిరాగం శమదమాదిసంపత్తి మొదలయిన షట్క సాధనసంపత్తి, ముముక్షుత్వ వివేకమనెడి మనోదండనా రూపమైన తపస్సు తారతమ్యానం బట్టి పరంపరాచిత్తశుద్ధిద్వారా, సాతిశయ నిరతిశయ రూపమైన మోక్షమందుకు ఫలం. ఈ తపఃఫలాలు వ్యవహారబలంవల్ల తెలియవలెను. మూర్ఖులయిన్ని నీచజన్ములై ఐశ్వర్యయుక్తులై యుండేవారియందు కించిద్ద్రవ్య దండనా రూపమైన తపఃఫలమని తెలియవలెను. అతిదరిద్రుండై మూర్ఖుండై బ్రాహ్మణుండునైన యాతనియందు కించిద్దేహదండనా రూపమైన తపఃఫలమని తెలియవలెను. బ్రాహ్మణుండున్నై బహుభాగ్యవంతుడున్నైన అతనియందు కించి ద్ద్రవ్యదండన, దేహదండన, ఈయుభయతపఃఫలమని తెలియవలెను. భాగ్యయుక్తు లైన విద్వాంసులయందు కించిద్ద్రవ్యదండన దేహదండన వాగ్దండనారూపము లయిన తపఃఫలాలని యెరుంగవలెను. విద్వాంసుడై రాగద్వేషియై, దురభిమానియై అనిశ్చితసిద్ధాంతియై జయాపజయ వివాదపరుండై యుండే విద్వాసునందు మనో దండనారూపమైన తపస్సు నాచరించిన వాడు కాడని తెలియవలెను. ఏమనుష్యుండై నానేమి, బ్రహ్మాత్మైక్యజ్ఞాన విచారం ఎవడు చేస్తున్నాడు అతడు మనోదండన అనేది

ముఖ్యంగాను, త్రివిధమైన తపస్సునున్ను ఆచరించిన తపఃఫలమని తెలియవలెను. సకల తపస్సులకున్ను ఒక్కటే ప్రధానఫలం. ఆ ఫలమే అనేకాలైన ఫలాలం గలిగిందై యుండును. ఆఫలమె దృష్టాదృష్టమై ద్వివిధమై యుండును. ఏదొకటైనానేమి దృష్టకాలమందు కించిత్సౌఖ్యదర్శనం చేస్తూఉండును. అది జన్మాంతరమందు బహుక్లేశఫలానం గలిగినదని తెలియవలెను. ఏదైనా యొకటి ఆరంభకాలమందు కించిదాయానం చేస్తూ ఉండును. అది కాలాంతరమందు బహుసౌఖ్యాలం గలిగినదని తెలియవలెను. అందు ఫలస్వరూపాలు యేదిఅంటే ఈశ్వరుని నిగ్రహానుగ్రహాత్మకమైన సురనరతిర్యగాద్యనేక సుఖదుఃఖ ఫలాత్మకమైన అనేక సృష్టి స్థితిలయసంపత్తి ఫలమనిపించుకొనును. ఆఫలసంపత్తులనెడివి అనేకాధారములు కలవిగనక ఆ సంపదలకు ఆధారమైన అభిమానచైతన్యమే యీశ్వరుడు. బ్రహ్మవిష్ణు మహేంద్రాదులనే సంజ్ఞలం గల తత్తత్సాధనఫలదాతలై సంపదాధిదేవత లనిపించుకొందురు. క్రియతో గూడి యుండేవారే, నైమిత్తిక దేవతలనిపించుకొందురు. అటువంటి కర్మములనెడివి, యీజీవులకు సంచిత ప్రారబ్ధ ఆగామి రూపాలనుండును. అందు సంచితమనెడిది ఫలరూపమై యుండును. ఆసంచితఫలరాసులలోను, జన్మానకు వ్యవహరించునదే ప్రారబ్ధరూపమైయుండును. ఆ భోగాలు తమతమ భావాలం బట్టి, బుద్ధిన్ని తత్తదుపాధి వడయుంగాను, ఆయుపాధివల్లను మునుపే చేసిన ఆగామి కర్మములున్ను క్రియారూపమై యుండును. అందు ఫలమనెడిది ప్రబలఫలమని, సాధారణఫలమని రెండువిధాలై యుండును. అందు ప్రబలఫలమనెడిది పూర్వభావిత్వం గలిగింది. సాధారణ ఫలమనెడిది పశ్చాద్భావిత్వం గలిగింది. కర్మముల లఘుత్వమే ప్రాణుల లఘుత్వమై యుండును. కర్మముల గురుత్వమే ప్రాణుల గురుత్వమై యుండును. కర్మముల శత్రుత్వమే ప్రాణుల శత్రుత్వమై యుండును. అటు గనక, కర్మముల తరతమ భావమంతేకాక ప్రాణిమాత్రానకు తరతమ భావమనెడిది లేదు. క్షుద్ర కామ్యములె తామసకర్మములు. ప్రసిద్ధ కామ్యములే రాజసకర్మములు. ఈశ్వరార్పితమైన నిష్కామ కర్మములె సాత్వికకర్మములనిపించుకొనును. ఈశ్వరార్పిత బుద్ధింగాని ఫలమియ్య నేరవు. అది యేలాగంటే, ఒకానొక పురుషుని ఆశ్రయుంచి చేసిన క్రియకు ఫలం కద్దుగాబట్టి, వ్యర్థకృత్యం చేసినందువల్ల ఫలం లేనట్టే. తత్తత్ఫలాది దేవతల నుద్దేశించి జేసిన క్రియ ఫలించును. అటువంటి క్రియ యున్నూ ఆరంభించే కాలమందు, కర్త్రాధీనమై యుండును. ఆ కర్త్రాధీనమైనది ఫలకాలమందు భోగవశుడుగాగాను, అప్పుడు ఫలసామర్థ్య మనిపించుకొనును. కర్మముల నారంభించే కాలమందు కర్త సాత్వికప్రధానుండై యుండును. భోగకాలమందు భోగవశుడై తామసంతో గూడినవాడై పుణ్యపాపసుఖదుఃఖఫలాదులంగల జీవునికి దివారాత్రులు తోచినట్టె తోస్తుండును. అటుగనక, "సుఖంమ్మెస్యా దుఃఖం మాభూయాత్" అని కలదు గనక, జీవులు తత్తత్కర్మవిశిష్టమైన భోగాంతరముగాను, తత్తత్సంజ్ఞలం గలిగి యుందురు. అదియేలాగంటే ఇప్పుడు వంశా

స్వయసంపదనెడిది బహుజీవాధారత్వం గలిగిందై యేలాగున్నదో అలాగే. అనేక ఫలరూపసంపదలున్ను అనేక ప్రాణులకాధారం గలిగినవై యుండును. ఇప్పుడు సార్వజ్ఞమనే సంపదను సంస్కారఫలంవల్ల వినియోగం చేసుకొనుచుండే జీవుండు సార్వభౌముడనే పిలిపించుకొనేటట్టె యీశ్వరత్వమనే నంపదను వినియోగించుకొనియుండే జీవులు సంస్కారఫలంవల్ల తాము సారూప్యముం బొందుదురు, తాము యీశ్వరుడనే పిలిపించుకొందురు. ఇంక విష్ణుబ్రహ్మాద్యనేక సంపదలను సంస్కారఫలం చేత వినియోగించుకొని యుండే జీవులు భోగాంతరంగాగల తత్తత్సంజ్ఞలను తమతమ ఫలాలచేతనే పిలిపించుకొందురు. సంపదలున్ను తరతమ భావాలం గలిగినవి అవుచున్నవి గనుక, తత్తత్సాధనభూతాలైన క్రియలున్ను అనేకమైనటువంటి తరతమ భావాలం గలిగినవాయెను. అందు సంపదధిదేవతలె నిత్యదేవత లనిపించుకొందురు. క్రియతో గూడిన జీవులె నైమిత్తిక దేవతలనిపించు కొందురు. తత్తత్ఫలరూపమైన సంపదాకాంక్షం గలిగిన జీవులె, తత్తత్సాధనభూతాలైన బహువిధ క్రియల నంగీకరించి తామున్ను నిజమందు ఏకజ్యోతి జాతిం గలవారై నాను, కర్మఫలోపాధివల్ల స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమైన బహువిధ రూపభేద ప్రాణభేద గుణభేద భోగభేదాత్మకమైన సంజ్ఞల చేతం తోచిరి. "విద్యన్సర్వ సామర్థ్యం" అని కలదు గనుక, అనిర్వాచ్యమైన మాయా శక్తిరూపమైన త్రిగుణభేదం వల్ల దోచిన క్రియాభేదజాలాలకు, అఘటితమై తోచకుండేది ఒకటిన్ని లేదు. అటు గనక, సకల జంతువులున్ను కర్మఫలస్వరూపమంతే కాని, వేరె జగత్తనేది లేదు. ఆకర్మమున్ను దేహకరణేంద్రియా ద్యనేక వర్ణాశ్రమాద్యభిమాన మూలమై యుండును. అభిమానమనెడిది అవిద్యాకార్యమై యుండును. అదేలాగంటేను, అంకురాది పుష్పఫలాంతమైన వృక్షప్రపంచమున్ను బీజంవల్ల స్ఫురించింది యేలాగో అలాగే, అహమాది సుఖదుఃఖాద్యనుభవరూపమైన మాయాశక్తి యనెడి బీజమందు స్ఫురించిందనెడి దిప్పుడు రహస్యము.

శక్తయ స్సర్వసాధూనా మచింత్యజ్ఞాన గోచరాః ।
యతతో బ్రహ్మణస్తాస్తు స్వర్గాద్యాభావ శక్తయః ॥

అనిన్ని "ఊర్ధ్వం గచ్ఛంతి సత్వస్థా అధో గచ్ఛంతి తామసాః" అనిన్ని "సచూతవృక్షో విప్రోసౌ విద్వాంసో వేదగర్వితః। అసీచ్ఛాస్త్రం సచప్రాదాభిష్యైభ్య స్తరుతాం గతః" అనిన్ని, "త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్" అని కలదు గనక కర్మకాండం చెప్పబడెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్య పరమానందతీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యా సుధార్ణవే యోగశాస్త్రే
భేదవాదన ఖండన కర్మకాండ నిరూపణం
నామ చతుర్థప్రకరణం సమాప్తమ్

# అయిదవ ప్రకరణము

వందే గురుపదద్వంద్వ మవాఙ్మానస గోచరమ్।
శ్వేతరక్త ప్రభాభిన్నం శివశక్త్యాత్మకం గురుమ్॥
సమీపత్వహృదా ముపదిశ్య విధిం, సగుణం సుధియాన్నియతి స్సయతి।
సదపార కృపా రసవీక్షణతో, భవపాశ మభిక్షిపతి క్షణతః॥
జగత్కారణ భూతేస్మి న్నీశ్వరే శక్తి కల్పనా।
సగుణోపాసనే త్యుక్తా సాధునాత్ర నిగద్యతే॥

ఉత్తమాధికారులైన ముముక్షువులవిషయియాకరించి పరమానంద తీర్థులు సగుణోపాస్తి విధమున్ను నిర్గుణోపాస్తి విధమున్ను యీప్రకరణమందు నిరూపిస్తున్నారు. అందు సగుణోపాస్తి యెట్లన్నను, మోక్షసాధనాంగమై, కులాలవజగత్కారణభూతమైన యీశ్వరునందు నిరుపాధికమైన భక్తి చేసుటే సగుణోపాస్తి. జగత్తుకు కారణపురుషం డనేటందుకు ప్రమాణం యేది అంటేను, "కార్యవైచిత్ర్యాత్కారణవైచిత్ర్యను మీయతె" అనిన్ని "సాపేక్షత్వా దనాదిత్వా ద్వైచిత్ర్యాదిశ్చ వృత్తితః। ప్రత్యాత్మ నియమాభుక్తై రస్తిహేతుర లౌకికః" అనిన్ని "అంకురాదికం సకర్తృకం కార్యత్వా ద్ఘటవత్" అనిన్ని జగన్నిమిత్త కారణభూతమైన యీశ్వరుడొకండు కలండని అంగీకరించవలెను. అటువంటి యీశ్వరుండు సకల జీవుల చేతనున్ను సేవ్యుండనే టందుకు అసాధారణధర్మం యేది అంటే, కర్తృత్వ, అకర్తృత్వ అన్యథా కర్తృత్వ ద్రష్టుత్వ అద్రష్టుత్వ, అన్యథా ద్రష్టుత్వ, సర్వజ్ఞత్వ, సర్వకర్తృత్వ, అనంతత్వ, నిత్యత్వ, వ్యాపకత్వ, కలావిద్యా రాగకాలనియతరూపత్వ,ఉత్పత్తి స్థితి లయతిరోధాన, అనుగ్రహ అనాది ప్రబోధత్వ, అలుప్త శక్త్యాది కల్యాణగుణ విశిష్టుండై జడదుఃఖాది హేయగుణ రహితుండై స్తుతిపాత్రుండై యుండేదే యీశ్వరునికి అసాధారణ ధర్మం. అయితే, త్రిమూర్తులయందు ఇంద్రాది దేవతలయందున్ను, యక్షరాక్షసాదులయందున్ను కలిగియున్నది గదా అంటివా, ఆ సామర్థ్య నిగ్రహాలు, అవాంతరప్రళయ మహాప్రళయాల యందు జననమరణాదులం దప్పించుకొను సామర్థ్యం లేదు గనుక, అవెల్లాను బాధకాలై పోవును. ఈశ్వరుం డొక్కడే స్వేచ్ఛాశక్తివల్ల సృష్టించి ఆజగత్తును తనయందు ఉపసంహారం జేసుకుని తానే నిత్యస్వరూపుండై యుండు గనుక, యీశ్వర సామర్థ్య నిగ్రహము నిత్యత్వం గలిగియున్నదని తెలియవలెను. అది యేలాగంటేను, సకలకార్యరూపమైన ప్రపంచమున్ను ప్రళయకాలమందు తనకు కారణభూతమైన పృథ్వితత్వంలో నణంగి, అపృథివి జలతత్వములో నంతర్భాగమైనట్టి, ఆ పృథ్వ్యభిమానైన బ్రహ్మయును విష్ణుతత్వములో నణంగును. అయప్పు అగ్ని

తత్త్వములో నణంగినట్టి, తదభిమానైన యీశ్వరుడున్ను సదాశివతత్త్వములో నణంగును. ఆసదాశివుడున్ను, ఆకాశతత్త్వమును స్వేచ్ఛాశక్తిలో నణగించి, తన యందు కల్యాణగుణవిశిష్టమై దేహకరణేంద్రియా ద్యాలక్షణుండై, సత్యజ్ఞానానందాత్మకమైన తన నిజస్వరూపమై పరబ్రహ్మానుసంధానమందుంటే తన స్వేచ్ఛాశక్తి వల్లనైన ఉపాధివల్ల బహిర్ముఖుండై తనయందు సంస్కారవిశిష్టమై యణంగియున్న సకల ప్రపంచమునున్ను యథాక్రమంగాను సృజించి, వ్యవహారదశయందున్ను, పరమార్థదశయందున్ను నిత్యస్వరూపుండై యుండును. అందు పరమార్థ విగ్రహానకు నిత్యత్వం గలుగుట యేలాగంటే, ఆసదాశివ విగ్రహమనెడిది తనకు ఆత్మస్వరూపమైన అవాఙ్మానస గోచరమును జ్ఞానానుసంధానమందు నేతిముఖాన దెలుసుకోవలె నింతేకాని సకల జీవులవలెనె, షడ్వికారాత్మకమై అవాంతరప్రళయ మహాప్రళయములందు జననమరణ క్లేశవ్యాపారాదులకు లోనైంది గాదు. అటు గనుక, తనవల్ల దోచిన ప్రపంచమును తనయందే యుపసంహరించి, తాను మరి యెందు . సాబాధ్యుండు గాక, నిత్యమంగళస్వరూపుండైన యీశ్వరునికి శుద్ధసాత్వికమనెడిది నిత్యవిగ్రహస్వరూపాన నాశ్రయించి యుండు గనుక, శుద్ధసాత్విక ప్రధానుండిప్పుడు యీశ్వరుండు. అతండే యుపాసితవ్యమైన యీశ్వరుండు. ఈ సగుణోపాస్తి యనెడిది వ్యవహారదశ అయినందువల్ల, పరమార్థదృష్టి యందు ఏకత్వమంతే కాని, దేహకరణేంద్రియాది వ్యవహారదృష్టియందు యీశ్వరుండొక్కనికే జగత్కర్తృత్వం చెప్పవలెను. వ్యావహారికమందున్ను పారమార్థికమందున్ను నిత్యవిగ్రహమంగళ విశిష్టగుణాలుగల జగత్కర్త అయిన యీశ్వరుండు ఆత్మమాత్రంచేత ఏకత్వమైనాను, దేహకరణేంద్రియాద్యుపాధి బలంవల్ల జననమరణ క్లేశాదులుం గల జీవుల సంపదకు తారతమ్య భావాలు జెప్పేటందుల జీవేశ్వరులనంబడెను. అదియేలాగంటే।

దేహస్యైన వపు [ప] రోవ్యాపి విభిన్న స్సమతో జడః।
స్వకర్మ ఫలభుక్కర్తా కించిజ్ఞో నేశ్వరః పశుః ॥
అచేతనస్య మాయదేః ప్రవర్తకతయా పతిః।
సిద్ధ స్సర్వార్థవిత్కర్తా వ్యాపక స్సతతోదితః ॥

అని కలదు గనుక, అయితే శివుడు సర్వాత్మకుండనే పట్టున అక్కడ తారతమ్యభావం లేదుగదా అంటే, ఇప్పుడు ఆభరణాలయందు స్వర్ణానకు సర్వాత్మకత్వ మంతే కాని, ఆభరణాలకు సర్వాత్మకత్వం లేనిది యెటువలె నటువలెనే, కారణోపాధిస్థుండైన యీశ్వరునికి సర్వాత్మకత్వ మంతే కాని కార్యోపాధిస్థులయిన జీవులకు సర్వాత్మకత్వం ఘటించదు. అయితే వ్యవహారదశయందు లేకున్నాగాని, పారమార్థిక దశయందు జీవులతోగూడా యీశ్వరున కేకత్వమున్నది కదా అంటే, అక్కడ సంజ్ఞభిన్న మంతేకాని, చైతన్యమాత్రత్వేన యర్థభిన్నం లేక యొక్కటైన కారణానం బట్టి శివుండు కర్తని చెప్పినప్పుడే సకలదేవతా నామధేయంబులున్ను అర్థ,

భేదం లేదుగాబట్టి యీశ్వరునందే యణంగెను. అటుకనుక, నిత్యకల్యాణగుణ విశిష్టుండైన యీశ్వరుని అనిత్యజడాది గుణాలుగల జీవులు అనేకప్రకారాలచేతం భజించి ప్రసన్నత వడసి తమతమ జననమరణాల బోగొట్టుకోవలె గనుక, భజించ వలెను. ఆభజన యేలాగంటే, అధికారిభేదాలచేత ననేక తారతమ్యాలై యుండును. కొందరు దేహకరణేంద్రియాద్విలక్షణుండైన ప్రత్యగానందచైతన్యుండైన యీశ్వరుండని ధ్యానం జేతురు. మరికొందరు పంచవక్త్ర దశభుజ త్రినేత్రాలుం గల యీశ్వరునిగా ధ్యానం జేతురు. మరికొందరు అష్టవిధార్చనల ప్రతిమాదులయందు భావించి పూజ సేతురు. కొందరు "అంగుష్ఠమాత్రః పురుషోంగుష్ఠంచ" అని హృదయకమలమందు జ్యోతిర్మయంగా ధ్యానం సేతురు. ఇంక నధికారిభేదంచేత సకలదేవతలున్ను ప్రార్థనీయులు. ఈశ్వరుని మేధాశక్తియని, శారదను పూజింప వలెను. మోక్షారంభమందు నిర్విఘ్నార్థమై, గణేశ్వరుని ప్రార్థన సేయవలెను. ఈశ్వరుని పరమవిభూతి స్వరూపమని, పురుషోత్తముని భజింపవలెను. ఉపదేశం జేసిన ఆచార్యులను యీశ్వరబుద్ధిగానే భజించవలెను. తనవల్ల ప్రార్థనీయుండైన యీశ్వరుని జపహవన తర్పణ బ్రాహ్మణభోజన స్తోత్రనమస్కార ధ్యానపూజలనం దగిన అష్టవిధార్చనల చేతనున్ను, ఆవాహనాది షోడశోపచార పూజలచేతనున్ను సకాముండై భజించెనా సాలోక్యాది సంపదలు గలుగును, నిష్కాముండై భజించెనా చిత్తశుద్ధియై చిత్తశుద్ధిద్వారా యీశ్వరుని నిజరూపమైన బ్రహ్మసాయుజ్యం గలుగును.

"భోక్తారః పశవస్సర్వే శివో భోజయితా పరః" అనిన్ని "పాశశ్చేంద్రియమిత్యుక్తం పశురాత్మేత్యుదాహృతమ్। శివ ఏవ పతిస్సాక్షా దాగమామ్నాయ నిర్ణ[ర్ణ]యః" అనిన్ని యథానాదిమయః పుంసాం పశ్యుత్వం పరికీర్తితమ్। తుషకంబుకవదేయం మాయాబీజాంకుర స్యయత్। అనిన్ని అయంమే హస్తో భగవాన్ అయంమే భగవత్తరః। అయంమే విశ్వభేషజోయం శివాభిమర్శనః। అని సగుణోపాసనా కాండ చెప్పబడెను. ఇంక నిర్గుణోపాస్తి యేలాగంటేను "అహం బుద్ధిం తిరస్కృత్య ప్రత్యగానంద రూపిణి। వివేకవివసద్బ్రహ్మే విరశః ప్రోచ్యతేధునా॥" యుష్మదస్మత్ప్రత్యయమైన దేహకర్మేంద్రియాదులయందు, ఆరోపితమైన అహంబుద్ధి తొలగించి, అవాచ్యరూపమైన ప్రత్యగానంద కూటస్థచైతన్యమందు అయహం ప్రత్యయము నుపసంహరించే వివేకమిప్పుడు బ్రహ్మోపాస్తి. అక్కడ అహం అనేదిది బుద్ధి, సుఖదుఃఖ, ఇచ్ఛా, ద్వేషప్రయత్న, ధర్మాధర్మ భావములనే విశేషగుణాలచేత, సంఖ్యా పృథక్సంయోగ విభాగపరిమాణములనెడి సామాన్య గుణములయందు విశిష్టమై దేహకరణేంద్రియాదుల యందు, ఆత్మబుద్ధినిం జేసి వర్తిస్తుందును. ఈగుణాలున్ను కూటస్థచైతన్యం గారాదా అంటే, సుషుప్తికాలమందు కూటస్థచైతన్యముండిన్ని, గుణాలు లేవు గనుక గుణాలున్ను అహంకారమందే అని తెలియ వలెను. అది యేలాగంటే జాగ్రత్స్వప్నాలయందు అభిమానమున్నది గనుక సమస్తమైన గుణాలున్ను స్పష్టమైయున్నవి. సుషుప్తికాలమందు తనకు కారణ

భూతమైన తమస్సునందు అభిమానమణంగె గనుక, సమస్తమైన గుణాలునణు గుచున్నవి. అకారణానం బట్టి, అహంకారమే గుణిగావలెను. అహంకారమే పాచక పాఠక అనేటట్టె తమోబుద్ధులనే వితరణ నంజ్ఞలనిపించుకొనును. అహంకార మున్ను దేహధర్మమన్నట్లైతే, మృతికాలమందు దేహముండిన్ని అభిమానంకానము గనుక, దేహధర్మము కాదు. నిద్రావస్థయందు ప్రాణవాయువుండిన్ని, అభిమానము కానము గనక, ప్రాణధర్మమున్ను కాదు. సుషుప్తికాలమందు కూటస్థచైతన్య ముండిన్ని అభిమానము కానము గనుక, అత్మధర్మమున్ను గాదు. అహంకార మున్ను జాగ్రత్స్వప్నాల యందు "త్వయాయిదం కర్తవ్యం మమేదం కర్మ, అముష్మై ఫలాయ" యిత్యాది విచిత్ర వ్యాపారాలచేత, అత్మజ్ఞానవిచారాంతమై, తానే సత్యమనేటట్లైతే జాగ్రత్స్వప్నవ్యాపారాలుగా దోచి, తనకు కారణభూతమైన సుషుప్తిలో అయహంకారమున్ను అణగును. అదియేలాగంటే, శూన్యపాత్రములో దోచిన చెండ్లు మొదలయిన కౌతుకాలు, అపాత్రములోనె అణంగినట్టె, సుషుప్తి మాయవల్ల తోచిన, జాగ్రత్స్వప్నాలనే కౌతుకాలు తమకు కారణభూతమైన సుషుప్తి మాయలో నణగుచునుండును. అటువంటి విచిత్రమాయయును కూటస్థ చైతన్య స్వరూపమైన తనయందు అనిర్వాచ్యరూపమై యుండును. అ సుషుప్తి యందు, కూటస్థచైతన్య స్వరూపమయిన యెరుకయుండేటందుల ప్రమాణమేది అంటేను, పునరుద్ధానమందు "సుఖమహస్వాప్సం। నకించిదపి వేదిషం," అని సుఖజ్ఞానస్మరణ యున్నది గనుక, సుషుప్తికాలమందున్ను యెరుక స్వయం ప్రకాశమై యుండునని యంగీకరించవలెను. అయితే సుషుప్తిని జాగ్రమందు స్మరించినట్టె, యీజాగ్రత్స్వప్నాలున్ను సుషుప్తియందు యెరుకగలిగిన్ని యేల స్మరించబడవు అంటే, అందు అత్మ స్ఫురించేటందుకు బుద్ధి సాధనమైయుండును. జాగ్రమందె కారణాదులు కలిగియుండబట్టి తదుపాధివల్ల వ్యాపారకల్పన కలి గెను, "సర్వకరణోపరతిస్సుషుప్తిః" అని సుషుప్తికాలమందు కరణ సహకారిత్వం లేదు గనుక, అత్మకు జాగ్రత్స్మరణ మనేది సుషుప్తికాలమందు ఘటించదు. సుషుప్తికాలమందు అత్మకు సుఖజ్ఞానానుభవమందు యేమి సాధనమంటేను, అక్కడ అజ్ఞానవృత్తి సాధనం. అయజ్ఞానమునకు వృత్తిత్వం గలదు అనేటందు లకు ప్రామాణ్యమేది అంటేను, కార్యరూపమైన ఫలానకు, కారణరూపమైన తంతువుండగా, పటనిష్ఠమైన ధవళిమ తంతునిష్ఠమైన ధవళమైనది యేలాగో అలాగే కార్యరూపమైన బుద్ధికి వృత్తిత్వం కంటిమి గనుక, కారణరూపమైన అజ్ఞానరూపమైన సుషుప్తియందున్ను అజ్ఞానమునకు వృత్తిత్వం గలదనే తెలియ వలెను. ఈయర్థమందు శ్రుతి: "అనందమయ అనందభుక్ప్రీతోమయవృత్తిభిః। భుక్తిచిద్బింబ యుక్తాభిః। అజ్ఞానోత్పన్న వృత్తిభిః।," అనిన్ని "అనందమయభో క్తృత్వం, బ్రహ్మానంద స్సభోగ్యతా। మాండూక్యోపనిషద్యాది శ్రుతిష్వేవ యితీరితం" అని పంచానంద దీపిక కలదు గనక, సుషుప్తిమూర్ఛలకు అధారమైన యెరుక కలదని యెరింగేది. అయితే జాగ్రముందలి బుద్ధియనేది సాధనోపాధివల్ల సుషుప్తిని

స్మరించినట్టె అజ్ఞానవృత్తి అనెడి సాధనోపాధివల్ల జాగ్రమునున్ను ఆత్మన్మరించ వలె గదా అంటే, అక్కడ విచిత్ర వాక్యాలనెరిగేటందుకు సాధనాలైన శ్రోత్రాలు నేత్రాలవలె రూపవైచిత్ర్య మెరిగేటందుకు సాధనంగానేరనిదేలాగో అలాగే, జాగ్రానకు స్మరించేటందుకు అజ్ఞానవృత్తిత్వమున్ను సాధనంగా నేరదు. అయితే సుషుప్తిమూర్ఛలకు భేదమేది అంటె, "నకించిదపి వేదిషం" అనెడి అజ్ఞాన స్మరణమాత్రమే మూర్ఛ అనిపించుకొనును. "సుఖమహమస్వాప్సం, నకించిదపి వేదిషం" అనెడి సుజ్ఞానానుభవ రూపమైన స్మరణద్వయమునున్ను కూడుకొని సుషుప్తియుండును. తదాధార చైతన్యమున్ను అవస్థాత్రయాలతో గూడిచెడకె, ఆధారమాత్రమై యున్నట్టే, అనేక దేహాలుతోచి చెడేటప్పుడు ఆధారచైతన్యానకు నాశములేదు. ఎరుకయును అనేక దేహాలకు ఆధారమైతే తద్దేహవ్యాపారజ్ఞానమున్ను తనకు తెలియవద్దా అంటె, అప్పుడు అందుకు భూతాలవల్లనైన స్థూలశరీరాలు తోచిచెడినాను ఆదేహాలకు ఆధారమైన చైతన్యం యొక్క మాయావరణమున్ను వివేకజ్ఞానోదయ పర్యంతమైయిన్ని నివృత్తిగాదు గనుక, తద్దేహవ్యాపార జ్ఞానమున్ను తోచదు. అందువల్ల సకలదేహాలయందున్ను తాగల్దనే పట్టున తత్తద్వ్యాపారజ్ఞానమున్ను తనకు గావలెననేటందుల ప్రమాణం లేదు. అదియేలాగంటే వెనకకు అనేకదేహాలయందు తావస్తిని అనేపట్టున, తత్తద్దేహకరణేంద్రియాది వ్యాపారజ్ఞానమున్ను అందందుకు భేదమైతోచి చెడ్డప్పుడు, ఆదేహాలకు తానాధారమైయుంటిని అనే నిశ్చయం యేలాగు చెడదాలాగె, చరాచరాత్మకమై తోచెడి సకల దేహాలకున్ను తానే ఆధారమనే తెలియవలెను. అయితే వ్యవహారజ్ఞానమున్ను భేదమై యేలా తోచెనంటెను, అది సంస్కారభేదంవల్ల అభిమానానకు తోచిన భేదజ్ఞాన మంతేకాని ఆత్మకు సంబంధం లేదు. ఈయర్థమందు శ్రుతి, "అహంకారాది దేహాంతో వేద్యో నాత్మాత్మ ఉపాదివత్" అని కలదు. అయితే ఆత్మకు సర్వదేహాధారత్వ మనెడిది సర్వదేహవ్యాపారజ్ఞానమంతే కాని, యేలాగైనా గాదంటివా, అప్పుడు సర్వవ్యాపజ్ఞానం గల చిత్రగుప్తాదులున్ను ఆత్మస్వరూపం గావలెను, అయితే "సహస్రశీర్షా పురుషః" అని సహస్రశిరస్సులు కలిగిన ఆతండు ఆత్మఔగాక అంటేను, అప్పుడు సహస్రశిరస్సులుగల శేషుదును బహుశిరస్సులుగల వృక్షాలున్ను ఆత్మస్వరూపం గావలెను. అయితే సహస్రాక్షుండైన ఆతండవు గాక అంటివా, అప్పుడు యింద్రాదులున్ను ఆత్మగావలెను. అయితే సహస్ర పాదాలుగలాతండు ఆత్మ అయ్యీనంటె, అప్పుడు బహుపాదాలుగల సూర్యాదులున్ను ఆత్మగావలెను. అయితే బహుహస్తాలు గల ఆతండు ఆత్మఅవు గాక అంటె, కార్తవీర్య బాణాసురాదులున్ను ఆత్మగావలెను. అయితే శ్రుతులున్ను విరాట్పురుషావస్థను నిరూపిస్తున్నవి అనేటందుకు తాత్పర్య మింతేకాని శుద్ధబ్రహ్మమందలి తాత్పర్యం గాదు. అయితే అరచట్టల ఉపాధిలో దేహాలు ఉన్నవి గనక, తదాధారచైతన్యమున్ను అవయవాత్మకంగారాదా అంటివా, ఆయరచట్టలు జీర్ణమైనచోట ఆమనుష్యుల అవయవాలు దృష్టంగా గనిపించినట్టె

హస్తపాదాలు భిన్నమైనా ఆత్మస్వరూపమైన హస్తపాదాలుండవలెను. అయితే, అణురూపమై ఆత్మ తానెవ్యవహరిస్తుండును అంటె, అప్పుడు ఆత్మ తానణురూపమైతే, వ్యవహార మనేది సంయోగబలం చేతనో, ప్రభావిశేషంవల్లనో అని వికల్పం. ఆత్మకు భేదత్వమున్ను, విభుత్వమున్ను సాధించే నయ్యాయికులు మనస్సుకు అణుత్వమంగీకరింతురు. ఆత్మకణుత్వ మంగీకరించిన రామానుజులు, మనస్సుకు విభుత్వము నంగీకరింతురు. అందు "ఆత్మా మనసా సంయుజ్యతే। మనయింద్రియేణ, యింద్రియవరేణ యింద్రియాణాం ప్రాప్యకారిత్వాత్" అనేటట్టె, సంయోగబలం చేత వ్యాపారము అంటే, అప్పుడు రెండువస్తువులున్ను ప్రాదేశికమైన స్థలమందు మల్లమేషాదుల వలెనే, ఉభయేతర కర్మసంయోగము, వృక్షనస్యాదులవలెనె అన్యేతరకర్మ సంయోగము. "హస్తపుస్తకసంయోగా త్కాయపుస్తక సంయోగః", అన్నట్టె పరంపరాసంయోగమనెడిది. ఈతీరుసంయోగాలు ఘటించవు. ఒక అణుత్వం వచ్చి విభుత్వమనెడి స్థలమందు యారీతిసంయోగాలు ఘటించవు. విభుత్వ అణుత్వాలం గలఆత్మ మనస్సులకు నిత్యసంయోగబలం వల్ల వర్తిస్తుండును అంటే, అప్పుడు సుషుప్తి మూర్ఛలు లేక యుండవలెను. మనస్సుసహా అణురూపమైన ఆత్మ తానే వ్యవహరిస్తుండును అంటే, అప్పుడు గజాది స్థూలశరీరాలందు ఒక అవయవమందు అణురూపమై వ్యవహరిస్తే, మరొక అవయవానకు దిక్కులేక పోవలెను. అయితే గృహమందు యేకదేశాన గుంజా ప్రమాణాన ఉన్న దీపము, తనప్రభావిశేషాన అగృహములో గల సకలవస్తువుల యందుంగల అంధకారమును నివారణ మేలాగు చేయునాలాగే ఆత్మయును తానణురూపమైనాను తనప్రభావిశేషం వల్ల వ్యాపారం జేయదా అంటే, అక్కడ ప్రభయును జడరూపమై వ్యవహరించెనో అజడరూపమై వ్యవహరించెనో అని వికల్పం. అక్కడ జడరూపమేయై వ్యవహరించెనంటె అప్పుడు పాషాణాదులున్ను తమకుదామె వ్యవహరిస్తుండవలెను. అజడరూపమై వ్యవహరిస్తుండెనంటె, అప్పుడు దీపమున్ను ప్రకాశమున్ను, యీరెండున్ను ఉష్ణమైతేను అప్పుడు దీప, దీపప్రకాశ మనెడి వికల్పం లేకేయుండ వలసినదేలాగు అలాగే, ఆత్మాను ఆత్మప్రభాను యీ రెండున్ను అజడమే అయితే, అప్పుడు ఆత్మప్రభలు రెండున్ను ఏకత్వమై అణురూపం ఆత్మనెడి సిద్ధాంతం లేకపోవలెను. అయితే "నీవారశూకవత్తన్వీ" అనెడి శ్రుతికి అనర్థక్యం వచ్చెగదా అంటే, అశ్రుతిని "పీతాభాస్వత్యణూపమా" అనిన్ని, రూపాతీతమై గుణాతీతమై యుండే ఆత్మకు అణురూపమనిన్ని పీతాభాస్వతి అనిన్ని చెప్పి చూపెగనక, చిత్తైకాగ్రతకై ధ్యానకాండమందు ఆ శ్రుతికి తాత్పర్యమంతేకాని స్వరూపబాధకమెరుగనిది గనుక, అణురూపం ఆత్మయనెడి అమతం నిరస్తమాయెను. అయితె చతుర్దశగుణవిశిష్టమైన అభిమాన చైతన్య మాత్మయ్యీనంటివా, గుణాలు దృశ్యాలు గాబట్టి, గుణాలం గూడిన గుణిన్ని దృశ్యంగావలెను. "స్పర్శానుమేయో వాయుః" అన్నట్టె గుణాలంగూడి గుణిన్ని దృశ్యమె. అటుగనక దృశ్యవిలక్షణమై, నిర్గుణజ్ఞప్తి చైతన్యమనేది యేది

కద్దు అది, అప్పుడు ఆత్మవిలక్షణమని యెరుంగవలెను. అయాత్మ ఉపాధివశాన జీవాత్మ, అంతరాత్మ; పరమాత్మ అని త్రివిధమై యుండును. అది యేలాగంటే, ఒకానొక చిత్తరువుగోడయందు అనేక చిత్తరువులందుకాధారమైన చూర్ణబంధ లేపం, తదాధారమైన కుడ్యమిప్పుడు యేలాగో, అలాగె కుడ్యంయొక్క ఉపాధి యందు సర్వాధారమైన పరమాత్మస్వరూపమైన బ్రహ్మముయొక్క ఉపాధియందు అంతరాత్మ స్వరూపము. అందు అంతరాత్మ స్వరూపమైన యాశ్వరుండు, బాహ్యచిత్రోపాధియందు సాంసారికరూపమైన జీవులు. చూర్ణబంధలేపము, అంత ర్యభాగమందు కుడ్యమునాశ్రయించి బాహ్యాభాగమందు చిత్తరువులకు అధార మైంది యేలాగు అలాగే, అహం యొక్క బాహ్యరూపమైన చిత్రదృశ్యమైన దేహకరణేంద్రియాదులకు అజ్ఞానరూపమైన బాహ్యబుద్ధికిన్ని తాను ఆధారమై "బ్రాహ్మణోహం శ్యామోహం దీర్ఘోహం'' అని తెలిసి జీవులనే సంజ్ఞ గలిగిందె అయెను. చూర్ణబంధలేపానకు సదృశమైన అభిమానమె తనకు ఆధారమైన కుడ్య సదృశమైన కూటస్థచైతన్యం డంతర్గృహ బుద్ధియందభిమానించి అంతరాత్మస్వ రూపమైన యాశ్వరుడని సంజ్ఞ గలిగిందే అయెను. కుడ్యమందు చిత్తరువులె బాహ్యమందు కనిపించుకొనుచుండును. చూర్ణబంధలేపమే, చిత్తరువులు లేని స్థలమందు, స్వతంత్రమందునె కానిపించుకొనుచునుండును. చిత్తరువులకాధార మైన స్థలమందు చిత్తరువులు లెస్సగా దోస్తేగాని కానుపించవు. సర్వాధారమైన కుడ్యమును గనేటందుకు చిత్తరువునున్ను గారనున్ను సరిగెపారచేతదొలెస్తే గాని కానరానట్టె, యాయాత్మత్రయమును సాక్షాత్కరించేటందున్ను, యామర్యాద గానె తెలియవలెను. అది యేలాగంటె బాహ్యరూపమైన యుష్మదస్మదాది వ్యవ హారబలంవల్ల నజ్ఞానవశుండై తనయందలి జీవత్వం దెలియవలెను. విశ్వామిత్రా దుల ఉపాధియందు తపస్సనే ఉపాధిచేత చిత్రసదృశమైన దేహకరణేంద్రియాది, అజ్ఞానకల్మషమును గలిగి చూర్ణబంధలేపనసదృశమైన సామర్థ్య భ్రమనుంగల తనయందు, యాశ్వరత్వము సాక్షాత్కరించును. పిండాండ వ్యతిరిక్తస్థలమందు ననే యాశ్వరత్వము, జడకల్మషాలు లేవుగనుక, త్రిజగత్సేవ్యమానమై స్వతంత్రం చేతనె ప్రకాశిస్తుండును. తనయందు కుడ్యసదృశమైన, సర్వాధారమైయున్న కూటస్థచైతన్యము సాక్షాత్కరించేటందుకు, శుకభరతాదుల ఉపాధియందు ఆత్మ జ్ఞానవివేకోపాయ బలంచేత, జీవేశ్వరాధ్యాసను, చిత్తరువునున్ను గారనున్ను సరిగె పారగొని త్రవ్వితీసి, కుడ్యమును సాక్షాత్కరించే ఉపాధియందు తనందలి కూటస్థ చైతన్యమును ఈతీరు తెలియవలెను. తనకు అస్మదాద్యవస్థయందు జననమర ణాలు తోస్తుంఢును, అనవలెను. అది యేలాగంటేను, రాజసేనయును అయున్న స్థలాన ఉనుకులు అయియుండిన్ని దండెత్తి తెరువునడచేటప్పుడు చతురంగసేన లున్ను యడగలసి యిచ్చరిచ్చలుగా నడచును. ముందరిపాళెం దిరిగినపట్టున తమతమ తారతమ్యాలయందు చెరువులుగాను పాళెందిగినట్టె, సకలకరణేంద్రి యాదులున్ను తమతమ స్థానాలు విడిచి సంస్కారమువెంబడిని ప్రాణవాయువులో

మిళితంగాను, పుష్పాటవియందలి వాయువు నకల పుష్పవాననలతోనున్ను కూడు కొనియున్నట్టె, ప్రాణవాయువు చిదాభాస విశిష్టమై ప్రబలకర్మవాననచేపట్టి, మరిన్ని ఒక శుక్లశోణితాత్మకమైన పాళెంపట్టు చేరి, నకల కరణేంద్రియాదులనున్ను కర్మానుసారంచేత తత్తస్థానాలయందు విడిచి, ఉత్తరోత్తరదేహమును చేపట్టి, వివేక అవసాన పర్యంతమందున్ను వ్యవహరిస్తుండును. ఈయర్థమందు విసర్గకాలె శుక్లస్య జీవః। కరణసంయుతః। ప్రీత్యా ప్రవేశతెయోనిం। కర్మభిన్నైర్నియోజితః" అనికలదు. కొందరు జననమును మరొకప్రకారముగా జెప్పుదురు. అది యేలా గంటేను, జీవులు వృష్టిని బిందువందు బ్రవేశించి అందునుండి శాల్యాదిధాన్యం తోగూడి అయన్నరసమును భుజించి, ఆవీర్యబలంవల్ల జననమని చెప్పుదురు. ఏలాగుగలిగినాను, శాల్యాదిధాన్యాలు గూడికాని, మునుపే జననం లేదంటే అప్పుడు విశిష్టసుకృతఫలంచేత జన్మాంతరాలం గూడినవారికిన్ని నడుమను స్థావరజన్మం రావలసియుండును. అయితే శ్రుతిన్ని "సవా ఏషపురుషో న్నరసమయః" అనెడి యిత్యాది శ్రుతులు యేలాగు జననాలం జెప్పెను అంటె, ఆశ్రుతులకవాంతర ప్రళయమందు పునరుద్ధానమైన ప్రథమసృష్టిసం జెప్పేడి తాత్పర్యం. అయితే బహ్మవేత్తకు దేహత్యాగ మేప్రకారానవౌనంటె, వారికి వివేకబలంవల్ల జన్మాంత రానకు కారణమైన అజ్ఞానంచెడి, దగ్ధపటలన్యాయోపాధియందు ప్రాశబ్ధమాత్ర మైన దేహకరణేంద్రియాది విక్షేపమాత్రమె ఉండెగనుక, సప్తదశతత్వాత్మకమైన లింగశరీరము ప్రారబ్ధం తీరినవెనక, తనకు ఆశ్రయమైన మొదటి స్థూలశరీరము.. ఉండలేదు. అజ్ఞాన రూపమైన సంచితాగాములు జ్ఞానంచేత జెడెగనుక, దేహాంతర మునం గూడేటందుకు సాధనంలేదు. కర్మోపాధివలెను దేహాంతరమును ఘటించదు. అది కారణానబట్టి, దీపముండే గృహములోని అంధకారమక్కడనె బయలయిన యట్టు, వినసకర్ర విసరగా కలిగిన వాయువందె అణంగినట్టు, మాయాసూత్ర మైన లింగశరీరం ప్రారబ్ధంతీరగాను తనయందె బయలవును. ఈయర్థమందు శ్రుతిః "నతస్య ప్రాణావుత్క్రామంత్యత్రైవ సమవలీయంతె।" అని ఉన్నది గనుక, ఘటాకాశ మహాకాశమేకమైనట్టె, అహమాది సాక్షికమైన కూటస్థచైతన్యము, విశ్వసాక్షికమైన బ్రహ్మచైతన్యంతో నేకమై అనంతానందగతిని బ్రహ్మైక్యనిష్ఠం గూడును. ఈయర్థమందు శ్రుతి, "బ్రహ్మవిదాప్నోతి పరం" అనిన్ని

చైతన్యం సర్వగం సత్యం సర్వభూత గుహాశయమ్।
యత్సర్వవిషయాతీతం తస్మైసర్వవిదె నమః॥

అని నిర్గుణోపాస్తి చెప్పంబడెను.

ఇతి శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ యతికృతౌ బ్రహ్మవిద్యానుధార్ణవే యోగశాస్త్రే సగుణనిర్గుణోపాస్తినిరూపణం నామ పంచమప్రకరణం నమాప్తమ్

# ఆఱవ ప్రకరణము

బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ యీశ్వరశ్చ సదాశివః।
యస్య గర్భగతాశ్చైవ తస్మై శ్రీగురవే నమః॥
భువనభయకృత్కృత్యప్రాజ్ఞాది దైత్యతనుత్రయ
త్రిపుర హరణక్రీడా గాఢాతిరూఢ మనోరథః।
కువలయ సుహృత్కోటి కోటిరవిరివాపరో
జగతి పరమానందోయం దోగ్ధి సాధుబుధేప్సితమ్॥

ఉత్తమాధికారులయిన ముముక్షువుల విషయీకరించి, పరమానంద తీర్థులు ప్రకృతిపురుషవిషయం, మాయావిద్యోత్పత్తి, జీవేశ్వర తనుచతుష్టయం, వాక్యత్రయలక్షణం— యీనాలుగు నిర్ణయాలున్ను ఈప్రకరణమందు నిరూపిస్తున్నారు. ప్రకృతిపురుషనిశ్చయ మేలాగంటేను, బ్రహ్మాకార స్ఫురణమందే జ్ఞానపూర్వలక్షణము. మునుపుజెప్పిన తనుత్రయానకు కారణం అదే మహామాయ. అమహామాయె పరాశక్తి, యీశ్వరుని మూలప్రకృతి. ఇది యెరిగేవాడు స్వయం జ్యోతి, పరమపురుషుడు, సత్తామాత్రంచేత సకల జీవులకున్ను జీవుండు. అతడు అనాదిజగత్కారణుడు. బ్రహ్మాది ప్రపంచములాతనివల్లనుత్పత్తి. అ ప్రకృతిపురుష సంయోగమె ప్రతీయమానమైనది. అలాగుండిన్ని అప్రకృతికి విలక్షణుండై సాక్షిరూపాననుండును.

దేహేంద్రియ మనోబుద్ధిః ప్రకృతిభ్యో విలక్షణః।
తద్వృత్తిసాక్షిణం విద్యాదాత్మానం రాజవత్సదా॥

అని కలదుగనుక, అది ప్రకాశము, అతడు ప్రకాశకుండనేది వేద్యము. అతడు వేదకుండు అది జ్ఞేయం. అతండు జ్ఞాతజీవసాక్షి. మూలప్రకృతె మిథ్య. తత్కార్యమసత్యము, అనాది. దానియథార్థం యేలాగో అలాగే చెప్పచున్నారము. మాయసత్యమొ అసత్యమొ, లేక సత్యాసత్యమో, సత్యాసత్య విలక్షణమో అంటేను, అదియేమి కాదు. భిన్నమో అభిన్నమో, కాక భిన్నాభిన్నమో కాక భిన్నాభిన్న విలక్షణమో అంటేను, అదేమి కాదు. అయితే సావయవమో నిరవయవమో, కాక సావయవనిరవయవమో, కాక సావయవనిరవయవ విలక్షణమో అంటే అదేమికాదు. మాయ సత్యమని యేల చెప్పరాదంటే, నిత్యమైతే యెప్పుడున్ను చెడక యుండవలెను. అసత్యమైతే యెప్పుడున్ను కనిపించక యుండవలెను. కాబట్టి (అది) సత్తుఅనరాదు. అయితే సదసత్తంటిమా, కల్లనిజములొక్కదిక్కున నుండవు, సత్తైంది అసత్తుగా నేరదు, అసత్తైంది సత్తుగా నేరదు. అయితే నిందుకు విలక్షణమంటివా, అప్పుడు బ్రహ్మమువలెనే ప్రతిబ్రహ్మమనబడును. కాబట్టి విలక్షణముంగాదు, విలక్షణమైన వస్తువు వేరెయొకటి లేదంటిమా, అప్పుడు అమాయె సత్యంగావలసియుండును, అది విచారించిచూడంగా లేదు. కద్దులేదు అనే యీరెంటికి గానరాని వస్తువు బ్రహ్మమె. అయితే మాయ అభిన్నమంటిమా,

చైతన్యం లేక గానుపించదు. అది బ్రహ్మమందలి మూలప్రకృతి కాబట్టి భిన్నం గాదు. అభిన్నమంటిమా నిష్కళయందు కళంకము లేదు. అభిన్నముగాదు. అది అప్రమాణమేలాగంటే, యేదైనానేమి భిన్నమైనది' అభిన్నము ఎప్పుడూ కాదు. ఏదైనాయొకటి అభిన్నమైనది భిన్నం యెప్పుడును గాదుగాబట్టి, భిన్నాభిన్న మని చెప్పరాదు. భిన్నాభిన్నవిలక్షణమంటిమా, అదిన్ని యొకప్రతిబ్రహ్మ గావ లసి ఉండును. అయితే సావయవమంటిమా, అమాయకు రూపమే లేదు, వర్ణము లేదు. నిరవయవమంటిమా జగత్తు గనిపించు గనక, నిరవయవమని చెప్పగూడదు. సావయవనిరవయవమంటిమా సావయవనిరవయవం గానేరదు. నిరవయవమున్ను సావయవం గానేరదు. అయితే సావయవ నిరవయవ విల క్షణమంటిమా, అది మునుపు జెప్పినట్టె అప్రమాణము. ఇట్టి విరుద్ధ ధర్మాలు యేవీజెప్పరాదు. అయినా లేనిది కలిగియున్నదిగనుక, యిది ద్వాదశ వికల్పక రచన గాబట్టి మాయ. ఈలాగని అలాగని యేమిన్ని జెప్పరాదు. ఊరకె నోరు మూసుకొని యుండేది. అటనగానేమి అంటే, అనిర్వాచ్యమనుట. అనాద్య విద్యా నిర్వాచ్యా అని కలదు గనుక, యెదైనాను యొకటె అనిర్వాచ్యమై కని పించిన్ని అది దబ్బరని యెరింగి దానిస్వరూపం యెటువలెనున్నదో అటువలెనె ఉన్నది అని ఊరకెయుండుట. మృగిజలం యెటువలె అనిర్వాచ్యమో అటు వలెనె, ద్వాదశ వికల్పం జేసిచూడగా మాయ మిథ్యాభూతమని యెరుంగవలెను. ఈకనంబడిన మాయయనిర్వాచ్యము. అదే యీశ్వరునికి కారణదేహము. అది మూలప్రకృతి అనిపించుకొనును. అది శుద్ధబ్రహ్మనకు లక్షణమై యుండును. చైతన్యం యెరుక, మహాకారణంబున వర్తించును. సర్వసాక్షిమహేశ్వరుండు— అయభిమానం యేలాగంటే, పూర్ణబ్రహ్మమే నేననేవాడు, సర్వసాక్షిన్ని తానే కర్తననేవాడు, వాడు అభిమానచైతన్యుడు. విరాడ్ఢిరణ్యగర్భ అవ్యాకృత మూలప్రకృతి. ఇది పరమపురుషుని దేహచతుష్టయము. బ్రహ్మవిష్ణు రుద్రయీశ్వ రులు అభిమానులు. ఇది తత్పదానకు వాచ్యార్థము. నశ్వరస్వరూపం గాబట్టి ప్రకృతి అనంబడెను. ఈప్రకారాన మాయాగుణవిస్తారం, చతుర్గుణ చతుర్వ్యవ హారాలు, అపరమపురుషుడనే వస్తువుకు లేవు. అతడు నిర్వికారి, మాయా తీతుండు. ఈసృష్ట్యాత్మకమైన సకల జగత్తున్ను మిథ్యాభూతమైనది. ఇందుకు విలక్షణుండు పరమాత్మ. ఇది ప్రకృతిపురుషనిర్ణయము. ఇంక మాయావిద్యా లక్షణమేలాగంటే— పరబహ్మం స్వసంవేద్యము. జీవేశ్వరులకు ఉపాస్యదేవత. అనిర్గుణ బ్రహ్మమందు మాయావిద్యలు రెండున్ను పుట్టెను. వివర్తరూపమైన మాయ అవిద్యలనెడి రెండు దర్పణాలు· అదర్పణాలయందు బ్రహ్మం ప్రతి బింబించగా యీశ్వరుడు అనిన్ని జీవుండు అనిన్ని కలిగెను. సత్వశుధ్యవిశుద్ధిభ్యాం మాయావిద్యద్విధానుతా॥ ఈయర్థమందు।

మాయాబింబో వశీకృత్య తాంస్యాత్సర్వజ్ఞ యీశ్వరః।
అవిద్యావశగస్త్వన్యః తద్వైచిత్ర్యా దనేకధా॥

అయితే ముఖ్యమైన బ్రహ్మనకె ఆకారం లేదు. బింబప్రతిబింబాలు యేలాగు అయ్యానంటే, బింబప్రతిబింబ న్యాయాభిప్రాయం చెప్పేము. నిరాకార నిరాభాసమైన బ్రహ్మమందు మాయా అవిద్యలు మూర్తివంతాలు గావు, స్ఫురద్రూపమె. అపరబ్రహ్మం తన్నుదానవలోకించె. అప్పుడు పూర్ణాహంభావం స్ఫురించెను. అందుకై మాయ సాభాసజ్ఞానరూపమై యుండును. అజ్ఞానం పూర్వమే యుండంబట్టి, అన్యధాజ్ఞానమె అవిద్యాలక్షణము. అందుకై సాభాస మని చెప్పబడెను. వేదాంతమందు, ఈమాయా అవిద్యలకు సాకారమెప్పుడూ లేదు. సాభాసమనే సంజ్ఞ నిరాకారం. మాయ అనంగా స్వరూపోన్ముఖస్ఫురణ. అవిద్యా అనంగా విపరీతకల్పన. కాబట్టి, వేద్యరూపమైన సాభాసత్వం చెప్ప బడుచున్నది. బ్రహ్మమొక్కటె నిరాభాసం. మాయా అవిద్యలు సాభాసమనం బడును. కాబట్టి బ్రహ్మప్రతిభాస మనంబడెను. శుద్ధచైతన్యమే లేకుంటే మాయా అవిద్యల స్ఫురణమే తోపదు. ఆరెంటికిన్ని ఆధారమాచైతన్యమే. ఎక్కడ మాయావిద్యలు స్ఫురించునో, అక్కడ చైతన్యమంతకు మునుపే ప్రవేశించి యుండును. అచైతన్యమే లేకుంటే, వీటికి స్ఫురించ శక్తిలేదు. మాయా విద్యల గూడి చైతన్యమున్ను సమయోక్తిగూడి యుండబట్టి, అందుకు బింబప్రతి బింబమని చెప్పబడెను. ఘట మఠసంయుక్తమైన నిరాలంబానకు ఘటాకాశ మఠాకాశమని యేలాగు గలిగెనో, అటువలెనె వస్తువులలోనను బింబప్రతిబింబ మని నామధేయం గలిగెను. ఎక్కడెక్కడ యీవాసన స్ఫురించునో అక్కడక్కడ బ్రహ్మ మధిష్ఠించియుండును. కాబట్టి మాయ అవిద్యలను అధిష్టించియున్నదే ప్రతిబింబ మనబడెను. బింబ స్థానమైన బ్రహ్మమె ఉపమానమనవలసెను. ప్రతి బింబమే జీవయీశ్వరులనంబడెను. అది బింబప్రతిబింబ న్యాయాభిప్రాయము. ఆజీవేశ్వరుల భేదాన విశ్వాకారం తోచెను. విపరీతకల్పనచేత స్వస్వరూపం తోపకపోయెను. తన్నుండె తనమాయ గప్పెను. ఇది అనాది మహేంద్రజాలము. అదియేలాగంటేను, నిర్మలాకాశమందు మేఘాలు గప్పినట్టున్ను, సూర్యప్రకాశ ములోను మృగజలం గనిపించినట్టున్ను, నిర్మలాకాశమందు నీలత్వం దోచి నట్టున్ను, లేని కల్మషము తనకుగప్పి జీవేశ్వరులనంబడెను. సింహం తన నిజచ్ఛాయను జలంలోచూచి తననీడకు తానే బెదరినట్టు, లేనిసంసారమే కప్పు కొనెను. మేఘం తనయురుములచేతం గంపించి జలమైనట్టె, తనశక్త్యాదం బరంచేత దనరూపమును తానే మరచెను. తరంగ చాంచల్యమునసుండే సముద్రుండు, తరంగజననమరణాలు సముద్రములోనే అణగి అతరంగాలు తన్నుదానెరిగితె అదేసముద్రమయినట్టు, దేహాది ప్రపంచాలు నేకాదని యెరింగి నప్పుడె తానే బ్రహ్మము. అనుభవానకు మరిన్నొక సంజ్ఞగలదు. అదియేలా గంటే, సర్వమున్ను తానయ్యే యుండవలె, లేకుంటేనేమీ కాకె ఉండవలెను కొంత అయ్యీంగాకె ఉండవలెను. ఏలాగు ఉండెనో అలాగే ఉండవలెను. సర్వమున్ను దానై యుండుటకంటె యేమియునుగాక యుండెడే మంచిది

అక్కడి దేహాదిప్రపంచాదులకు సుఖదుఃఖాదులకు వేరైన వెనుక, తనకేమీ లేకుండుటే సత్యము. ఆద్యంతాలు వట్లైనాను నడుమ కనవుగలిగినట్టె, ఆద్యం తాన బ్రహ్మమైనా నడుమ ప్రపంచాకారం భాసిస్తున్నది గనుక, సర్వమున్ను బ్రహ్మమనే చెప్పవలెను. "సర్వం ఖల్విదం బ్రహ్మ", అనిన్ని "ఆత్మైవేదం సర్వం", అనిన్ని శ్రుతి పలికెడిని. ఒకటె సత్యం గలుగంబట్టి మిథ్య ఒకటి వలసెను.* తత్వం విచారిస్తె సత్యము నిజాకారమె మిథ్య. జగజ్జీవాకారమె అది, తన అంకురమె, తానె ఆనందకందం. అది బీజం సమస్తానకున్ను. అక్కడ నుండి ప్రపంచం విస్తారమాయెను. సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం అని అంగానకు ప్రధానం శిరస్సు. అందుగల కేశాలున్ను తక్కిన అంగాలగల నఖ కేశాలున్ను అచేతనాలు. అలాగే సకలమున్ను చైతన్యానకు వ్యతిరిక్తంగాదు. అట్లైతే సర్వం ఖల్విదం బ్రహ్మ అనెడి శ్రుతినింబట్టి, విషయసంగమమున నుండి భవసాగరములో మునింగేవారెవ్వరంటే, అది అధికారిభేదం. అద్వైత జ్ఞానంలేని జీవునకు విషయసంగంవల్ల సంసారబంధనం నిశ్చయమె. తన్నుం బాసి మాయలేదు, మాయంబాసి జగత్తులేదు గనుక, విరోధం లేదు. వివర్తం ద్రోసి నిలిస్తె, శుద్ధ నిర్గుణనిరాలంబ నిర్వికల్ప నిర్మల స్వయంజ్యోతియని చెప్ప గానే, శూన్యమాత్మయనెడి సిద్ధాంతం గెలువంబడెను. ఎట్లా గెలువంబడెనంటే, యీచెప్పినదెల్లాను భావమైతె, శూన్యమె స్వభావమాయెననే సిద్ధాంతం వ్యర్థము. ఏదిన్ని లేదనెడిదే శూన్యం. లేదని శూన్యమని యెరిగేవాడొకండు కలడుగద. వాడు చైతన్యుండు, సర్వదా నిత్యుండు. శూన్యమని శూన్యమె యెరుంగదు గనుక అందునుండి ఆత్మె ప్రకాశించును. సత్యం మరొకరివల్ల వేద్యంగాదు గనుక, శూన్యంవలెనె యుండుగాని శూన్యమేకాదు. తన్నుదానె యెరుంగును. తనవల్లదానె ప్రకాశించును. ఇది మాయావిద్యాలక్షణం. ఇంక జీవేశ్వరతను చతుష్టయభేదమెరింగితేగాని, మాయావిద్యల స్వరూపం లెస్సగా దెలియదు. అది యేలాగంటె, జీవుని తనుచతుష్టయం చెప్పేము. [జ్ఞానేంద్రియాలైదున్ను కర్మేంద్రియాలైదున్ను శబ్దాదులైదున్ను వచనాదులైదున్ను జ్ఞాతృత్వమనేబుద్ధి చిత్తాహంకారాలైదున్ను, పంచమహాభూత పంచీకృత కదంబమైన యీయిరువై యైదు తత్వాలతో గూడింది జీవునియొక్క స్థూలదేహము. ఇందుకు అవస్థజాగ్రం, అభిమానివిశ్వుండు, క్రియాశక్తి, రజోగుణం, నేత్రస్థానం, యుక్తభోగం, అకారం మాతృక- వీటితోగూడిన ఆత్మ జీవాత్మ. అతండే వ్యావహారిక జీవుండు. ఈ పదిసంజ్ఞలం గలిగింది స్థూలశరీరము. ఈస్థూలశరీరంయొక్క వాసనావశమైన సూక్ష్మశరీర లక్షణమేలాగంటే, అష్టపురాలతో గూడింది లింగదేహము. అష్ట పురాలేలాగంటే, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, శబ్దాదివిషయాలు, పంచ ప్రాణాలు, కరణచతుష్టయం, కర్మ, కామ, మవిద్య యీయెనిమిదింట గూడింది లింగదేహం. ఇందుకు అవస్థ స్వప్నం, అభిమానితైజసుడు, యిచ్ఛాశక్తి, సత్వ

గుణం, కంఠస్థానం, స్వేచ్ఛాభోగం, ఉకారమాతృక. ఇందున వ్యాపకమైన ఆత్మ అంతరాత్మ. అతండె ప్రాతిభాసిక జీవుండు. ఈపదినంజ్ఞలం గలిగింది లింగశరీరం. ఈ స్థూలసూక్ష్మ దేహద్వయానకున్ను కారణంగాబట్టి కారణశరీరం చెప్పబడెను. ఆకారణశరీర మెటుపలెనంటేను, సకలేంద్రియాలున్ను ఉపరత మయినాను వాయువు ప్రకటమైంది గనక, ఆకాశం ఉన్నదే. ఆకాశం లేక వాయువు చలించదు గాబట్టి, వాయువున్ను ఉన్నదే. అన్నం పచనమౌనుగనుక తేజస్సును ఉన్నదే. జలం లేక పచనం కాదు గనుక జలమును ఉన్నదే. దీనికి పాత్రయైన పృధివియునున్నదే. ఈపంచభూతాలున్ను ఉన్నప్పుడె యిరువైయైదు తత్వాలునున్నవే. అదే వటబీజ వటశ్చైవ అనే న్యాయముచేత, యిదే కారణశరీరం. దీనికి అవస్థ సుషుప్తి, అభిమాని ప్రాజ్ఞుండు, ద్రవ్యశక్తి, తమోగుణం, హృదయస్థానం, ఆనందభోగం, మకారం మాతృక. వీటితో వ్యాపకమైన ఆత్మ పరమాత్మ. అతండె పారమార్థిక జీవుండు. ఈపదినంజ్ఞలం గలిగింది కారణశరీరం. ఈయవస్థాత్రయానకున్ను సాక్షియైన కారణానకున్ను మహాకారణమైన శరీరలక్షణమేలాగంటేను, సద్యోజాత వామదేవాది పంచబ్రహ్మలె పంచభూతాలు. అదియేలాగంటేను, "సద్యోజాతస్తథా భూమీ వామదేవాద్భవెజ్జలమ్। అఘోరాద్వహ్నిరుత్పన్నః తత్పురుషాద్వాయురుచ్యతే। ఈశానాద్గగనాకారం పంచబ్రహ్మమయంజగత్" అనికలదుగనుక, పంచభూతాలకున్ను ఉత్పత్తిహేతువులయిన పంచబ్రహ్మలె యీశరీరానకు పంచభూతాలు. నివృత్తి, ప్రతిష్ఠా, విద్యా, శాంతి, శాంత్యతీతమనెడి పంచకళలె పంచవిషయాలు. పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, యీపంచశక్తులె ప్రేరేపకస్వరూపాలైన పంచవాయువులు.

"బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ యీశ్వరశ్చ సదాశివః" యీపంచకర్తలున్ను, అంతఃకరణపంచకము. ఈయిరువైయైదు తత్వాలున్నుగూడి మహాకారణశరీరము. దీనికవస్థ తుర్యం, అభిమాని ప్రత్యగాత్మ, జ్ఞానశక్తి, శుద్ధసత్వగుణం, మూర్ధ్నిస్థానం, ఆనందాభాస భోగం, ఓంకారం యిందున వ్యాపకస్వరూపమైనది నిర్మలాత్మ. అతండె కూటస్థచైతన్యుండు. ఓంకారమున్నదిగనక, అదేప్రకృతి. ఈపదినంజ్ఞల గలిగింది మహాకారణదేహము. ఈనలువది నంజ్ఞలకున్ను అతీతమై జ్ఞప్తికళా మాత్రం శేషించిందె తుర్యాతీతం. ఇది యీజీవతనుచతుష్టయలక్షణం॥ ఇంక యీశ్వరతనుచతుష్టయ లక్షణమేలాగంటేను, ఈశ్వరశరీరశోధన. అదేలాగంటేను, పృధివ్యప్తేజోవాయురాకాశ చంద్రసూర్యాత్మ లనెడి అష్టమూర్తులె యీశ్వరుని యొక్క విరాడ్రూపమైన స్థూలశరీరము, దీనికి ఉత్పత్త్యవస్థ. అభిమాని బ్రహ్మ, క్రియాశక్తి, రాజసాహంకారం, సూర్యస్థానం, సర్వకర్తృత్వభోగం, అకారం మాతృక- వీటియందు వ్యాపకమైనఆత్మ భూతాత్మ, యీతొమ్మిది నంజ్ఞలం గలిగింది విరాట్పురుషుడు. సకల భూతాలకున్ను ఆశ్రయమైన హిరణ్యగర్భశరీర మెటువలెనంటే, దశదిక్కులె శ్రోత్రాలు, వాయువెత్వక్కు, సూర్యుడే నేత్రాలు,

వరుణుడే జిహ్వ, అశ్వినీదేవతలే ఘ్రాణం, వహ్ని వాక్కు, ఇంద్రుండే హస్తాలు, ఉపేంద్రుడే పాదాలు, బ్రహ్మ గుహ్యం, మృత్యువే గుదం, జ్ఞాతృవె అంతఃకరణం, చంద్రుడే మనస్సు, బుద్ధే బ్రహ్మ, క్షేత్రజ్ఞుడే చిత్తం, రుద్రుడె అహంకారం. యీచతుర్దశదేవతలతో గూడింది హిరణ్యగర్భశరీరం. ఇందుకు స్థితి యవస్థ, విష్ణువభిమాని, యిచ్ఛాశక్తి, సాత్వికాహంకారం, చంద్రస్థానం, సర్వ పాలకత్వభోగం, ఉకారం మాతృక— వీటితో వ్యాపకమైన ఆత్మ సూత్రాత్మ, యీతొమ్మిదీ సంజ్ఞలుగలది హిరణ్యగర్భశరీరం. ఈ విరాడ్ఢిరణ్యగర్భాదులకు కారణమైనదే బైందవస్వరూపమైన అవ్యాకృతశరీరము. దీనికి ప్రళయావస్థ, రుద్రుండభిమాని, ద్రవ్యశక్తి, తామసాహంకారం, అగ్నిస్థానం, సర్వసంహార, భోగం, మకారం మాతృక— వీటితో వ్యాపకమైన ఆత్మ శుద్ధాత్మ. అవ్యాకృత మనంగా మహదహంకారము. అదె త్రిగుణగర్భం, బిందూపాధిచేత చిద్విలా సమై పాంచభూతానికి కారణమౌను. విరాడ్ఢిరణ్యగర్భ అవ్యాకృతమనెడి యీశ్వర మాయోపాధిశరీరాలకు సాక్షిస్వరూపమైనదే మూలప్రకృతి. అదే స్వరాట్. అదే అనాహతనాదం. అదె పంచబ్రహ్మము. అదే పంచభూతాలకున్ను హేతువు. ఆ మూలప్రకృతిశరీరానకు అవస్థ సర్వసాక్షి, యీశ్వరుడభిమాని, శుద్ధసాత్వికాహం కారం, జ్ఞానశక్తి, బ్రహ్మాండాతీతస్థానం. సర్వకర్తృత్వ సర్వపాలకత్వ సర్వ సంహారత్వ సర్వనియంతృత్వ సర్వభోక్తృత్వ సర్వేశ్వరాది షడ్గుణైశ్వర్యమే భోగం. ఓంకారం మాతృక. ఇందున వ్యాపకమైన ఆత్మ మహాత్మ. ఈతొమ్మిది సంజ్ఞలు గలిగింది మూలప్రకృతిశరీరం. ఈపిండాండ బ్రహ్మాండాల అష్టతను వులున్ను, వాచ్యార్థమనిపించును, నశ్వరరూపం. ఇది దృశ్యం, వీటికి సాక్షిస్వ రూపమే చిత్తు. ఈయెనిమిదింటితో గూడిన అజ్ఞానోపాధిచేతను, శబళబ్రహ్మమని పించును. వీటికి అతీతమైయుండేది యీశ్వరుని తుర్యాతీతం. జలశర్కరన్యాయం, నిత్యముక్త శుద్ధబుద్ధి స్వభావ, సత్యప్రజ్ఞాన ఘనసత్తు చిత్తు ఆనంద నిత్యపరిపూర్ణ స్వరూపమైనదే నిష్కళబ్రహ్మము. అదే నీవు అని అసిపదం చెప్పును. అదే తత్త్వమసి వాక్యలక్షణం. తత్ ఆవస్తువు త్వం నీవు అసి అయితివి అని అఖం డంగా జెప్పును. ఇందుకు సాక్షులు, ఉపనిషత్తులు, నాలుగు వేదాలున్ను. ఉపనిషద్వాక్యాలేవంటే, "తదేవ భూతం తదుభవ్యమాయిదం తదక్షరె పరమె వ్యోమన్" అనిన్ని "యోవేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" అనిన్ని "ఆకాశశ్శరీరం బ్రహ్మ" అనిన్ని, "ఆకాశ ఆత్మా" అనిన్ని, "తత్రాపి దహరం గగనం విశోకమ్ తస్మిన్యదంత స్తదుపాసితవ్యమ్" అనిన్ని, "బ్రహ్మైవాచః పరమంవ్యోమన్" అనిన్ని, "ఖంబ్రహ్మ త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" "త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మవాదిషం ఋతమవాదిషం, సత్యమవాదిషం" యిత్యాది శ్రుతులంబట్టి జీవేశ్వర తనుచతుష్టయలక్షణం చెప్పంబడెను.

ఇంక వాక్యత్రయలక్షణమేలాగంటే "అతః పరం నాహమాది వాక్య త్రయవిచారణో కథ్యతె బాలబోధార్థం సమగాచార్యసమ్మతా" అని కలదుగనుక,

వాక్యత్రయ లక్షణమేలాగంటే, నాహం కోహం సోహం అనేదిప్పుడు వాక్యత్రయము. వాటి అనుక్రమం చెప్పేము. అందు నాహమనెడిది ప్రకృత్యాత్మకమై యుండును· అది యెలాగంటె యిప్పుడు పురుషుని ఆశ్రయించి తోచినస్వప్నము అదేవదత్త వ్యతిరిక్తమును గాక, అనిజదేవదత్తుడున్ను గాక మరుపువల్లనుండి తోచి, మేలుకుంటే తనలోనణగెడి అనిర్వాచ్యరూపమైన స్వప్నమాయాశక్తియేలాగో అలాగే, సత్యజ్ఞానానందాత్మకమైన తనకు కూటస్థచైతన్యమైన పరబ్రహ్మమందు జగత్కారణ రూపమైన మాయశక్తిన్ని ఆ బ్రహ్మముకంటె భిన్నమున్ను గాక బ్రహ్మస్వరూపమున్నుగాక, అవిచారంవల్ల తోస్తున్న నిర్విషవత్సనాభులు ఒక్క మూలికయందె తోచినట్టు, తామస సాత్విక భేదంవల్ల విద్యావిద్యాత్మకమై, అనిర్వాచ్యత నొంది విక్షేపావరణరూపంవల్ల జీవజగదాకృతియై తోచిన మాయాశక్తి వైచిత్ర్యమును మిథ్యయని యేర్పరచేదిప్పుడు నాహమనే వాక్యవిచారము. అందు ఉత్తమాధికారికి నాహమనె వాక్యము తన్నుంచె సిద్ధియౌను, అని కొందరు వేదాంతులు చెప్పుదురు. అలాగైతె "ఆచార్యవాన్ పురుషో వేద" అనే శ్రుతికి అనర్థం వచ్చునుగనుక, గురుబోధవల్లనె సిద్ధిగావలెను. ఇంకను కోహం అనే వాక్యానకు విచారం, కోహం అనగా నేనెవ్వరు అనుట. "సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠ" యని కలదుగనుక, నాహం అనే పదంవల్ల తనయందు వేరైనటువంటి అహంకారాది దేహాంత ప్రపంచమును తృణీకరించి, సమిత్పాణియై కృతార్థతవల్లను, గురువందు నుపసన్నుండై "కోయమాత్మేతి వయముపాస్మహే" అని కలదుగనుక, కోహం అనే ఆతండు "స్థాణుర్వా పురుషోవా" అన్నట్టె కోటిద్వయావలంబి కాదు గనుక సంశయాత్మకుడున్ను గాదు. కోహమనెను గనుక నిశ్చయాత్మకుడున్ను గాదు. ఈ కోహమనే అతడు వాచ్యపరంగాచూస్తే, జడాజడాభిమానాలు రెండున్ను నాహమనె పదంవల్ల నేతిముఖానం ద్రోసి నిరాలంబ చైతన్యస్వరూపమని తెలుసును. స్వరూపమాత్ర భ్రమానహితంగాను, కోహమనే యాతనికి గురు మహావాక్యార్థం బోధకంవల్ల దెలిసి, అయర్థనిశ్చయాత్మకుడై సోహమని నిలుచును. అందలి చిత్పద అచిత్పదాదులకు ప్రామాణ్యమంతేకాని సిద్ధార్థసూచకమైన మహావాక్యాలకు యేలాగు ప్రామాణ్యమౌనంటే, "వనానాం సమూహపదం వనం" ... .... .... అని కలుగంబట్టి యితరేతరాకాంక్షయోగ్యత, సాన్నిధ్యత్వమనెడిది. అచేత అనెడిది చిత్పదానకు, మహావాక్యానకు సరిఅయె గనుక, ప్రమాణమనే చెప్పవలెను. అయితే కార్యార్థసిద్ధార్ధ భేదమందేలాగంటేను, "పుత్రస్తె జాతః సప్తద్వీపావసుంధరా" అనే వాక్యానకేలాగు ప్రామాణ్యమంగీకరింతువాలాగే, మహావాక్యానకున్ను ప్రామాణ్యమె అంగీకరించవలెను. మహాసురగణదర్పణమందు విపరీతమైనందువల్ల ప్రతిబింబవైపరీత్యమేలాగు దోచునాలాగే, అజడ అదృశ్య అమూర్త సుఖస్వరూప కూటస్థచైతన్య స్వరూపమైన తనందలి బుద్ధియనెడి మహాదర్పణమందే జడదృశ్యదుఃఖసావయవమై బింబించి చిదాభాస చైతన్యము నానాకృతకవర్తిభేదాలవలె బిరుసులు పూలబాణాలు

మొదలయిన నానాచిత్ర సామర్థ్య ప్రకాశభేదాలు తోచినట్టే, యీచిదాభాసమున్ను తత్తత్సంస్కారభేదాల చేత, నానాత్వముతో గూడి మెలంగే భ్రమను ఈమహా వాక్యబలంచేత ద్వైతపారోక్ష్యరూపమైన విరుద్ధాంశమునున్ను సోయమాది శబ్ద జ్ఞానోపాధియందు పరిహరించి, అన్నమయకోశమైన స్థూలశరీరమునున్ను, అందుకు లోనైన ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయమనెడి కోశత్రయాత్మక మైన లింగశరీరమునున్ను, అందుకు లోనైన ఆనందమయాత్మకమై తమో రూపమైన కారణశరీరమునున్ను వేరుచేసి, అందుకులోనైయున్న, తనస్వరూప మైన, ప్రత్యగానంద కూటస్థచైతన్యానకున్ను విశ్వసాక్షికమైన అద్వయానంద బ్రహ్మచైతన్యానకున్ను గురుకారుణ్యరూపమైన మహావాక్యంవల్లనె యైక్యత్వ మునున్ను తెలిసి, అనుపమానంద స్వరూపుండె సోహమనును. ఆసోహమనె మ .... .... .... ద్యానవల్ల స్ఫుటమౌను. అదియేలాగంటేను, దేహమైన బలం వల్ల పురుషునియందలి పురుషత్వమున్ను జపించక, ధ్యానించక, మరవక, తనకు వెరకై తోచక, తానున్ను పురుషుడననె జ్ఞానమున్ను దేహంనేను అనెడి మూఢనిశ్చయంవల్ల దేహసంపద యేలాగాయెనో అలాగే, శ్రుతి గురుప్రసాద బలంవల్లను నిశ్చయమైన జ్ఞానముచేత దానె బ్రహ్మమౌను. అతండే మహా పురుషుండు. అటువంటి మహాపురుషునికి అసాధారణ ధర్మమేది అంటె, బ్రహ్మా త్మైక్య జ్ఞానవివేకమిప్పుడే అసాధారణధర్మం. అయితే నిగ్రహానుగ్రహాదిధర్మాల సాధారణధర్మాలంటేను, అక్కడ అసాధారణ ధర్మమనెడిది వ్యాఘ్ర సర్ప దుర్జనాదుల యందున్ను, రాక్షసాదులయందున్ను ఉన్నది గనుక, సామర్థ్య మున్ను కారణం గానేరదు. అయితే వర్తననియమమున్ను అసాధారణధర్మం గారాదా అంటేను, అప్పుడు దూర్వాస క్రోధియైయుండెను, నారదుడు కలహ ప్రియుండైయుండెను, కృష్ణుండు జారుడైయుండెను, భరతుండు విరక్తుండై యుండెను, జనకుండు రాజ్యమేలుచుండెను, మరికొందరష్ట మహాసిద్ధులకై తత్తత్క్రియానుసారులై యుండిరి. అటు గనుక, వర్తనలున్ను ప్రమాణం గాదు. అటు గనుక, తామసజనులు సిద్ధిసామర్థ్యాల బట్టి మహాపురుషుండని యెరుంగుదురు, మధ్యములు నడకవల్ల మహాత్ముండని యెరుంగుదురు. అత్యంత కృతార్థులైన విద్వజ్జనులు బ్రహ్మాత్మైక్య జ్ఞానానుభవం గలవాడె మహాత్ముం డని యెరుంగుదురు. ఈయర్థమందు శ్రుతి, "బ్రహ్మవిద్యాత్పరో నాస్తి నాస్త్యా త్మపర లాభవాన్। యల్లాభాన్నాపరం లాభో యత్సుఖా న్నాపరం సుఖమ్" అనిన్ని "యత్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్" అని కలదు గనుక, ఆత్మలాభమె.... .... ... అదియేలాగంటేను, అందు కంటె నన్యమైన పదార్థాలయందు నొకానొక విశేషగుణాలంబట్టి ప్రవృత్తి నివృత్తులంతెకాక కేవల విశేష్యమాత్రాలైన తృణాదులయందుపేక్ష బుద్ధియుండును. తనందు తాను ప్రవృత్తిగలవాడువలెనె ఒక విశేషగుణాలను బొందక తనకుదానె అత్యం తాప్తుండు గాబట్టి, ఆప్తమనెడి నిజస్నేహమనెడిది తనందె తనకు గాక తన

కంటె అన్యమైన సకలప్రపంచమందున్ను సౌఖ్యానకై చేసెడి స్నేహమంతె కాక సహజం గాదు. అటుగనుక, తనకుదానె అత్యంత సుఖాస్పదభూతమైన కారణానంబట్టి, "కింత్వాత్మనస్తు కామాయ తతః ప్రియతమ స్స్వయమితి" అని కలదు. అది కారణాన, తనయొక్క మరపె ఘనమయిన నష్టమని యెరుగుట, ఆత్మలాభమె అధికలాభమని యెరుగుట. అటుగనుక, మహాత్ముండయిన ఆతండు అధికలాభపదాన బొందిన కారణాన, ఆతని శివుడనియెరింగి ప్రార్థించి కృతార్థులౌదురు.

సంప్రబుద్ధోసి భగవాన్ సత్యముక్తం మయోత్తమ।
కర్తాభావా జ్జగన్నాస్తి తేన నాస్తి పదార్థదృక్।
చిచ్చైత్యకలితో బంధ స్తన్ముక్తౌ ముక్తిరుచ్యతే।
చితశ్చైత్యాఖిలాత్మేతి సర్వసిద్ధాంత సంగ్రహః।

అనిన్ని "వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థా స్సన్యాసయోగాద్యతయ శుద్ధ సత్వాః। తేబ్రహ్మలోకేతు పరాంతకాలే పరామృతా త్పరిముచ్యంతి సర్వే"॥ అని వాక్యత్రయలక్షణము చెప్పబడెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్య పరమానందతీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యా సుధార్ణవే యోగశాస్త్రే
ప్రకృతిపురుష వివేకమాయా విద్యోత్పత్తిజీవేశ్వర
తనుచతుష్టయ వాక్యత్రయనిరూపణం
నామ షష్ఠప్రకరణం సమాప్తమ్

---

# ఏడవ ప్రకరణము

చైతన్యం శాశ్వతం వీర్య మనాతీతం నిరంజనమ్।
నాదబిందు కళాతీతం తస్మై శ్రీగురవే నమః॥
లోకేనల్పవిదా వికల్పిత మహాబ్రహ్మాండ కోటిచ్ఛలా-
దుద్యద్బుద్బుదమండలిమ్మనవధిం బిందన్న మందన్నవై॥
విద్వద్వర్ణిత నిర్ణయోక్తి రచనోత్కర్షోదవర్షోదయైః
యోగీంద్రన్సమహాఘ ఘనోపహరతే సర్వత్ర తాపత్రయమ్॥

ఉత్తమాధికారులైన ముముక్షువుల విషయీకరించి పరమానందతీర్థులు అభిమానచైతన్యానేక విచారలక్షణమున్ను, పిండాండ బ్రహ్మాండాలకు ఐక్య నిర్ణయమున్ను, బ్రహ్మానంద వివరణమున్ను ఈప్రకరణమందు నిరూపిస్తున్నారు. మొదటి అభిమాన చైతన్యానేకవిచారలక్షణమేలాగంటేను, ఏమైనాయొక మాయాకార్యరూపమైన అభిమాన ముపవర్తనలయొక్క ఏకానేకత్వంవల్ల, అగ్నియొక్కటె ఏకానేకత్వం గలిగినట్టె, విక్షేపావరణాత్మకమైన ప్రపంచమునాశ్రయించి అనేకాలై స్ఫురిస్తుండును. వివేకబలం వల్ల విశ్వసాక్షిక బ్రహ్మము తానని ఆయభిమాన మేకమై స్ఫురిస్తుండును. అందు విక్షేపావరణస్వరూప మేమంటేను, అనేకాలై తోచినతోపు (రూపము) లన్ని విక్షేపాలనిపించును. అదేలాగంటేను, ఒకానొక వృక్షానకు కారణమయిన బీజమందు అంకురం మొదలయిన (తోపులు) రూపాలు గలిగినట్టె, జగత్కారణరూపమైన మాయాబీజమందు ప్రథమవిక్షేపం మహదహంకారమనిపించును. ఆయహంకారం స్వేచ్ఛాకల్పనవల్ల చేష్టింపబడి శుభాత్మకమైన నకలక్రియాజాలమున్ను ద్వితీయ విక్షేపమనిపించును. క్షణములో జెడినాను అంతఃకరణానుషంగియైన విచిత్ర నంస్కారము తృతీయవిక్షేపమనిపించును. ఆనంస్కారంయొక్క తారతమ్యభావంవల్ల, స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమైన నామభేద, రూపభేద, గుణభేద, భోగభేదాత్మకమైన నకలప్రపంచముయొక్క తోవున్ను క్రియాఫలస్వరూపమైన కారణానబట్టి, నాలుగోవిక్షేప మనిపించును. ఆనామభేద రూపభేద గుణభేదాలును, వికార, పరిణామ, అవయవ విస్ఫులింగాలు మొదలైన అనేకవిధాలై తత్తత్ఫలానుసారంవల్ల, అవిక్షేపమున్ను అనేకాలై స్ఫురిస్తుండును. అది యేలాగంటేను, బీజము పృథివీసంగంవల్లతప్ప ఉత్పన్నపరిణామాలుగానట్టె, సంప్కారవిశిష్టమైన శుక్లశోణిత బిందువులందు సంయోగసిద్ధి గలిగితేగాని స్ఫురించదు గనుక, యిది సంయోగవిక్షేపమనిపించును. భూత సంయోగమనిన్ని, గ్రహసంయోగమనిన్ని, కాలసంయోగమనిన్ని, కర్మసంయోగ మనిన్ని, వర్ణసంయోగమనిన్ని ఈసంయోగశక్తులన్నీ యనేకప్రకారాలై యుండును. ఇక పిండితమైన బీజమందు అవయవాత్మకమైన వృక్షము స్ఫురించినట్టె,

పిండితమైన వీర్యమందు కరచరణాద్యవయవములు అవయవవిక్షేపమనిపించును. ఇంక "పూర్వరూపపరిత్యాగేన రూపాంతరప్రాప్తి పరిణామః క్షీరం దధ్యాకారేణ పరిణమతే" అని కలదుగనుక, అన్నరసము దేహాకారమందు పరిణమిస్తున్నది గనుక, పరిణామవిక్షేపమనిపించును. బీజమున్ను భూతసంయోగమైనా జలానుకూలం గలిగితేగాని యేలాగు ఉత్పన్నంగానేరదో అలాగే సంస్కారానుకూల్యత అనుకూలశక్తి అనిపించును. ఒక యగ్నియందనేక మిణుగుర్లు తోచిచెడినట్టె, ఒక్క దేహమునుంబట్టి తోచిచెడే నఖకేశపుత్రాదులు విస్ఫులింగశక్తి అనిపించును. పసురైన తీగెయందు బంగారువర్ణంగల పుష్పం తోపినట్టె, అజడోపాధియైన దేహమందు శుద్ధజడమైన నఖకేశాదులు సాదృశ్యశక్తి యనిపించును. భిన్నజాతీయమైనా పోలికమాత్ర మనిపించుకొన్న "గోసదృశో గవయః" అన్నట్టె తోపించుకొనె ప్రపంచమున్ను రూపసాదృశ్యశక్తియనిపించును. రూపభేదమైనా "సింహో మాణవకః" అన్నట్టె గుణసాధర్మ్యము సాదృశ్యశక్తి అనిపించుకొనును. క్షణానకు ఒకవికారంతోగూడిన మేఘాలవలెనే బాల్యయౌవనాద్యవస్థా భేదాలు వికారశక్తి అనిపించును. ఉన్మత్త మాద్యాది మూలికలవలెనే శబ్దస్పర్శరూపరసగంధాత్మకమైన క్షణిక భోగప్రపంచమునున్ను సత్యమన్నట్టె, తానసేదిన్ని యిది అనేదిన్ని తెలియని కాలమునుం బుట్టిస్తున్నది గాబట్టి ఉన్మాదశక్తి అనిపించును. వృక్షమందు తోచిచెడే పత్రపుష్పఫలాదులవలెనే, తనందు అప్పటప్పటికి సత్యమన్నట్టె తోచిచెడే అవస్థాత్రయాలు స్వగత భేదశక్తి అనిపించును. ఒక్క వృక్షానకు తజ్జాతీయమైన మరొకవృక్షం గన్నట్టే, ఒక శరీరంయొక్క అకారంవలెనే మరొకశరీరాకారం గనుచున్నారము గనుక, అది స్వజాతిశక్తి అనిపించును. వృక్షముకంటె వేరైతోచిన తీగెచెట్లవలెనే కందమూలాదులవలెనే మనుష్య జాతికంటె వేరైన పశుమృగపక్ష్యాదులున్ను, దేవతలున్ను మనుష్యజాతికంటె విజాతి అనిపించును. ఇంక దేశవైచిత్రిక, భూతవైచిత్రిక, పదార్థవైచిత్రిక మని అనేకవిధాలై తోస్తుండును. అది యెట్లున్నను, అభిమానవిక్షేపమైన క్రియాసమూహము స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమై యుండు గనుక, తత్తత్సంస్కారమున్ను స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమై యుండును. ఆ సంస్కారవశంవల్ల గుణాలున్ను స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమై యుండును. శబ్దస్పర్శ రూపరసగంధాత్మకమైన సకలభోగాలున్ను స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమై యుండును. ఇంక యీస్థావరజంగమాత్మకమైన ప్రపంచమున్ను క్రియాఫలరూపసమౌటం బట్టి, యేయేవిధాలం దోచే కౌతుకాలున్ను స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమనే తెలియవలెను. ఇటువంటి ఘనమైన విక్షేపశక్తిన్ని, ఒకానొక వృక్షమునం జుట్టుకొన్న దొడ్డతీగెలున్ను అక్కడ తనకు ఆశ్రయమైన వృక్షంయొక్క శాఖోపశాఖలనెల్లా తానేచుట్టుకొని మూసుకొని అవృక్షంయొక్క ఫలపత్రపుష్పాదులనెల్లాను కప్పుకొని తానెతానై అంతటా

నిండి పరిపూర్ణమైన తీగెలున్ను తనఫలపత్రపుష్పాదులవలెనే కనిపించి తన కాశ్రయమైన వృక్షానకు తానే భారమైయున్నట్టె యేదైనా ఒకటి అభిమాన చైతన్యమును దొడరిన కర్మాలనె తీగెలు చుట్టి నానావైచిత్ర్యభేదాంకురాలు కలిగి నిజానందమునుం గప్పుకొని, స్వగత, స్వజాతి, విజాతీయాత్మకమైన రూపభేద, గుణభేద, త్రాణభేద, భోగభేదాత్మకమైన ప్రపంచరూపంచేతం గనుపించి రంజించి తోచెడి తోపు విక్షేపశక్తి అనిపించును. ఇటువంటి విక్షేపాత్మకమైన ప్రపంచమును సత్యమని యెంచి, అభిమాన బుద్ధిని ఆదరించి, తీగెలభారాన వృక్షము నలిగినట్లె సుఖదుఃఖాత్మకమైన సంసారభారంచేత కరగి, డస్సిన అవివేకమిప్పుడు ఆవరణశక్తి అనిపించును. ఆవరణమనియె డిది వివేకించినాను నిశ్చయించనియ్యాదు గనుక, అవిద్యయనిపించుకొనును. నిబిడాంధకారము వలెనే ముందువెనక కనిపించనియ్యాదు గనుక, తమస్సనే పేరాయెను. లేనిప్రపంచమును కలుగంజేస్తున్నది గనుక మాయ యని పేరా యెను. కర్మానుసారంవల్ల దోచిన సకలప్రపంచమందున్ను తాననిన్ని తన దనిన్ని మోహము పుట్టిస్తున్నది గనుక, మోహమనే పేరు గలదాయెను. యత్కృతక తత్తదనిత్యం అని కర్మమున్ను, కృతకమైనందువల్ల దత్తత్ఫల రూపప్రపంచమున్ను కృతకమని తెలుసుకోనియ్యాదు గనుక, అనృతాత్మక మనే సంజ్ఞ గలిగిందాయెను. ఈయర్థమందు "విక్షేపాకృతి రూపాభ్యాం న బంధతి నబాధ్యతి। నభాతి నాస్తి కూటస్థః యిత్యాపాదనమావృతిః" అని విక్షేపావరణ రూపమైన ప్రపంచాభిమానంవల్ల, ఒక్కటి తత్తదుపాధిభేదంవల్ల బాహ్యనిష్ఠమై అనేకమనెడి సంజ్ఞగల్గినదాయెను. నిజాశ్రయమైన కూటస్థచైత న్యమును అభిమానించి ఏకమనే సంజ్ఞ గలిగిందాయెను. అదియేలాగంటే, బహురంధ్రాలుగల ఘటమందున్న దీపము యేకమైయుండిన్ని, ఘటచ్ఛిద్రోపాధిం జేసి బాహ్యదృష్టికి బహుదీపాలై తోచినట్టే, అహంకారానకు ఆకారమైన దేహాలకున్ను ఒక్కటే అయినందువల్ల కూటస్థచైతన్యమును వివేకబలంచేత అభిమానించి, యీశ్వరావస్థయందు సకలదేహ కరణేంద్రియాద్విలక్షణమై అభి మానము యేకమై స్ఫురిస్తుండును. అవిద్యావశంచేత బాహ్యబుద్ధివల్ల, భేద రూపమైన ప్రపంచంయొక్క తత్తదుపాధివల్ల జీవులనే సంజ్ఞంబొంది అభి మానము అనేకాలై స్ఫురిస్తుండును. ఈయహంకారమున్ను ఏకానేకాత్మక మైనట్టే, తదాధారకూటస్థచైతన్యమున్ను ఉపాధివశాన అనేకాత్మకమైయుండును. అదియేలాగంటే, యేమైనాయొక అరంటాకుల ఛిద్రాల యొక్క ఉపాధిని ఆకాశమున్ను ఛిద్రవ్యతిరిక్త స్థలమందలి ఆకాశంలోనే యేకమైయుండిన్ని ఛిద్రద్దళోపాధివల్ల ననేకత్వమును బొందిన ఆకాశంతో గూడాను దీపప్రభానన నేకత్వమును బొంది చిత్రవ్యాపార రంజనాశక్తినిం బుట్టిస్తున్నట్టి, సత్యజ్ఞానా నందాత్మకమైన ఆకాశసదృశమైన తనందు అనిర్వాచ్యమైన మాయాశక్తియొక్క కార్యరూపమైనది దీపప్రభా సదృశమైన అహంకారమొక్కటే. అవిద్యోపాధి

వల్ల ననేకత్వంతోగూడి, వివేకోపాయంవల్ల తనకు ఆశ్రయమైన బ్రహ్మచైతన్యాభిమానమునుం బట్టి యేకత్వమునుగూడి, ఉదకమందు దోచిన బుగ్గలాయుదకములోనే అణగినట్టె, అహం అనెడి ప్రత్యయమన్యత్వనివారణం గలిగియున్నది గనుక, అనన్యస్వరూపమైన కూటస్థచైతన్యమందె విద్యోపాయంవల్ల లీనమై, అవాఙ్మానసగోచరమైన పరబ్రహ్మమందు అహంకారమున్ను సమరస మాయెననెడిదిప్పుడు రహస్యము.

కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః।
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధో విశిష్యతె॥

అని అభిమానచైతన్యముల యేకానేక విచారం చెప్పంబడెను. ఇంక పిండాండబ్రహ్మాండాలకు ఐక్యం చెప్పుచున్నారము.

పిండ బ్రహ్మాండయోరైక్య జ్ఞానానుభవవర్ణనా।
కథ్యతె బాలబోధాయ యథామతి మయాధునా॥

అది యెటువలెనంటేను, యేదైనాయొక కార్యకారణాలకు ఉపాదాన కారణత్వం చేతను, తంతుపటాలకు ఏకత్వమైన ఉపాధియందు కార్యరూపమైన అవిద్యకున్ను కారణరూపమయిన మాయకున్ను తత్తదుపాధివల్లదోచిన జీవేశ్వరులకు అనుభవయుక్తిబలం వల్లను యేకత్వమును ప్రతిపాదించేదిప్పుడు పిండాండబ్రహ్మాండాలయొక్క ఐక్యజ్ఞానానుభవమనిపించును. అదియేలాగంటే ఒకానొక వనమందు ఒక్కొక వృక్షానకు ప్రత్యేకనామమున్ను తత్తజ్జాతిభేదమున్ను కలిగి చెట్టు అనే సంజ్ఞ గలిగిన చోటవృక్షసమూహమందు వనం అనే పేరు గలిగినట్టు, ప్రత్యేకజాతికి పిండాడమనె సంజ్ఞ గలిగినచోట సకల పిండాండాలకున్ను బ్రహ్మాండమనే సంజ్ఞగలుగును. ఇంక వృక్షవ్యతిరిక్తమైన వనంలేనట్టే, సకల పిండాండవ్యతిరిక్తమైన బ్రహ్మాండమున్ను లేదు. పిండాండ బ్రహ్మాండాలకున్ను పంచభూతాలకున్ను మృద్ఘటాల ఉపాధియందు అవినాభావసంబంధమైనందువల్లను, పంచభూతాలకున్ను బ్రహ్మాండాలకున్ను యేకత్వమనే తెలియవలెను. అభూతాలకు సుషుప్తి కార్యరూపమైన, జాగ్రత్స్వప్నాలున్ను సుషుప్తిలో నణగినట్టే, తామసాహంకారంవల్ల పంచభూతాలున్ను తోచి, ఉపసంహారకాలమందు మరల ఆతమస్సందె అడగు గనుక, పంచభూతాలకున్ను తామసాహంకారానకున్ను, షోడశకళాత్మకుండైన చంద్రునికి కళంకం యేకదేశమై చంద్రుడుగాక చంద్రవ్యతిరిక్తముంగాక తోచినట్టే, అతి శుద్ధమై శుద్ధసత్వప్రధానంవల్ల అనిర్వాచ్యరూపమైన మాయాశక్తియందు ఆ తమోగుణమున్ను చంద్రునియందు కళంకు దోచిన ఉపాధియట్టుంబలెనే స్ఫురిస్తుండును. ఆ చంద్రునందలి కళంకున్ను జారచోరాదులకు సేవ్యమై, చంద్రుని నిజరూపమై ప్రకాశరూపమైన అమృతాంగమున్ను దేవతాసేవ్యమై

నట్టే, యీమాయయొక్క తామసాహంకారమున్ను సృష్టికి కారణమై, రాజసాహంకారము సకలసృష్టియొక్క ఉపభోగానకు కారణమై యేర్పడి మాయయొక్క నిజాంశమైన శుద్ధసాత్వికము తనకు అనిర్వాచ్యరూపమైన అధారత గల పరబ్రహ్మమును ఔపచారికత్వముచేత నధికరించి బహుసామర్థ్యంవల్ల జగదభిమానియైన యీశ్వరుడనే సంజ్ఞ గలిగిందాయెను. అటువంటి శుద్ధసత్వ మాయోపాధిం గల యీశ్వరునికిన్ని శుద్ధమలిన సత్వోపాధిగల జీవులకున్ను విరుద్ధాంశమును త్యజించి అవిరుద్ధాంశమైన ఆత్మమాత్రత్వేన ఏకత్వముండును. తటాకంలోని ప్రతిబింబాకాశమునకున్ను కూపాదులయందలి ప్రతిబింబాకాశానకున్ను ఉపాధులయొక్క సంకోచవిస్తారమంతే కాని ప్రతిబింబానకు తారతమ్యం లేనట్టే, పిండాండముయొక్క స్థూలశరీరాభిమానైన విశ్వునకున్ను, బ్రహ్మాండముయొక్క స్థూలశరీరాభిమానైన విరాట్పురుషునకున్ను ఐక్యమనే తెలియవలెను. ఈయర్థమందు "పంచీకృత, పంచమహాభూతాని తత్కార్యం సర్వం విరాడిత్యుచ్యతె। ఏతత్స్థూలశరీరమాత్మన యింద్రియైరర్థోపలబ్ధి జాగరితం తదుభయాభిమాన్యాత్మా విశ్వః" అని కలదు. ఇంక పిండాండము యొక్క సూక్ష్మశరీరాభిమానైన తేజసునికిన్ని సకలలింగశరీరసమిష్టిరూపమైన బ్రహ్మాండం యొక్క సూక్ష్మశరీరాభిమానైన హిరణ్యగర్భునకున్ను ఐక్యమనే తెలియవలెను. ఈయర్థమందు "అపంచీకృత పంచమహాభూతాని సప్తదశకం లింగం భౌతికహిరణ్యగర్భ యిత్యుచ్యతె। ఏతత్సూక్ష్మశరీరమాత్మనః తదుభయాభిమాన్యాత్మాతైజసః" అని కలదు గనుక, ఇంక పిండాండముయొక్క కారణశరీరాభిమానియైన ప్రాజ్ఞునకున్ను బ్రహ్మాండముయొక్క కారణశరీరాభినియైన తామసోపాధిస్థుండైన అవ్యాకృతమనే రుద్రునకున్ను ఐక్యమనే తెలియవలెను. ఈయర్థమందు "శరీరద్వయ కారణమాత్మా జ్ఞానసాభాస మవ్యాకృతమిత్యుచ్యతె। తదుభయాభిమాన్యాత్మా ప్రాజ్ఞః" అనికలదు గనుక, యీ యవస్థాత్రయాలున్ను తనందు అప్పటప్పటికి తోచి చెడేవని కని అందుకు వేరై నిలిచిన యెరుకే తానని తెలిసిన తెలివిన్ని ప్రాకృతులయిన లోకుల తెలివికి వేరైనట్టే, యీసృష్టిస్థితి లయాత్మకమైన సకలప్రపంచమున్ను క్షణభంగురమని కని అసృష్టిస్థితిలయకర్తలకంటె విలక్షణుండైన యీశ్వరునకున్ను వివేకబలంవల్ల అవస్థాత్రయాలకు వేరైన తుర్యుండనే జీవునకున్ను ఐక్యమనే తెలియవలెను తుర్యుండనే వివేకంవల్లను తొలంగిన వివేకోపాధినుండి తోచిన తుర్యాతీతుండైన జీవునకున్ను, ఈశ్వరాభిమానం తొలంగి జగత్సాక్షిమాత్రమైన సదాశివునకున్ను ఐక్యమనే తెలియవలెను. ఇంక ఘటాకాశ మహాకాశాలకైక్యమైనట్టే, సకలప్రపంచానకున్ను తొలంగి జ్ఞాతృత్వంచెడి నిలిచిన కూటస్థచైతన్యానకున్ను, అవాఙ్మానస గోచరమైన అద్వయానంద బ్రహ్మచైతన్యానకున్ను ఐక్యమనే తెలియవలెను. ఇంక అవాంతరమందు తోచిన భేదప్రపంచానకున్ను కొన్ని గ్రామసీమలని పరిచ్ఛేద కల్పనగలిగి ఒక్క భూమియే తోచినట్టే, స్వగత

స్వజాతి, విజాతీయాత్మకమై తోచిన మాయాకల్పనకు తనకు ఆత్మస్వరూపమైన బ్రహ్మమే ఆధారమైయుండును. ఈమాయ విచారిస్తే దబ్బరై యున్నది గనుక, సత్యమనరాదు; ప్రపంచరూపంచేత దోస్తున్నదిగనుక శూన్యమనరాదు; ఎరుక విడిచి వేరే తోచలేదుగనుక భిన్నమున్ను అనరాదు. ఇది యేలాగో అనేది వివేకంచేత తెలుసుకోబడుచున్నది గనుక, ఏకత్వమని చెప్పనున్ను రాదు. అటుగనుక తనయందలి అనిర్వాచ్యరూపమైన మాయాశక్తిన్ని తనకు విచిత్రాలైన అత్తత్వమునం బొంది తనస్వేచ్ఛామాత్రంచేత బాహ్యభోగ సంకల్పనా మాత్రమైయుండును. అది యేలాగంటే, తనయందు బాహ్యభోగసంపద్రూపమైన విచిత్రశక్తి, తనకు వైచిత్ర్యవిషయంకొరకు ఆకాశమాయెను; తనకు స్పర్శవిషయముకై వాయువాయెను; తనకు రూపవిషయసౌఖ్యంకొరకు అగ్ని అయెను; తనకు రసవిషయసౌఖ్యమునకై జలమాయెను; తనకు గంధవిషయ సౌఖ్యమునకై పృథివి అయెను. ఈశబ్దస్పర్శరూపరసగంధాది విషయరూపములైన బాహ్యభోగములున్ను నిజమందు కరణరహితమైన తనయందు సాధనాలు లేక ఘటించవుగనుక, శబ్దాది బాహ్యభోగసాధనాంగాలైన పంచీకృతాత్మకమైన స్థూలశరీరం లింగశరీరమాయెను. ఈసకల భోగాలున్ను తనకు యీశ్వరావస్థయందు యిచ్ఛామాత్రంచేతనే సాధ్యమైనాను, అవిద్యోపాధివల్ల జీవత్వమునంగీకరించిన వేళయిట్టి ఉపాధిభేదంవల్ల దనకు ప్రయత్నములేకే సకలసంపదలున్ను సాధ్యంగానేరవు గనుక, ప్రయత్నరూపమైన సకలక్రియలును తనకు బాహ్యసంపత్సాధకంగా గల్పించుకొన్నవనే తెలియవలెను. అటుగనుక, శుభాశుభాత్మకమై సకలక్రియాసాధకరూపమై స్వర్గనరకాత్మకమైన యీ బాహ్యసంపద్భోగమనెడిది, తనసౌఖ్యంకొరకొడ్డిన ఒడ్డింతేకాని తనకు విరోధంగా నేరదు. అదియేలాగంటేను, చెరసాలసంకెళ్లనున్న జనులు తమతమ ఆత్మకు లెస్సగావలెననే చింతిస్తూ ఉందురు. బెదరిపారే మృగాలున్ను తమతమ ఆత్మరక్షకొఱకే పారుచుండును. దోచబోయే లుబ్ధులున్ను తమ తమ ఆత్మరక్షకొఱకే పోవుచుందురు. నరకములోనుండే జీవులున్ను తమతమ ఆత్మసౌఖ్యముకొఱకే విచారపడుచుందురు. అతిభయంకరములైన వ్యాఘ్రసర్పాదులున్ను యమకింకరులున్ను తమతమ ఆత్మసౌఖ్యముకొఱకే ప్రాణిహింస చేయుచుందురు. ఇంకను బ్రహ్మాదిదేవతలున్ను తమతమ ఆత్మసౌఖ్యముకొఱకే నిజస్నేహితులైయున్నారు. ఇంకను శ్రేష్ఠమై నిజాత్మకమైన సకలక్రియఫలాలున్ను సకలజీవులకున్ను తమతమ నిజస్నేహసకు విరోధంపుట్టించకే సకలకృత్యాకృత్యాలయందున్ను తమతమ సౌఖ్యములకొఱకే యుద్యోగిస్తూ ఉండును గనుక, తమతమ ఆత్మయందు అందరున్ను అత్యంత ప్రేమాస్పదభూతులు. ఇంక శైవవైష్ణవాది సకల దర్శనాదులయందున్ను ఒకదర్శనంవారు మరొక దర్శనాది దేవతలను నిందిస్తూ ఉందురు. తమతమ ఆత్మవిషయ మందు అందరున్ను హితమతులంతేకాని, ఒకరినిన్ని శత్రులను గానము. అదియేలా

గంటే, ఒకానొక రాజపురుషుండు, తనసౌఖ్యముకై అంతఃపురములో సంపాదించిన కోటి మందిస్త్రీలు తమతమ సవతిమచ్చరాన కలహం సంపాదించినాను, మరి కొందరు స్త్రీలలంకరించుకొనుచున్నను, అనుభోగంగల చోటనున్ను విరహ ప్రలాపమందున్న చోటనున్ను తమకు నాయకుండైన రాజపురుషునందలి అత్యంతప్రీతికొరకై చేసే కృత్యాలంతేకాని వేరేఫలం లేనట్టే, యీసురనరతిర్యగాత్మకమైన్న, తత్తద్దేహాభిమానరూపమైన సకలప్రపంచమున్ను పరమార్థమందు విచారిస్తే బహుస్త్రీలకు రాజపురుషుం డొక్కండె ప్రాణనాయకుండైనట్టు, "యేకమేవాద్వితీయం" "బ్రహ్మత్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" అనెడి యిత్యాది శ్రుతి గురుస్వానుభవం చేత ప్రతిపాద్యమానరూపమైన సమస్తమైన వారికిన్ని ఆత్మస్వరూపమైన సత్యజ్ఞానానందాత్మకమైన పరమాత్మ గురుకారుణ్యంవల్ల దానె అని తెలిసినదాయెను. సకలజీవులు తమతమ సౌఖ్యమును చింతిస్తున్నారని అర్థం. ఈయర్థమందు శ్రుతి, "ప్రియోహ్యాత్మా ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి". సకలజంతువులును తమతమ ఆత్మకు తాము శత్రులుగారు గనుక, తాను విశ్వాత్మకస్వరూపమైనందువల్ల, తనకు యెవ్వరును శత్రులు లేరనే అర్థం. సకలమైనవారున్ను తమతమ నాస్తిత్వ మంగీకరించరు గనుక నేనే సద్రూపమనే అర్థము; తమతమ మూఢత్వమునంగీకరించరు గనుక నేనే చిద్రూపుండననే అర్థము. తమతమకు క్లేశమంగీకరించరు గనుక, నేనె సుఖస్వరూపుండనే అర్థం.; తమతమ చెడుపునంగీకరించరు గనుక, నేనే నిత్యుండననే అర్థం; తమతమ తుచ్ఛతను అంగీకరించరు గనక, నేనే పరిపూర్ణుండననే అర్థం. అటుగనుక సచ్చిదానందనిత్యపరిపూర్ణుండై, విశ్వాత్మకశివుండనైన నేనే, నాస్వేచ్ఛాశక్తివల్ల బహిర్ముఖుండనై విశ్వాత్మకుండనై బాహ్యసంపత్తియందు వినోదించి, విద్యాశక్తిబలంవల్ల అంతర్ముఖుండనై సకలప్రపంచమునున్ను స్వేచ్ఛాశక్తివల్లనె ఉపసంహరించి, ఆశక్తినిన్ని తనయందె అంతర్ముఖముజేసి, సకలాభిమానాలకున్ను తొలంగి, అవాచ్యరూపమైన అఖండైకానంద బ్రహ్మ సంపదయందు సుఖిస్తున్నా డననెడిదిప్పుడు రహస్యము. "స్వాత్మావబోధ హీనాః కుణపశరీరాభిమాన తుష్టాః। వారిజబుద్బుదకల్పాః మూఢాః కుర్వంతి లోభం బంధేన" అనిన్ని "ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చనేతి" అనిన్ని "ఏకఏవహి భూతాత్మా భూతె భూతె వ్యవస్థితః। ఏకధా బహుధా చైవ దృశ్యతె జలచంద్రవత్" అనిన్ని "సర్వేషు సర్వదా వ్యాప్తః సర్వసంబంధవర్జితః। ఏకరూపో మహాదేవస్థితస్సోహం పరామృతః" అనిన్ని "ఆత్మానం యది నిందంతి నిందంతి స్వయమేవవా। శరీరం యది నిందంతి సహాయాస్తె జనానామ" అనిన్ని "అహమ్మనురభవం సూర్యశ్చ" అని పిండాండబ్రహ్మాండాలకు ఐక్యజ్ఞాననిరూపణం చెప్పబడెను. ఇంక బ్రహ్మానంద నిరూపణమేలాగంటె,

బ్రహ్మానంద వివేకోయం కథ్యతె బాలబుద్ధయే।
యథాంగీ కుర్వతె సద్భిర్యథామతి తథాపునః॥

"ఆనందం బ్రహ్మణోవిద్వా నిత్యేత్యశ్రుతిసమ్మతం, బ్రహ్మానందం ప్రవక్ష్యామి జ్ఞానినాం చిత్తశుద్ధయె" బ్రహ్మానందనిర్ణయం నిరూపిస్తున్నారము. అది యేలాగంటే, ఆత్మస్వరూపమైన బ్రహ్మానందప్రసన్నత యిప్పుడు జీవన్ముక్తి సుఖమనిపించును. ఆబ్రహ్మానంద మనెడిది ఉపాధివైచిత్ర్యభేదంచేత, విషయానంద మనిన్ని, దుఃఖాభావానందమనిన్ని, సుప్తానందమనిన్ని, యోగానంద మనిన్ని చతుర్విధాలై యుండును. సకల ఉపాధులున్ను తొలంగి, నిజస్వరూపమై, నిరుపాధికమై, అవాఙ్మానసగోచరమై తనకు కూటస్థస్వరూపమైన సహజ సుఖమె బ్రహ్మానందమనిపించును. అటుగనుక, పంచప్రకారాలై స్ఫురించెడి ఆనందానకు వృత్తిభేదాలయొక్క స్వరూపాలేవి అంటేను అందు విషయానంద మనెడిది శబ్దస్పర్శరూప రసగంధాత్మకమైన బాహ్యవిషయాకాంక్ష చేతను విచారపడేబుద్ధికి తత్తద్విషయాలు ప్రాప్తమైతే, బుద్ధియొక్క కల్మషం తీరి అతిస్వచ్ఛమైన బుద్ధియందు ఆత్మానంద ముపలభ్యమానమైతే ఆయానందాతిశయంవల్ల దేహాభిమానం మరచి, సుఖించెడిదిప్పుడు విషయానందమనిపించును. అన్నమయంవల్ల సకలకరణాలున్ను తనకు కారణభూతమైన సుషుప్తి యనెడి అజ్ఞాత్మభూతమందు మునింగి సర్వవ్యాపారక్లేశమణగి, అజ్ఞానవృత్తి యనెడి అస్పష్టకరణోపాధివల్ల అత్మానందముననే సుఖించి, పునరుద్ధానమందు బుద్ధియనే స్పష్టకరణానంగూడి సుఖాననిందాక నేమిన్నెరుంగక నిద్రిస్తిననెడి స్మరణ సుప్తానందమనిపించును. ఇంక భారంమోసి క్లేశపడి వచ్చేవాడు, ఆ భారం దింపితే సుఖమాయెను అనెడిది దుఃఖాభావరూపానంద మనిపించును. ఇంక బంధనమందుండే అతనికి విరుగడయినప్పుడును, క్షుధతృష్ణాదులనడంచిన అతండు అన్నపానాదులు పుచ్చుకొన్నప్పుడున్ను, వ్యాధులచేతం దప్తుడైనవానికి అవ్యాధులు పరిహారమైనప్పుడున్ను, అనేక ఉపాధులు వచ్చిన ఆత్మకు అయుపాధులన్నీ పరిహారమైనప్పుడున్ను, సుఖమాయెననేదిప్పుడు దుఃఖాభావానంద మనిపించును. ఇంకను దేహం సొమ్మసిలి మూర్ఛిల్లిన అతండున్ను, గ్రహ వికారభయంవల్ల మూర్ఛితుడైన యాతడును, ఆమూర్ఛలయందు దుఃఖమును మరచియుండబట్టి యిదిన్ని దుఃఖాభావానందములో ఉభయభేదమైనది. ఈ యానందత్రయమున్ను దేహభావమండెచ్చరిక మరస్తేనే గాని ఆనందోదయం గాదు గాబట్టి, యిదిన్ని అజ్ఞానకరణ మనిపించుకొనును. అదియేలాగంటేను, స్త్రీసంగమమందున్ను తాననె హెచ్చరిక చెడిన మరపుననేకాని ఆనందోదయం రాదు. ఇంకను సార్వభౌమానందమున్ను తామసంవల్ల గాని స్ఫురించదు. అదేలాగంటేను, రాజపురుషుడు సంపదోపాధిజన్యమైన ఆనందభరితుండై తాన నేదిన్ని యెదుటవాటినిన్ని మరచెగనుక, తనఫణిహారులవల్ల నవధారుహెచ్చరిక పరాకు అనెడి ఉద్ఘాటనవల్ల యచ్చరిలి సంపదమదంవల్ల దిరుగమరను

న్నాదుకాబట్టి, అదిన్ని అజ్ఞానకరణ మనిపించుకొనును. దేహేంద్రియముల హెచ్చరిక మరచినగాని సుప్తానందం ఘటించదు. అదిన్ని అజ్ఞానకరణమె అనిపించును. మూర్ఛాదులయందు క్లేశమడగి ఉన్నాగానిన్ని, అజ్ఞానకరణమె అనిపించును. ఇంకను ఆశ్చర్యాలయిన బహువిధ విషయోపాధులవల్లనున్ను తొలంగి కన్నుమూసి క్షణమైనా హెచ్చరిక మరస్తేనే గాని ఆనందోదయం గాదు గనుక, యివి అనిన్ని అజ్ఞానవృత్తిభేదాలనిపించును. ఇంకను యోగానందమనేది, రాజయోగ అభ్యాసయోగమని రెండువిధాలు. అందులో అభ్యాస యోగం యేలాగంటేను రసాలయందు మూర్ఛిలిన పురుషునివలెనే, వాయు తంత్రంవల్ల మూర్ఛితుండైన అభ్యాసయోగానందునకు అజ్ఞానకరణమనే తెలియ వలెను. ఇంకను రాజయోగానందమనెడిది, "యోగేషు రాజతెయస్మాద్రాజ యోగః ప్రకీర్తితః" అని కలదుగనుక, రాజయోగానందమనెడి ప్రత్యగానంద కూటస్థచైతన్యానకున్ను అద్వయానంద బ్రహ్మచైతన్యానకున్ను యేకత్వమని తెలిసిన వివేకంవల్ల నిజస్వరూపమందలి హెచ్చరికనుం గల సుఖానుభూతి రాజయోగానందము. కరణరహితమై నిరుపాధికమైనందువల్ల, అది నిత్యమైన సహజానందమనిపించును. అదియేలాగంటేను, ఒక సౌఖ్యవిషయమునందు నున్న బుద్ధిచెడి, మరొకవిషయసౌఖ్యమందు జనించిన బుద్ధియొక్క నడుమను నిర్విషయమై స్ఫురించిన ఆనందమున్ను నిజానందమె అనిపించును. ఇప్పుడు ఒకానొక జనుండు తాను నిత్యానందస్వరూపుండైనందుకు తనకు దానే పరప్రేమాస్పది భూతుండై ఉన్నదె కారణమని తెలియవలెను. అటు గనుక తనముఖమనెడి దర్పణమందు ప్రసన్నత గలిగినట్టే, తనకు ఆత్మస్వ రూపమైన నిత్యానందమున్ను అజ్ఞానకరణమందు విషయానందమనెడి సంజ్ఞ గలిగినదగును. జ్ఞానకరణమందు ప్రసన్నతగలిగింది గనుక రాజయోగానంద మనే సంజ్ఞ గలదాయెను. అదియేలాగంటేను, నిండి పూర్ణమైన తటాకం క్రిందను అనేక కూపాదులు స్థలభేదంవల్ల స్వాదుభేదమై స్ఫురించిన ఉదకాలు ఆ తటాకదేశమందునుండి వచ్చిన ఉదకాలంతేకాని, మరొకటి కాదన్నట్టె జ్ఞానా జ్ఞానాలనెడి కరణోపాధిభేదంచేత స్ఫురించిన సుఖమున్ను బ్రహ్మానందసుఖ మనే తెలియవలెను, తనకు అస్మదాద్యవస్థయందు అజ్ఞాన కరణమునంబట్టి ఆ బ్రహ్మానందమె విషయానందమనెడి సంజ్ఞగలిగి, జ్ఞానకరణమందు ప్రసన్నత గలిగింది గనుక రాజయోగానందమనే సంజ్ఞ గలదాయెను. అదియేలాగంటేను నిండి పూర్ణమైన తటాకం కిందను అనేకకూపాదులు స్థలభేదంవల్ల స్వాదు భేదమై స్ఫురించిన ఉదకాలు ఆతటాకదేశమందునుండి వచ్చిన ఉదకాలంతే కాని మరొకటి గాదన్నట్టే, జ్ఞానాజ్ఞానాలనెడివి స్ఫురిస్తుండును. తనకు యాశ్వ రావస్థయందు అనుభవజ్ఞానానందం బట్టి చిజ్జాగ్రతవల్ల దన నిజానందమునె సుఖిస్తున్నాడు గనుక, జ్ఞానకరణానంబట్టి ఆ బ్రహ్మానందమె జీవన్ముక్తి సుఖ మనిపించును. ఆకారణాన ముఖప్రసన్నతయందు అస్థగల పురుషుడు దర్ప

ణమును విడువక చూచేవానివలెనే, బ్రహ్మానంద ప్రసన్నతయందు అస్థగల జీవన్ముక్తుండు వివేకమనెడి దర్పణమునుంబట్టి సుఖిస్తుండును. అటుగనుక, సత్యజ్ఞానానందాత్మకమైన తనకు ఆత్మస్వరూపమైన పరమానందమొక్కటే తనయందు అనిర్వాచ్యరూపమైన మాయాశక్తియొక్క కార్యరూపమైన జ్ఞానాజ్ఞానాలనెడి వృత్తిభేదాలచేత జీవేశ్వరాభిధానంవల్ల నిజానందమె విషయానంద రాజయోగానందా లనెడి సంజ్ఞచేత తానె సుఖిస్తుండును. విషయాంశము జడమైనందువల్ల అనందమున్ను విషయధర్మమనరాదు. అటుగనుక, బాహ్యాభ్యంతరముఖమై స్ఫురించిన ఆనందమున్ను బ్రహ్మానందమే అయిన కారణాన జీవన్ముక్తుండు బ్రహ్మానంద పదమును బొంది తాను తననె యెరుంగు. "ప్రజ్ఞానమానందం బ్రహ్మ" అనిన్ని "ఆనందం బ్రహ్మణోవిద్వాన్న బిభేతి కుతశ్చ నేతి" అనిన్ని "చిదవజ్వలితం చిత్తం విషయప్రబోధిని। .... .... .... చిద్విలాన స్ఫురత్సహే" అనిన్ని బ్రహ్మానందసుఖవివేకం చెప్పబడెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యా సుధార్ణవే యోగశాస్త్రే
అభిమానచైతన్యానేక విచార పిండాండ
బ్రహ్మాండైక్య బ్రహ్మానందనిరూపణం
నామ సప్తమప్రకరణం సమాప్తమ్

---

# ఎనిమిదవ ప్రకరణము

అఖండ మండలాకారం వ్యాప్తం యేనచరాచరమ్।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥
క్షీరోదక క్రమపదాకలితం ప్రకృత్యా
యద్వస్తుని స్థూలధియా తదిదం వివిచ్య।
విస్పష్టయన్పరమహంస వతంసకాఖ్యాం
స్వామేథతె సకలసంయమి మండలేంద్రః॥

ఉత్తమాధికారులయిన ముముక్షువుల విషయీకరించి పరమానంద తీర్థులు స్వానుభవదృఢీకరణమున్ను, అవధూత లక్షణమున్ను, జీవన్ముక్తిని ఈప్రకరణమందు నిరూపిస్తున్నారు. మొదట స్వానుభవదృఢీకరణయేలాగం టేను, స్వానుభవానకు ఒకసంకేతం కలదు. ప్రపంచం తోచకే తోచును. అది యేలాగంటే, స్వరూపాన్ముఖస్మరణ యేది కలదో అది మాయాలక్షణం. అవిద్య అనంగా విపరీతకల్పన. మనఃచక్షురాదింద్రియాలు సుఖదుఃఖదాయ కాలు. ఇవి అవిద్యనుండి కలిగినవి. ఈకల్పన యెప్పుడు నాశమౌనో, మాయా విద్యలు అప్పుడే నాశమౌను. అప్పుడు సకలేంద్రియాల చేష్టలున్ను ఉడుగును. అయితే సుషుప్త్యవస్థలో సకలేంద్రియాలున్ను ఉడుగును, కల్పన లేదు గాబట్టి, కల్పన లేకపోవుటే మోక్షమైతే సుషుప్తే చాలదాఅంటే, జీవునికి సుషుప్తిలో కల్పన లేశమాత్రమైనా లేదు సత్యం; అట్లైనాను, అజ్ఞానం నిరసించ లేదు గనక సంస్మరణ విడువదు. ఆయాత్మయును సుషుప్తి నెరుగదు. అజ్ఞానావృతమై యుండుటంబట్టి, అక్కడ ఆత్మానుభవమెక్కడది? ఆత్మవిషయ మందు అజ్ఞాన మెంతదనుకనుండునో, అంతదనుక జీవునికి జననమరణాదులు తప్పవు. గురుకృపా లబ్ధమైన స్వానుభూతిచేత అజ్ఞాననాశమౌను, సచ్చిదా నందమే ప్రకాశిస్తుండును. సుషుప్తికాలమున్ను కల్పనయును అజ్ఞానగర్భమందే లీనమౌను. ఈవిపరీతకల్పన అనుభవాన లేదుగనుక, లేనిదే గలిగి లేదని చెప్పినట్టే లేకపోయెను, సుజ్ఞానం కలిగిన్ని. అయితే, సకలవృక్షజాతికిన్ని కల్పన యెప్పుడున్ను లేదు, అవృక్షజాతినుండి ముక్తి అవుగాక అంటివా, వృక్షజాతికి మరణాంత సుషుప్తి; అక్కడి కల్పన అజ్ఞానములో అవస్థం బొందియుండును. అనుభవసంజ్ఞ అలాగుగాదు. అజ్ఞానమున్ను కల్పనయును, యీరెండున్ను స్వరూపానుసంధానంచేత నాశమౌను. అజ్ఞానం నిశ్శేషంగా జెడును. కల్పనా రహిత పరబ్రహ్మమే పకాశిస్తుండును. అనుభవభూమి నాలుగు విధాలు. అది యేలాగంటేను, విక్షిప్తం ప్రథమభూమి; ద్వితీయభూమి గతాయాతం; తృతీయభూమి సునిష్ఠ, చతుర్థభూమి సులీనత. అది యేలాగంటే, బ్రహ్మ ధ్యానమందు స్వస్వరూపమందు చిత్తం ప్రవేశించుచునే మళ్లీ విషయవ్యాపా రానకువస్తె విక్షిప్తమనిపించును. చిత్తం స్వరూపమందు సమరసమై, అందు

నుండి సంసారోన్ముఖమై, తిరిగి స్వస్వరూపానం గూడేవే గతాయాతమనిపిం చును. మనస్సు స్వస్వరూపానం గూడక, విక్షిప్తములేక, ఊరకేయుండుట సునిష్ఠ అనిపించును. చిత్తం స్వరూపానందానంగూడి ఆనందభుక్తైయుండుట సులీనత అనిపించును. ఈయర్థమందు

విక్షిప్తంచ గతాయాతం సునిష్ఠాచ సులీనతా।
చతుర్విధ మనోవస్థా లభ్యతె గురురీయతె॥

అని కలదు. ఈబ్రహ్మాభ్యానమందు సమస్తభూములున్ను గెలిచిన కేవలపరిపూర్ణావస్థ గలుగును. అప్పుడు ఇంద్రియాది వ్యాపారాలు గలిగినవంటే అవి యెక్కడ బారెను. అక్కడ తానెకాని మరొకటి లేదు గనుక, ఈవిపరీత కల్పనంగల ప్రపంచమునున్ను ద్రోసి నిలిచిన పరిపూర్ణానంద బ్రహ్మమె తాన నెడది అనుభవసంజ్ఞ. అది తుర్యావస్థ. గుణాతీత పరబ్రహ్మమె తానై తన్ను దానె సాక్షిరూపానం జూచిందె తుర్యావస్థ. ఈతుర్యావస్థయొక్క పరికల్పనె ఉన్మని. అది యేలాగంటే, వేపకాయ చేదు పక్వాన మధురమైనట్టే, తుర్య మందలి శుద్ధసాక్షి వాననచెడి, అతీతమైన నిర్వానసౌను. అదే మధురమనం గాను. అందుకు దృష్టాంతం చెరుకె; స్థూలం రసమే, సూక్ష్మం దానిపాగె, కారణం శర్కరె తుర్యం; ఆశర్కరె జలంతోగూడి పానకమైతే రూపంచెడి రుచి నిలిచిన రీతిని, తుర్యమందు మగ్నమైనదే తుర్యాతీతమైన ఉన్మని అవస్థ. ఈరీతిని అనుభవం దృఢమైనవారె జీవన్ముక్తులు. ఇది అనుభవ నిర్ణయం. ఇంక యీయనుభవం గలవాడే అవధూత. ఆయవధూతలక్షణ మేలాగంటే, శ్రుత్యనుభవప్రమాణంవల్ల జెప్పుచున్నారు. అదియేలాగంటే, "అక్షరత్వాద్వరే ణ్యత్వా ద్ధూతసంసారసంతతిః। తత్వమశ్యాది లక్ష్యార్థస్సోవధూతో విధీయతే" చరమ శరీరులయినటువంటి అవధూతలు యుష్మదస్మత్ప్రత్యయ గోచరమైన దృశ్య ద్రష్టుభావంబుల మరచి, పరమానందావిర్భావం వల్లనున్ను, స్వచ్ఛంద సచ్చరిత్రం వల్లనున్ను విధినిషేధాతీతులై నిజంవల్ల నిర్వ్యాపారులైయుండిన్ని లోకుల దృష్టికి విపరీత చరిత్రలు గలవారై కనిపించుచుందురు. ఈయర్థ మందు శ్రుతి, "ధ్యాయతివ లీలాయతివ" అని కలదు గనుక, "అక్షణ్వంతః కర్మవంతః నఖాయో మనోజవెష్టసమాఋభూవుః" అనిన్ని "వేదాయాతీనాం పద మంతరిక్షణవితతాం। వేదనాం వః సముద్రయః" అనికలదు. స్వర్గాపవర్గసాధ నాలైన కర్మాలున్ను లోకులనధికరించి యున్నట్టు బ్రహ్మవేత్తల నధికరించ నోపవు. అదియేలాగంటె, గారుడవిద్యయెరింగినవాడు సర్పమును బట్టును. అగ్నిస్తంభన మెరిగినవాడగ్నిని బట్టును. పరమావధూతలున్ను స్వచ్ఛాంతః కరణులు గనుక, కర్మములు వారిని బంధించ నోపవు. అటుగనుక, స్వేచ్ఛా వినోదులైయుందురు. అదియేలాగంటేను చోరబాధకు దీపం ప్రకాశమైనట్టే, బుద్ధైన కారణాన కర్మాలు వార్లం బట్టుకొనియుండును. సహజమైన దీపప్రకాశం

వంటి బ్రహ్మవేత్తలబుద్ధి సహజప్రకాశం గలిగింది గనుక, వాళ్లబుద్ధి భ్రమోత్పాదకం గానేరదు. అయితే లోకులుచేసిన కర్మాలున్ను ఆక్షణమందే చెడిపోవుచున్నవిగాబట్టి వారికిన్ని కర్మలేపం లేదు కదా అంటేను, పాకశాలలోని ధూమ మాక్షణమందె చెడిపోయినాను ఆకాళిమయింటం బట్టి యుండినట్టే జీవులు జేసిన కర్మాలాక్షణమందే చెడినను ఆకర్మసంస్కార మంతఃకరణ లేపమైయుండును. గోడను మెత్తిపూసి సున్నాన తెలుపుచేసినట్టే, శ్రుతిగురు స్వానుభవంవల్ల అంతఃకరణ మలినముడిగినారు గనుక, అటువంటి తత్త్వ వేత్తలకు దృశ్యాభావము లేదుకాబట్టి కృతార్థులు. ప్రపంచమును కానరనెడి దిప్పుడు తాత్పర్యం. అయితే ప్రపంచం గనుపించగానున్ను కానరనెడిదెట్లు అంటేను, అప్పుడు చీకటిలోనున్న ఘటపటాదులను బాహ్యతేజస్సున వీక్షించి కనుచున్నారుగాబట్టి నేత్రవిశిష్టతేజస్సుకు స్వతంత్రమైన చూపు లేదని చెప్ప వలెను. అయితే బాహ్యాభ్యంతర తేజస్సులు రెండుంగూడి చూచేదేమౌనంటివా, అక్కడ అంధకారమును చూచెననే చోటను బాహ్యతేజస్సునపేక్షించి చూడవలెను అనేటందుకు వ్యభిచారమాయెను. ఇంక యుక్త్యంతరమందున్ను నిశ్రద్రష్టులు అనేటందుకు, ఘూకమార్జాల మూషకాది జంతువులకు తేజస్తిమిరాలు విపరీతభావాలైయున్నవి కాబట్టి, ఒక లక్షణమున్ను నిశ్చయం గాదు గనుక, జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములొకటిని విడిచి ఒకటియుండవు కాబట్టిన్ని, స్వతః ప్రామాణ్యము లేదుకాబట్టిన్ని, ప్రపంచము మిథ్య అనెడిదే సిద్ధం. ద్రష్టు దర్శన దృశ్యాలనెడివిన్ని భ్రాంతి అనెడిదే తాత్పర్యం. ఈయర్థమందు తెలిసిన పరమార్థులకు ప్రపంచ క్రియాకర్మభేదదర్శనాలనెడివి లేవు. ఈప్రపంచము మిథ్య అయియుండిన్ని కర్మనియమమేమి కారణాన ఉత్పన్నమాయెనంటేను, ఒకానొక రాజపురుషుడు తనకు అన్నపానాదులకు సమృద్ధిగా గలిగియుండిన్ని వినోదంచేత మృగవ్యసనాసక్తుండై యుండును. సచ్చిదానంద స్వరూపమై యుండిన్ని లోలార్థంగాను స్వమాయాశక్తివల్ల జగద్రచనాకర్మమునంగీకరించి, విచిత్రరచనాప్రపంచప్రమాణం చేసి యజమానపురుషుండు తనఆధీనులయిన పుత్రమిత్రకళత్ర దాసదాసీజనాలకు తనకు స్వేచ్ఛావినోదమైన యీతెగలం గల్పించి యిచ్చును. జగదభిమానం గల యీశ్వరుండున్ను తన స్వేచ్ఛాశక్తివల్ల దోచిన సమానధర్మమందుండం జూచి, క్షణవిశేషాలైన బహువిధ తారతమ్యముచే గాని జగత్తు రంజించి ప్రవర్తించ నేరదని తెలిసి యీజీవులకు విచిత్రాలైన కర్మాలను గల్పించి యుపదేశించెను. ఆకర్మాదులు యేవంటేను, "యస్య నిశ్వసితం వేదాః" అని గురుపంక్తి గలుగంబట్టి, యీశ్వరుని నిశ్వాస రూపాలైన వేదాలే యీశ్వరుని ఉపదేశ వాక్యాలు అని యెరుగవలెను. "తథా లోకాణ అకల్పయత్" అని కలుగంబట్టి, జగత్కర్మమున్ను యీశ్వరునికంటె మునుపే కలుగవలెనుకదా అంటేను, ఆశ్రుతికి ప్రళయాంతరమందు బ్రహ్మమందైన అవాంతరసృష్టినిం జెప్పేటందలి తాత్పర్యం. "అంకురాదికం

నకర్తృకం కార్యత్వాద్ఘటవత్” అని కలదుగనక, యీశ్వరునికి జగత్పూర్వ భావిత్వం గలదు అనెడిదే సిద్ధం. అటువంటి యీశ్వరోపదిష్టమైన కర్మాలు మునుపే సంచిత ప్రారబ్ధాగామి అనేకర్మాలు త్రివిధాలై యుండును. అందున, సంచితకర్మం ఫలరూపమైయుండును. అసంచితఫలరాశిలో జన్మజన్మానకున్ను వ్యవభేదం జేసిన ప్రారబ్ధకర్మమె భోగరూపమైయుండును. ఆభోగంయొక్క తారతమ్యాన బుద్ధివికాసమున్ను తారతమ్యానంగూడి వర్తిస్తున్నటువంటి ఆగామి కర్మమున్ను క్రియారూపమై యుండును. సత్కర్మాలకు అరంభకాలమందు సత్వగుణమున్నను, రాజసతామసప్రధానమైతేగాని మునుపే భోగం లేదుగనక, పాపకర్మం వల్లనె పాపహేతువు. “దుఃఖానుషంగా త్సుఖందుఃఖమేవచ” అని శాస్త్రవాక్యము కలదుగనక, విషయస్పృక్కానందంవలెనే అని సమస్తకర్మాలం దున్ను క్లేశమని తెలిసి, ప్రపంచమున్ను కాదాచిత్ జ్ఞేయమానమైనందువల్ల మిథ్యయని తెలిసి, తనందలి చిదాభాసకత్వము తటాకకూపాదులందున్ను దేవమనుష్య మృగపక్షి వృక్షాదులానీళ్లలో దల్రకిందుగా బ్రతిబింబించునట్టే, నిరవయవ, అజడ, అదృశ్య, అమూర్తమైన తనయందు విపరీతాకృతియై జడదుఃఖసావయవమై అవిద్యాకల్పితంవల్ల దోచిన చిదాభాసక భావము, దర్ప ణోపాధిచేత నాభాన తేజస్సున్ను సూర్యుని తేజస్సులోనే అడంగినట్టే, బుద్ధ్యాది ప్రపంచమున్ను మిథ్య అనితెలిసి ఆచిదాభాసమున్ను పరమార్థమైన నిజతత్వ ములో నడంగించి, యీశ్వరుని శ్రుత్యోపదేశమార్గంవల్ల నిరతిశయానందభరి తులైన పరమావధూతలు కార్యకారణాలణంగి స్వేచ్ఛగా వర్తింతురు. లోకు లున్ను బుద్ధిభేదంవల్ల గాంతురంతేకాని, పరమార్థంగా జూస్తే ఆకాశానకు వర్తన లేనట్టే, చిదాభాసస్వరూపులయిన అవధూతలకు వర్తనం లేదనెడిదే సిద్ధం. అయితే, జడమైన ఘటానకు ఉపాదానమైన మృత్తికయును జడమైనట్టే, యాజడమైన దేహకరణేంద్రియాది సకల ప్రపంచానకున్ను ఉపాదానకారణ మైన స్వరూపమైన తన్ను యీజడమైన యెరుక అజడము గాబట్టి వర్తన యనేది ఘటించదు. అది యేమీఅంటేను, దృష్టాంతరూపమైన ఘటమందు నిమిత్తకారణుండైన కులాలుండు వేరేకలదుగాబట్టి జడానకక్కడ జడత్వం ఘటించును. దార్ష్టాంతమైన బ్రహ్మమున్ను ప్రపంచానకు అభిన్న నిమిత్తోపా దాన కారణమైనందువల్ల, అక్కడ జడత్వప్రసంగము ఘటించదు. అయితే, యీమాయాధ్యాసమనెడిది గర్భగోళానముండే శిశువువలెను బ్రహ్మసదసద్భావమో అధ్యస్తమో యెత్తుకొన్న శిశువువలెను వేలుపులైన అధ్యస్తమో అంటేను, అవిరళబ్రహ్మమందవకాశ మంగీకరిస్తే, ఆకాశంవలెనే జడత్వం ప్రాప్తమౌను. అటుగనక, అధ్యస్తమని చెప్పరాదు. అటుగనక, భ్రాంతికి బ్రహ్మమందు ఉభయత్రాపి ఆశ్రయం ఘటించదుగనక, అటువంటి బ్రహ్మమె తామైన చరమ శరీరులకు జగద్భ్రాంతి లేదుగాబట్టి, నిజమందు వర్తనము లేదనెడిదె సిద్ధం. చరమశరీరమనంగా కడపటి కృతార్థశరీరమనుట. ఈయర్థమందు శ్రుతి

"అపాదపాణౌ జీవనో గృహీతా" అనిన్ని, అచక్షుష్వాన్న దృష్టిపై తథా శ్రోతస్య కాశ్రుతిః। అవాక్త్వాం నతువక్తి స్యాదమస్తాన్మతిః, నప్రమాణం నకర్మాస్మి। బుద్ధ్యాభావేన వేదితా। విద్యావిద్యాతతోనాస్తి। చిన్మాత్రజ్యోతిషో మమ। పరామృతేన తృప్తస్స కృతకృత్యస్సయోగినః నైవాస్తి కించిత్కర్తవ్యమస్తిచెన్న నతత్వవిత్। నమం పశ్యఞ్హనర్వత్ర నమవస్థిత మీశ్వరం। నహితస్యాత్మనాత్మానం తతోయాంతి పరాంగతిం। యథారవి స్సర్వరసాన్ప్రభుజ్తె హుతాశానశ్చాపిచ నర్వభక్షకః। తథైవ యోగివిషయాన్ప్రభుజ్తె నలిప్యతె కర్మశుభాశుభైశ్చ" అని యుపదేశ సాహస్రిక కలదుగనుక

ఇదంహి నత్యం మమనాస్తి విక్రియా వికారహేతుర్నహి మేద్వయత్వతః।
నపుణ్యాపాపేనచ మోక్షబంధనే నచాస్తి వర్ణాశ్రమతా శరీరతః॥

అని ఉపదేశసాహస్రిక కలదుగనుక, అవధూతచరిత్ర చెప్పంబడెను. ఇంక జీవన్ముక్తిప్రశంస నిరూపిస్తున్నారు. అదేలాగంటేను, బ్రహ్మాత్మైక్య జ్ఞానసంపన్నులయిన మహాత్ములున్ను నిజమందు నిర్గుణస్వరూపులయినాను, అనుభవతుర్యావస్థయందు వారలకు సర్వజ్ఞతాసిద్ధి కలదనెడిది ప్రకటించే దిప్పుడు జీవన్ముక్తిప్రశంస అనిపించును. అదియేలాగంటేను, జీవన్ముక్తులకు అనుభవావస్థయందు అజ్ఞాన నాశనమైనది గనుక, వార్లను లోకులవలె నెంచరాదు. చిదహమనెడి అజడాభిమానమున నుండికాని యనుభవము ఘటించదు. వార్లను శుద్ధనిర్గుణబ్రహ్మమనియు చెప్పరాదు. అన్యత్వంతోడ ప్రతిద్వంద్వం గల కూటస్థచైతన్యనిష్ఠమైన వివేకమనిపించుకొనే అజడాభిమానము, తనవివేకబలంవల్ల నన్యత్వం విచారించి బహిర్దృష్టినుపసంహరించి అంతర్దృష్టియందు తనకు అధికరణరూపమైన అద్వయానంద బ్రహ్మచైతన్యావలోకనం చేసి అయభిమానమున్ను తానున్ను విక్షేపశక్తినందువల్ల, తనందు కల్పనారూపమైన ప్రారబ్ధపరిసమాప్తి పర్యంతమున్ను దగ్ధపటన్యాయోపాధియందు యీ కల్పనాహంకారమనుభవ శక్తియుక్తమై, చిజ్జాగ్రంవల్ల సర్వజ్ఞత్వాది గుణసమేతమై, యీశ్వరుండనే సంజ్ఞగలిగిందగును. అయితె యీపురోభాగ పృష్ఠభాగాలంగల దేహకరణేంద్రియాద్వ్యావృతుండై యుండే యీజ్ఞానియందు సర్వజ్ఞత్వాది శక్తులేతీరుననున్నవంటేను, అపురోభాగపృష్ఠభాగాలనెడివి దేహాదులకంతే కాని, జ్ఞానస్వరూపికి లేవు. అదేలాగంటె, వురోభాగమందున్ను చక్షుస్సులు వెన్నునుం గానకున్నాను అక్కడ బుట్టిన తీటను తనజ్ఞానంవల్ల దెలిసి నఖాగ్రాలచేత నివృత్తింజేయును గనుక యెరుక సర్వతోముఖమని తెలియవలెను. అయెరుకయును బాహ్యాభ్యంతర కరణాలను తత్తత్సంస్కార బలంవల్ల స్ఫురిస్తుండును. అదేలాగంటేను బాహ్యకరణాల లోపల కర్మేంద్రియపంచక వర్గమందు, వాగింద్రియము బాహ్యప్రసారై యుండును· ఇంక శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచకమందు నయనోపాధింబట్టి యెరుక బాహ్యప్రసారితమైయుండును. ఇంక నేకాదశేంద్రియాలలోను మనస్సు బాహ్యాభ్యంతర ప్రకాశమైయుండును.

తక్కిన యింద్రియాలున్ను తామున్న స్థలమందే తత్తద్విషయాలు ప్రాప్తాలు గాబట్టి యెరుంగుచుండును. అందున,

సర్వేషు గాత్రేషు శిరః ప్రధానమ్।
సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్।

అని కలదుగనక, నేత్రస్థానమందు యింద్రియాణాం మనో నాథః। అని కలదుగనుక, బాహ్యేంద్రియాలకు నాయకమైన యీమనస్సు సకలదేహాలకున్ను జాగ్రమందు నేత్రస్థానమందు వర్తిస్తుండును. అక్కడ సకలేంద్రియాలయందున్ను యీమనస్సు తత్తద్విషయాలనున్ను గ్రహించి, తత్తత్సంస్కారాలను తనకు జాగ్రదాశ్రయమైన నేత్రస్థానానకు దెచ్చి కన్నులమూసి పరవశమై సుఖిస్తుండును. అదియెటువలెనంటేను, ఒకానొక పక్షి అక్కడక్కడ తనచెంచువువల్ల పరిగ్రస్తమైన ఆహారములను తనకాశ్రయమైన వృక్షకోటరానకు దెచ్చి ఉపయోగించినట్లే. అటుగనుక, యీమనస్సుకు జాగ్రమందు నేత్రస్థానమె ఆశ్రయం. నేత్రస్థానమునసుండి జారి కండ్లుమూసి కంఠస్థానాన నిలిచి స్వప్నముగని, అందుండి జారి హృదయస్థానానకు వస్తే సుషుప్తి. "యత్రవాయుస్తత్ర మనః" అని కలదుగనుక, వాయువశంవల్ల బ్రహ్మరంధ్రస్థానాన ప్రాణాయామబలాన్నిం గూడి యుండెగనుక తురీయమందురు. నిత్యానిత్యబలంవల్ల స్వస్వరూపాభిముఖంకాగా తుర్యాతీత మందురు. ఇంకా యీమనస్సుకు కంఠస్థానంయొక్క పరిణామవైకల్ప్యాలున్ను కమలమున్ను వికాసభేదంవల్ల సూచించినట్టె యీమనస్సున్ను హృదయమందుగల సంస్కారమును జాగ్రమందు నేత్రానసె సూచిస్తుండును. అది యేలాగంటేను, కామాభిప్రాయము హృదయమందుగల పురుషుండు నేత్రమందున్ను తత్తదభిప్రాయమభినయాన్నె కనుపరస్తున్నాడు. క్రోధాభిప్రాయం హృదయమందు గలవాడు నేత్రమందు క్రోధమునే సూచిస్తుండును. ధీరచిత్తుండైనయాతడు దృష్టియందున్ను ధీరత్వమే సూచిస్తుండును. ఇంక నేను పురుషుండననే అభిప్రాయం గల దృష్టియందు పురుషాభిప్రాయంగానె చూస్తుండును. నేను స్త్రీయనే అభిప్రాయంగల దృష్టియందు తన్ను స్త్రీత్వముగా నంగీకరించి చూస్తుండును. అటుగనుక యేలాగుహృదయమాలాగే దృష్టిన్ని. ఎవ్వండైనాయొక మహాత్ముండు పరమ శాంతహృదయుండైనందువల్ల, దృష్టియందున్ను పరమశాంతే సూచిస్తుండును. అదియేలాగంటేను, స్త్రీవేషం గట్టుకొని నటించేవాడు తదనుకూలంగా నటించి (సభను) రంజింపజేసినాను, తాను పురుషుండననే అభిప్రాయం హృదయమందున్ను దృష్టియందున్నుఉన్నట్టె, ఒకానొక వివేకియందు దేహప్రారబ్ధానుసారమైన నటన గలిగినాను, అతని హృదయమున్ను దృష్టిన్ని పారమార్థికమందె పరిణమించి, అతిస్వచ్ఛమైయుండుగనుక, చంద్రకాంతపు కరాటములో చంద్రకిరణాలు ప్రవహించినరీతి అతని హృదయమున్ను, దృష్టిన్ని కర్పూర

స్వర్గమైనట్టె సకలసంసార సంతాపాలున్ను అణిగి అంతశ్శీతలమైయుండు గనుక, అవివేకికి సకలార్థములున్ను సార్థములయ్యేది దొడ్డుగాదు. అది యేలా గంటేను,

యానిశా సర్వభూతానాం తస్యాంజాగర్తి సంయమి।
యస్యాం జాగర్తి భూతాని సానిశాపస్యతో మునె॥

అని కలదుగనుక,

ధర్మేణ సాధ్యతెదర్మి క్వచిత్కార్యేణ కారణమ్।
కారణేన క్వచిత్కార్యం క్వచిదామ్నాయ దర్శనాత్॥ అనిన్ని
అక్షజాప్రమితిర్ద్వేధా వికల్పో నిర్వికల్పకః।
కరణం త్రివిధం తస్యా స్సన్నికర్షస్తు షడ్విధః॥

అని కలదుగనుక, ప్రత్యక్షాదిప్రమాణాలవల్ల తనయందు ప్రమేయభూతమైన సకలప్రపంచమునున్ను సాక్షాత్కరించి స్వానుభవైక ప్రమాణాలచేత, తనకు కూటస్థస్వరూపమైన చైతన్యావలోకనం జేసినాడు గనుక, దీనిని సర్వజ్ఞతాశక్తియని తెలియవలెను. సకలజీవుల యందున్ను అభిమానానకన్యత్వ నివారకత్వ లక్షణం సరియైనందువల్లను, వ్యావహారికాభిమానమని విచారంవల్ల బహువిధాలైందింతేకాని, అన్యత్వంతో ప్రతిద్వంద్వత గలదనే లక్షణబలంవల్ల సకల జీవులకున్ను పారమార్థికాహంకారమొక్కటే యని తెలిసినాడు గనుక, ఇది సర్వకర్తృత్వశక్తి యనిపించును. అన్యత్వంతో ప్రతిద్వంద్వత గలిగిన పారమార్థిక అహంకారమొక్కటే తత్తద్దేహ కరణేంద్రియవిలాసంవల్ల బహువిధాలై యున్నట్టె వ్యవహరిస్తున్నదని తెలిసినాడు గనుక, అది అనంతత్వమనిపించును. ఈప్రపంచం తోచి చెడిన చోట తనకు చేటులేదని తెలిసినాడు గనుక, అది నిత్యత్వ మనిపించును. సకలమైనందులనున్ను ఆకాశం నిత్యమైనట్టె, సకలప్రపంచానకున్ను కూటస్థచైతన్యం తానని తెలిసినాడు గనుక, అది నిత్య వ్యాపకత్వశక్తియనిపించును. సకలప్రపంచమునున్ను పరీక్షిస్తున్నాడు గనుక, సర్వాంతర్యామిత్వమనిపించును. ఇంక ఆత్మయొక్క ఏకత్వమును దెలిసినాడు గనుక, అన్యత్వనివారకత్వం గలదనే లక్షణంగల యీయహంకారమున్ను ఆత్మనిష్ఠమైయుండు గనుక, యిక్కడ అభిమానాత్మకమై తోచిన సకలశక్తులున్ను తనశక్తులనె తెలిసినాడుగనుక సకలశక్తియుక్తుండనే తెలియవలెను. అయితే యీమర్యాదయందు సర్వజ్ఞత్వాది శక్తులుగల జీవన్ముక్తుని యందు సుఖదుఃఖాది ప్రారబ్ధాలున్నవిగదా అంటేను, ప్రారబ్ధశక్తి అనెడిది అన్యత్వ నివారకత్వమనెడి వివేకం లేని మూఢాహంకారంగల ప్రాణులదృష్టికి విక్షేపాంతమై ప్రారబ్ధమున్ను ఉన్నమర్యాదయందు తోస్తున్నదంతేకాని, నాహం కర్తా నాహం మూర్తిః నాహం శ్యామః। నాహం దీర్ఘః నాహం హ్రస్వః। నాహం జడః। నాహం దృశ్యం నాహం దుఃఖి। అనెడి ఫలహేతువులయందున్ను,

వ్యతిరిక్తాత్మదర్శనత్వం గల అతనికి ప్రారబ్ధమనెడిది దోచనేరదు. ఈమిథ్యా ప్రారబ్ధం. వ్యావహారికాహంకారానకు తోచిన మిథ్యాప్రారబ్ధమనెడిది అనేక దేహ నిష్ఠమై బ్రహ్మజ్ఞానవివేకపర్యంతమందున్ను సత్యానుభవమునె పుట్టించి, వివేకం జితమైనంతకుమునుపే, విక్షేపరూపమైన దేహాంతపర్యంతమును మిథ్యాప్రారబ్ధ మనిపించును. అటువంటి ప్రారబ్ధశక్తి అతీతప్రారబ్ధమనిన్ని, అనాగతప్రారబ్ధ మనిన్ని ప్రాసాద ప్రారబ్ధమనిన్ని కాలాంతర భేదంవల్ల వివిధాలైయుండును. అందు అతీతప్రారబ్ధమనెడిది పర్యుషితమనిపించును. అనాగత ప్రారబ్ధమనెడిది అపర్యుషితమనిపించును. ప్రాసాదప్రారబ్ధమనెడిది, వర్తమానభావిత్వం గలిగిందై ప్రసాదమనిపించును. ఈజీవన్ముక్తునకు ప్రసాదప్రారబ్ధమనెడిది, విక్షిప్తాంతంగాను దేహమందే ఆరోపితమై యుండును. ఈజీవన్ముక్తుని అనాగతప్రారబ్ధమనెడిది, స్తుతినిందలనే వ్యాజంవల్ల, గ్రామమధ్యస్థమైన సొమ్మువలెనే సకల జీవులతోడనున్ను గూడియుండును. అదియేలాగంటేను, ఒకానొక జనుండు తనభోగార్థమై ఖండించిన సొమ్ము తనకు ప్రారబ్ధపరిసమాప్తికాలాన దేహాంత మందు, ఆసొమ్ముకు దిక్కులేకుంటేను, గ్రామమధ్యస్థమై బహుకర్తలైనట్టె, యీవివేకికి పునరుత్పత్తినాశములు లేవనేటందుకు శాస్త్రసంప్రదాయానుభవం గలదు గనుక, ఉత్తరప్రారబ్ధ మనెడిది బహుకర్తృకమై యుండును. ఈయిర్థమందు,

ప్రారబ్ధం భోగతో నశ్యే ఛేషం జ్ఞానేన దహ్యతే।
ఇతరద్వితయంకర్మ తద్వేషి ప్రియవాదినోః॥ అనిన్ని
అతిథిశ్చాపవాదీచ ద్వావుభౌ మమబాంధవౌ।
అపవాది హరేత్పాపమతిథి స్స్వర్గగామిని॥

అని భగవద్వాక్యం కలదు గనుక, ఆగామి ప్రారబ్ధానకు లోకంవారే కర్తలై యుందురు. ఆప్రారబ్ధమనెడిది అహంకారానకు బలిఅయింది గనుక, యేదైనాయొక గ్రహానకు పెట్టిన బలిని ఆగ్రహము అన్నరసమునంతాను భుజించిన, తాను భుజించి తృప్తియై, పిశాచత్వం వీడి, విమోచనమై, తననిజ గతినిం బొందును; నిరసమైన తక్కిన బలివంటకము కాక శ్వానాదులు భుజించినట్టె, యీజీవన్ముక్తుని యందున్ను అభిమానానకు వచ్చిన పిశాచత్వమున్ను అన్యత్వనివారకత్వం గలిగింది అనెడి వివేకబలంవల్ల విమోచనమై, అనన్య స్వరూపమైన బ్రహ్మనందమనెడి నిజగతింగూడె గనుక, ముందర కలదనేటందుకు జన్మాలు లేవు. అటుగనుక స్తుతినిందలు అనెడి యుపాయ బలంవల్ల వివేకియొక్క శుభాశుభాత్మకమైన యుత్తరప్రారబ్ధ మనెడిది సకల ప్రాణులతోనున్ను గూడియుండును. ఇటువంటి జీవన్ముక్తుండు పారమార్థిక ప్రారబ్ధానుషంగి; ఇంతేకాని వ్యావహారిక ప్రారబ్ధం మోహకంగానేరదు. అది యేలాగంటే, సార్వభౌముండైన ఒకానొక పురుషుండు నిద్రారంభంవల్ల తనకు నిజమైన సకలసంపదలను మరచి, అతిదరిద్రరూపమైన స్వప్నంగని ఆస్వప్న

మందు చాలాకష్టపడి, మేలుకొని జాగ్రమందు హెచ్చరికచే గన్నులు దెరచి తనకు పారమార్థికప్రారబ్ధమైన సార్వభౌమసంపదగూడి సకల భోగాలుంగని హర్షతం బొందినట్టె, యీశ్వరునికిన్ని తనకున్ను ఆత్మత్వేన యేకత్వమును తెలిసి, కార్యనిష్ఠమైన అశుభప్రారబ్ధమును స్వప్నమాత్రమని తెలిసి కారణనిష్ఠమైన పారమార్థికమయిన శుభప్రారబ్ధమందు హెచ్చరికగని తనయీశ్వరత్వమునుంగని హేయగుణరహితుండై, కల్యాణగుణ విశిష్టుండై, నిత్యమంగళ స్వరూపుడై, జీవన్ముక్తుండు పారమార్థికప్రారబ్ధంచేత వినోదిస్తూ, తనకు కూటస్థ స్వరూపమైన బ్రహ్మానుసంధానమందు సమరసమయ్యేడి దిప్పుడు తాత్పర్యం.

సర్వేంద్రియకళాతీతం సర్వసంగ వివర్జితమ్।
సర్వసంకల్పసంత్యాగః సజీవన్ముక్తఉచ్యతే ॥

ఇంక జీవన్ముక్తుని ప్రశంసయందు శాస్త్రానుభవం గలిగియుండును. అది యేలాగంటేను, యేదైనాయొక అర్థము శ్రేష్ఠనీచతవల్లనే, తన్నిష్ఠమైన జ్ఞానానకున్ను శ్రేష్ఠ నీచత్వం గలిగియుండును. జ్ఞానంయొక్క శ్రేష్ఠత్వం నీచతవల్లనే తదనుసారంవల్ల కల్పితమైన శబ్దానకున్ను శ్రేష్ఠత్వనీచతలు గలుగును. ఏతత్సంబంధాన గూర్చి జ్ఞాతృత్వమునకున్ను శ్రేష్ఠత్వనీచతలు గలుగును. జీవన్ముక్తునికి విచారరూపవాక్యమున్ను మహావాక్యమనిపించుకొన్నదై, ఏతద్విశిష్టతగల పురుషుండు జీవన్ముక్తుండనేటందుకు సందేహం లేదు అనేది దిప్పుడు రహస్యం. "ఏతస్మిన్విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" అనిన్ని ॥శ్లో॥ భిద్యతే హృదయగ్రంధిశ్ఛిద్యంతే సర్వసంశయాః। క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అనిన్ని ॥శ్లో॥ "అహంకారాదిదేహాంతో వేద్యో నాత్మా ఘటాదివత్। తత్సాక్షీ సర్వగో జ్యోతిరాత్మ [త్మా]త్వం శబ్దలక్షితః"

"నదేవేత్యాది నైవోక్తమద్వయం సర్వకారణమ్
ఏకమేవ పరబ్రహ్మ తచ్ఛబ్దేనోపలక్షితః॥
తత్త్వయోస్సంగాతో సత్యాం విరుద్ధాంశం వివర్జయేత్।
ద్వైతపారోక్ష్యహీనేన పూర్ణబోధో విశిష్యతే॥
సర్వభూతస్థితం యోమాం భజత్యేకత్వమస్థితః"

అని భగవద్వాక్యం కలదు గనుక జీవన్ముక్తిప్రశంస చెప్పంబడెను.

ఇతి శ్రీపరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యాసుధార్ణవే యోగశాస్త్రే
స్వానుభవ దృఢీకరణావధూతలక్షణజీవన్ముక్తి
నిరూపణం నామ అష్టమ ప్రకరణం
సమాప్తమ్

# తొమ్మిదవ ప్రకరణము

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మైశ్రీగురవే నమః॥

మనః క్షోభం తాపత్రయమయ నిదాఘేనవహతో,
ముముక్షోరానందామృత లహరికామోదఘటికామ్।

ప్రపాంకుర్వాణ గుర్వంచిత మపిచదత్తాభిధనిధిం,
కరేదండ్రం బిభ్రజ్జయతి పరమానందయతిరాట్॥

ఉత్తమాధికారులైన ముముక్షువుల విషయీకరించి పరమానందతీర్థులు జీవన్ముక్తి లక్షణమతివిశదముగా దెలిసేటందుకున్ను దృఢం గలిగేటందుకున్ను ఐదు ప్రకరణాలలో నిరూపిస్తున్నారు. జీవన్ముక్తి ప్రమాణమేది, అందుకు సాధనమేలాగు, అందుకు సిద్ధియేది, ఆ సిద్ధివల్ల ప్రయోజనమేది అంటే చెప్పేము. జీవవంతుండైన పురుషునికి కర్తృత్వ భోక్తృత్వ సుఖత్వ దుఃఖత్వాది గుణాలు వివికలవో అవిచిత్తధర్మాలు క్లేశరూపాలుగాబట్టి, బంధమనిపించును. వాటినివారణమిప్పుడు జీవన్ముక్తి. అయితే యీబంధము, సాక్షివల్ల నివార్యమో చిత్తంవల్లనోఅంటే యీరెంటివల్లనున్ను గాదు, జ్ఞానంవల్లనే నివారణంగాని మరొక అందువల్ల నివారణంగాదు. ఏలాగైనానేమి జలానకు ద్రవత్వమున్ను వహ్నికి ఉష్ణత్వమున్ను నివారణంగావాలాగే, కర్తృత్వాదిధర్మాలు చిత్తంవల్ల నివారణంగావు. స్వాభావికం సర్వత్ర సమానమనరాదు. అత్యంతికనివారణం కూడదు గనుక, యేలాగైనానేమి జలగతమైన ద్రవత్వము మృత్తికామేళనంచేత కించిన్మాత్రం పోవును. వహ్నిం గలయుష్ణత్వము మణిమంత్రాలచేతం బోవును. అటువలెనే, యోగాభ్యాసం చేత నమస్తమయిన చిత్తవృత్తులున్ను నివారింపబడును. అయితే ప్రారబ్ధకర్మ మనేది, అవిద్యాతత్కార్య నాశమందు ప్రవృత్తిగల తత్వజ్ఞానానకు ప్రతిబంధకమై స్వఫలదాయకమైన దేహాదికం గలుగంజేయును. సుఖదుఃఖాది భోగాలు చిత్తవృత్తిలేక నంపాదించ గూడదుగనుక, ఈయోగాభ్యానమేలాగభిభవ మౌనోయని శంకించరాదు. అభిభవసాధ్యమైన జీవన్ముక్తికిన్ని సుఖాతిశయ రూపత్వేన ప్రారబ్ధఫలాలయందలి అంతర్భావాలు అవుగాక అంటివా, అట్లైతె కర్మాలె జీవన్ముక్తిన్ని సంపాదించును అనరాదు. అయితే పురుషప్రయత్నం వల్ల సిద్ధిఅంటేను, కృషివాణిజ్యాలతో సరియౌను. స్వయమదృష్టరూపమైన కర్మాలకు దృష్టసాధనసంపత్తిలేకే ఫలజనకం గానేరదు. గనుక, దృష్ట సాధన నంపత్తినపేక్షింపవలెను. కృష్యాదులయందు పురుషప్రయత్నంవల్లనె అయ్యేటట్టైతే, స్వానుకూలమైన వర్షాభావం వల్ల దృష్టసామగ్రి అప్రయోజక మాయెను, అలాగే జీవన్ముక్తి యందున్ను ప్రబలమైన యోగాభ్యానమునకు

విరోధం చెప్పరాదు. కృష్యాదులయందు దృష్టసామగ్రి గలిగిరంటే మరిన్ని కాలాంతరదృష్టిచేతను దృష్టసామగ్రికి ఫలమైనట్టే, పురుషప్రయత్నమైన యోగాభ్యాసానకున్ను విరోధంలేక ఫలమౌను. ఉద్దాలకవీత హవ్యాదులకు స్వేచ్ఛ చేతనె దేహత్యాగం గలిగెను. అలాగె అస్మదాదులకున్ను గలుగునుఅంటే, అయుస్సు కొంచెమైనందువల్ల తాదృశమైనయోగం నంభవించదు. అలాగైనా, కామాది వృత్తి నిరోధమాత్రమైన యోగమందు ప్రయాసంలేదు. శాస్త్రీయమైనటువంటి యోగాన్నంగీకరించకుంటే, చికిత్స శాస్త్రం మొదలు మోక్షశాస్త్ర పర్యంతమున్ను సమస్తమైనందుకున్ను అనర్థం వచ్చును. యత్నంవల్ల కించిత్ఫలమైనా గలిగేటందుకు దౌర్బల్యం గానేరదు. అన్యథా ఒకానొకరాజపురుషుండు తనపరాజయం చూచి గజాశ్వసేనల నపేక్షించినట్టే, బోధాచార్యులున్ను చెప్పినారు. "నహ్యజీర్ణ భయ దాహారపరిత్యాగ। ఇక్షుభయాద్వాసాల్యమధిశ్రయణం। యూకభయాద్వా ప్రావరణపరిత్యాగ యితి" యని కలదు గనుక శాస్త్రీయప్రయత్నముయొక్క ప్రాబల్యము వశిష్ఠరామసంవాదమందు స్పష్టంగా జెప్పబడెను.

వశిష్ఠః॥ సర్వమెవెహహినదా నంసారె రఘునందనా। సమ్యక్ప్రయుక్తాత్సర్వేణ పౌరుషాత్సమవాప్యతె। ఉచ్ఛాస్త్రం శాస్త్రితంచేతి పౌరుషం ద్వివిధం స్మృతం। తత్రోచ్ఛాస్త్రమనర్థాయ శాస్త్రితం". ఉచ్ఛాస్త్రమనంగా యేది అంటె పరద్రవ్యాపహార పరస్త్రీగమనాదులు. నిత్యనైమిత్తికకర్మాదులు శాస్త్రితమనిపించును. అనర్థంవల్ల నరకం అర్థంవల్ల స్వర్గాదులు, పరమందు మోక్షము పరమార్థమౌను.

అబాలాద్యలమభ్యస్తై శ్శాస్త్రసత్సంగమాదిభిః।
గుణైః పురుషయత్నేన సార్థస్సంపాద్యతె హితః॥

ఇటనంగానేది అంటె లెస్సనంపూర్ణమాయెనంట. గుణాలతోగూడింది అనంగా అధ్యాహారము. హితమనంగా శ్రేయోరూపము.

శ్రీరామః॥ ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాంయథా।
మునే తథైవ తిష్ఠామి కృపణః కింకరోమ్యహమ్॥

అని కలదు. వాసనాజాలమనంగా జీవగత సంస్కారాలె ధర్మాధర్మరూపాలై యుండును గనుక, యేలాగున్నదో అలాగె ఉన్నారముగనుక, మేము చేయదగ్గదియేది అన్నందుకు ఉత్తరం.

వశిష్ఠః॥ అతఏవహి హేరామ శ్రేయః ప్రాప్నోతి శాశ్వతమ్।
స్వప్రయత్నోపనీకేన పౌరుషేణైవ నాన్యథా॥
ద్వివిధో వాసనావ్యూహ శుభశ్చైవ శుభశ్చతే।
ప్రాక్తనో విద్యతెరామ ద్వయోరేకతరోథవా॥

ఏధర్మాధర్మాలు తనయందు యోజింపబడుచున్నవో అందు ఏకధర్మ మందె అనెడి వికల్పం. ఏకతరపక్షమందు శుభకర్మమో అశుభకర్మమో అనే వికల్పం.

వాసనౌఘేన శుద్ధేన తత్రచెదధనియ్యతె।
తత్క్రమేణాశు తేనైవ పదం ప్రాప్యసి శాశ్వతమ్॥

అశుభవాసన విడిచి శుభవాసనే అభ్యసింపవలెను. అందువల్లనశుభ వాసన క్షీణమౌను. మరియత్నాంతరం లేదుగనుక, శాశ్వతమైన పదమును బొందును. అటుగనుక శాస్త్రీయమైన యత్నంచేతను అశుభవాసనను పోమొత్త వలెను. ఎటువలెనైనానేమి ఒకానొకబాలకుని మృద్భక్షణమును విడిచేకొరకు ఫలభక్షణం యోజిస్తే మృద్భక్షణం విడుచును. మణిముక్తాహారాలు తీసుకుంటే, పూలచెండు చేతికియిస్తే అభరణాలు పారవైచును. అలాగే, చిత్తబాలకుని (విషయములో) సత్సంగంచేత దుస్సంగం బోజేయవలెను. చపలమైన పశువును బంధనస్థాన ప్రవేశమందు, హరితతృణద్దశన కండూయనాద వాక్పారుష్యదం డాది భర్జనంచేత ఖాదనస్థానమును జేర్చినట్టే, శత్రుమిత్రాది సమత్వమైనటువంటి సుఖబోధకొరకు ప్రాణాయామ ప్రత్యాహారాది పురుషప్రయత్నంచేత చిత్తశాంత్యు పాయమందు అద్యమైన మృదుయోగంచేత శీఘ్రంగానె చిత్తమును శాంతి బొందించవలెను. ద్వితీయమైన హఠయోగంచేత శాంతిబొందించ ప్రాయాసం గనుక, మృదుయోగంచేత మెల్లనె సాధించెనా శీఘ్రానసనె సఫలమౌను. అల్ప కాలాననే చేకూరనేరదని శంకించవలదు. శుభవాసననభ్యసిస్తే, సంపూర్ణఫల మౌను. లోకములోనొకానొకడు సహస్రజపమును సంకల్పించి అందు నూరు జపం మరపైతే, తిరిగి నూరుజపంచేస్తె సంపూర్తి అవును. అనూరున్ను సంఖ్యకు అధికమాయెనా, సంకల్పించిన సహస్రజపానకున్ను దూష్యంలేదు.

అవ్యుత్పన్నమానాయావత్ భవనాజ్ఞాత తద్వతః।
గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తాపదాచర॥

అనికలదుగనుక, కామాదుల నడ్డగించుగనుక, జీవన్ముక్తియందావశ్యక మైనది శ్రుతిస్మృతి వాక్యాలు. జీవన్ముక్తి సద్భావమందు హఠవల్ల జెప్పుచున్నది. "విముక్తశ్చ విముచ్యత యితి". జీవన్ముక్తుండు అయ్యేనసంగానేమి అంటే జీవవంతుడయ్యే ముక్తుడు అంట. అటుగనుక. జీవన్ముక్తుండయ్యె. కామా దులవల్ల ముక్తుండై దేహపాతమప్పడు భావిబంధాలవల్లను విశేషంగానే ముక్తుండౌను. మునుపే సంపాదించిన శమదమాదులచేతను కామదుల నిరోధిం చినారుగనుక, మరల నుత్పన్నమైనను ప్రయత్నంచేత నిరోధింపవలెను. అప్పుడు ధీవృత్తులు అభావంగాబట్టి విశేషంగానె ఫలసిద్ధి. ఏలాగైనానేమి ప్రళయమందు దేహపాతంగాగాను, కించిత్కాలము భావిదేహబంధమువల్లను ముక్తుండవును, మరింగలుగును. అత్యంతిక ప్రళయమువలెను మోక్షంగూడ ననే యర్థమందు బృహదారణ్యకం చెప్పుచున్నది.

యధాసర్వే ప్రముచ్యంతే కామాయె[య]స్య హృదిస్థితాః।
అథమర్త్యో మృతోభవత్యత్ర బ్రహ్మసమశ్నుతే॥

దేహేంద్రియాది వ్యవహారాలున్ను, గిరినది సముద్రాదికమున్ను బహుకాలం యీశ్వరునిచేత ఉపసంహారమై తిరుగ జగత్సృష్టి సమాయాన యధాపూర్వం గానేయుండును. సకలచరాచరాలచేతనున్ను స్పష్టంగానే జెప్పబడుచున్నది. జీవన్ముక్తునకైతే ధీవృత్త్యభావాలుగాబట్టి, సుషుప్తింబలెనే సకలమున్ను అస్తం గతాలవును, స్వయంప్రకాశమైన చిద్వ్యోమమే నిలుచును. అయితే బద్ధుని కిన్ని సుషుప్తికాలమందు తాత్కాలికధీవృత్త్యభావం గలదుగదా అంటే, భావి ధీవృత్త్యభావానకు సద్భావంగలదు గనుక జీవన్ముక్తత్వం గానేరదు. ఈ యర్థమే వాశిష్ఠము చెప్పుచున్నది.

యథాస్థితమిదం యస్య వ్యవహారవతోపిచ।
అస్తంగతం స్థితంవ్యోమ సజీవన్ముక్తిరుచ్యతే॥

అని కలదుగనక, మరిన్ని స్రక్చందన వనితాదిసుఖాలు ప్రాప్తమై నందువల్లను, సంసారులకు వలెను హర్షముపుట్టనేరదు; ధనహాని ధిక్కారా దులయందు సంసారులకువలె దైన్యం పుట్టనేరదు. ఎప్పుడున్ను ముఖప్రభ యధాస్థితిగానె గలిగియుండును. అదియెందువల్లనంటేను, సమాధిదార్ఢ్యంవల్ల స్రక్చందన వనితాదిప్రతీతి లేదుగాబట్టి. ఒకానొక వేళ వ్యుత్థానదశయందు, ప్రారబ్ధకర్మోపపాలిత పూర్వప్రవాహాగతమైన స్రక్చందన వనితాదిప్రతీతి గలిగినను, వివేకదార్ఢ్యంచేతనే హేయోపాదేయ బుద్ధులు రెండున్ను లేవుగనుక, జీవ న్ముక్తునకు హర్షవిషాదములు రెండున్ను తోపవు. ఈయర్థమందు వాశిష్ఠం.

నోదేతి నాస్తమాయెతి సుఖేదుఃఖె ముఖప్రభా।
యథాప్రాప్తిస్థితిర్యస్య సజీవన్ముక్త ఉచ్యతే॥

అని కలదు. జాగ్రదవస్థనున్నాను సుషుప్తుండవును. అదియేలాగంటేను, చక్షురాదింద్రియాలు స్వస్వగోళకాలందు అవస్థానోపరతి లేదుగనుక, జాగ్ర త్తనంబడెను. మనస్సు వృత్తిరహితమై యున్నదిగనక సుషుప్తిస్థుండాయెను. కనుక, "యింద్రియైరర్థోపలబ్ధి జాగరితం।" అని కలదు. జాగరణలక్షణం లేదు గాబట్టి, జాగ్రమునుగాదు గనుక సుషుప్తుండె అనంబడెను. సత్యబోధయందె లీనమైన చిత్తంగాబట్టి నిర్వాసనత్వం గలవాడౌను. ఈయర్థమందు వాశిష్ఠము.

యోజాగర్తి సుషుప్తస్థో యస్య జాగ్రం నవిద్యతే।
యస్య నిర్వాసనో బోధ సజీవన్ముక్త ఉచ్యతే॥ అనిన్ని
రాగద్వేష భయాదినా మనురూపం చరన్నపి।
యోంతర్వ్యోమ వదత్యచ్ఛ స్సజీవన్ముక్త ఉచ్యతే॥

రాగాదులనంగాను భోజనాది ప్రవృత్తులు, ద్వేషమనంగాను బౌద్ధ కాపాలాదికులవల్ల విముఖత్వం, భయమనంగా సర్పవ్యాఘ్రాదుల యందు ఉపసారణం. ఆదిశబ్దంచేత మాత్సర్యం. అదియును వచ్చినాను పూర్వాభ్యాసం

వల్ల గలిగినాను విశ్రాంతచిత్తమైనది గనుక, కల్మషంలేదు గనుక, అంతశ్శుచిత్వం గలిగియున్నది గనుక, నిర్లేపుడు. ఆకాశమందు ధూమధూళి మేఘావృతమైనాగాని, స్వభావాతిశయత్వంచేత నిర్మలత్వమే కనుక, అలాగె అంతశ్శుచిత్వం గలుగంబట్టి జీవన్ముక్తుండు. మరిన్ని,

యస్యనాహం కృతోభావో బుద్ధిర్యస్య నలప్యతే।
కుర్వతో కుర్వతోవాపి నజీవన్ముక్త ఉచ్యతే॥

లోకమందు ఒకానొక బద్ధుండైన పురుషుండు, శాస్త్రయుక్తమైన కర్మ జేసేటప్పుడు నేనీకర్మం చేసితిని "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అని యీకర్మం చేసితినని చిదాత్మాహంకారం పుట్టును. స్వర్గమును పొందెను అనే హర్షమున్ను గలుగును. చేయకుంటే యీకర్మం చేయకపోతిగా అనేవిషాదం గలుగును. ముక్తునకైతే తాదాత్మ్యాధ్యాన లేదుగాబట్టిన్ని, హర్షాద్యభావం కాబట్టిన్ని, యీరెండుదోషాలున్ను లేవుగనుక జీవన్ముక్తుండు. మరిన్ని,

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచయః।
హర్షామర్షభయైర్ముక్తః నజీవన్ముక్త ఉచ్యతే॥

అధిక్షేపతాడనాదివృత్తి తనకు లేదుగనుక, లోకులు తనకు వెరవరు. ఆకారణాన, లోకానకున్ను తావెరవంబనిలేదు. ఒకానొక దుష్టచిత్తునివల్ల నధిక్షేపతాడనాదులు గలిగినాను, తాదృశమైన వికల్పం తనకు లేదుగనుక, జీవన్ముక్తుండు. మరిన్ని,

శాంతసంసార కలనః కళావానపి నిష్కళః।
యస్యచిత్తోపి నిశ్చిత్తః నజీవన్ముక్త ఉచ్యతే॥

శత్రుమిత్ర, మానావమానాది వికల్పాలె సంసారకలన. చతుష్షష్టివిద్యలె కళలు; తదభిమానవ్యవహారం లేదుగనక నిష్కళత్వం. చిత్తానకు స్వరూపసద్భావం గలుగంబట్టి వృత్తిజనించదు గనుక, నిశ్చిత్తత్వం. అయితే ఆత్మధ్యానమందిప్పుడు అచింతకు వృత్తిసద్భావం కలదుగదా అంటే, లౌకికవృత్తి లేదుగనుక నిశ్చింతత్వమే కాబట్టి, జీవన్ముక్తుండు. మరిన్ని,

యస్సమస్తార్థ జాలేషు వ్యవహార్యపిసితళః।
పరార్థేష్వివ పూర్ణాత్మా నజీవన్ముక్త ఉచ్యతే॥

పరులయిండ్లకు వివాహోత్సవాలకుపోయి వారికిప్రియంగాను సకల వ్యాపారాలకున్ను వ్యవహరించినాను, ఆవివాహ కర్తకుగల లాభాలాభహర్షవిషాదాలు వారికిగలట్టు తనకు లేవుగనుక, అలాగే జీవన్ముక్తుండున్ను పరిపూర్ణ స్వరూపానుసంధానం గలుగంబట్టి జీవన్ముక్తుండు. మరిన్ని,

జీవన్ముక్తిపదం త్యక్త్వా స్వదేహె కాలసాత్కృతె।
విశత్యదేహముక్తత్వం పవనోస్పందతామివ॥

ఎటువలెనైనానేమి వాయువు తనచలనం విడిచి నిశ్చల స్వరూపంతో నున్నట్లు ముక్తాత్ముడును ఉపాధికృత సంసారము విడిచి స్వరూపమందే నిలుచును.

విదేహముక్తో నోదేతి నాస్తమేతి నశామ్యతి।
ననన్నానన్నదూరస్థో సచాహం నచనేతరః॥

హర్షవిషాదాలయొక్క ఉదయాస్తమయాల యందు శాంతిలేదు. ఇట నంగానేది అంటే, హర్షవిషాదాలు లేవుగనుక శాంతిన్ని లేదనుట. నదూరస్థః అనేయుక్తిచేతను సమీపస్థుండుగాడాయెను. వ్యవహారమందు వికల్పంమాత్రమే కాని మరేమిన్ని లేదు. మరిన్ని జీవన్ముక్తుండనగా నేమిఅంటే।

తతస్తిమితగంభీరం నతేజో నతమస్తతమ్।
అనాఖ్య మనభివ్యక్తం నత్కించిదవశిష్టతే॥

ఈప్రకారాన విదేహముక్తి సరిగాజెప్పబడిన యెంతెంత నిర్వికల్పకాతిశయమంతంత ఉత్తమమని చెప్పంబడెను. అజీవన్ముక్తునకే స్థితప్రజ్ఞుండనే నామమెటువలెనంటేను, భగవద్గీత యందు ద్వితీయాధ్యాయమందు స్థితప్రజ్ఞ చెప్పంబడెను. అదియేలాగంటేను. ప్రజ్ఞయనంగాను తత్వజ్ఞానం స్థితమనిన్ని అస్థితమనిన్ని రెండువిధాలు. ఏలాగంటే, ఒకానొక జారస్త్రీ తనప్రియుండైన జారపురుషుని యందు ప్రేమగలిగిందై గృహకర్మాల సకలమైన వ్యవహారాలప్పుడున్ను ఆ పురుషునే తలస్తుండును. ప్రమాణప్రతీతాలయిన గృహకర్మాలు చేస్తుండిన్ని మరచును. అటువలెనే పరవైరాగ్యంగల పురుషునికిన్ని యోగాభ్యాసపాటవం చేత, నత్యంతవశీకృతచిత్తంవల్ల నుత్పన్నమయిన తత్వజ్ఞానమందలి బుద్ధి జారస్త్రీవలెనే నిరంతరమున్ను తత్వము ధ్యానిస్తుండును. అదియిప్పుడు స్థితప్రజ్ఞయనిపించును. అస్థితప్రజ్ఞ యేలాగంటే, ఒకానొక పుణ్యవిశేషం వల్ల జ్ఞానముత్పన్నమైతే, అందు బుద్ధినిలువక పూర్వదుర్వాసనావశాన నంసారమగ్నత చేత దత్వజ్ఞానమును మరచును. అదియిప్పుడు అస్థితప్రజ్ఞ యనిపించును. ఈయర్థమంమ వాశిష్ఠం గలదు. పరవ్యసననివారిప్యగాపి గృహకర్మణి। తేదేవాస్వాదయత్యంతః పరసంగరసాయనం।

ఏవం తత్వేపరేశుద్ధే ధీరోవిశ్రాంతిమాగతః।
తోదేసాస్వాదయత్యంతః బహిర్వ్యవహరన్నపి॥

అనికలదు. స్థితప్రజ్ఞ కాలభేదంవల్ల రెండువిధాలు. సమాధినిష్ఠుండనిన్ని ప్రవర్తకుండనిన్ని రెండువిధాలు. ఈరెండులక్షణభేదాలున్ను జెప్పచున్నారము. అదియేలాగంటే, సమాధినిష్ఠుండైన స్థితప్రజ్ఞునకు భాషయేలాగు లక్షణమంటే, వ్యవహర్తయైన స్థితప్రజ్ఞునకు వాగ్వ్యాపార మెటువలెను, మూఢునకంటె విలక్షణుండెటువలెనంటే,

ప్రజహాతి యదాకామాన్ సర్వాన్పార్థమనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥

కామం మూడువిధాలు. బాహ్యాభ్యంతర వాసనామాత్రరూపాలై మూడు విధాలై యుండును. అందు, ఉపార్జితమోదకాలు బాహ్యాలు. ఆశామోదకాలు అభ్యంతరాలు. పథిగత తృణాదులవలెనే, అపాదతః పడింది వాసనామాత్ర రూపాలు. సమాధినిష్ఠునకు అశేష ధీవృత్తులున్ను సంక్షయాలుగాబట్టి, సకల మున్ను త్యజించును. ఆతనికి ముఖప్రసాద లింగగమ్యమైన సంతోషంగలదు. అదిన్ని కామాదులయందు లేదు. అదియెందువల్ల నంటేను, ఆత్మయందు కామాదులయొక్క త్యాగం గలిగెగనుక, బుద్ధికి పరమానందరూపమైనటువంటి ఆత్మ తత్త్వాభిముఖంవల్లను ముఖప్రసాదం గలిగెను. సంప్రజ్ఞాతసమాధివలెనే మనోవృత్తిచేతనే అయిందిగాదా అంటే, అలాగుంగాదు. స్వప్రకాశచిద్రూప మైన ఆత్మచేతనే సంతోషమంతేకాని, వృత్తిరూపంగాదు; మరేదంటేను, తత్సం స్కారరూపమేయని తెలియ వలెను. ఈప్రకారాన సమాధినిష్ఠుని లక్షణం చెప్పబడెను.

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థిరధీర్మునిరుచ్యతే॥

దుఃఖరోగాది నిమిత్తజన్యాలున్నైన్ని, రజోగుణ వికారాలున్నైన్ని, సంతాప హేతువులున్నైన్ని, తాదృశాలైన దుఃఖాలువచ్చినప్పుడు, అహంపాపి అహందుఃఖీ అనిన్ని, నేను దురాత్ముండను యీజన్మం గాల్చనేవలెను అనెడి పరితాప యుక్తాలై తమోగుణవికారత్వంచేత భ్రాంతిరూపాలైన యీచిత్తవృత్తేది కలదది ఉద్వేగము. చూస్తే వివేకికి గలిగినట్టె ప్రకాశిస్తున్నది. అటువలెనైనా పూర్వ జన్మమందు తత్త్వప్రవృత్తికి ప్రతిబంధకాలుగనుక, స్వప్రయోజనాలు అయెను. ఇప్పుడైతే నిష్ప్రయోజనాలాయెను; నిష్ప్రయోజనాలై భ్రాంతిత్వముననే కానంబడుచున్నది. సుఖనిమిత్తజన్యాలున్నైన్ని, రాజ్యపుత్ర కళత్రలాభాది నిమిత్తజన్యాలున్నైన్ని, సాత్వికప్రతిరూపాలున్నైన్ని అనుకూలాలున్నైన చిత్తవృత్తులకు అసుఖం గలుగుచునుండంగా, ఆగామియైనటువంటి తాదృశసుఖకారణమైన పుణ్యాపాపమును జేయకే తదపేక్షయేదికలదదే తామసవృత్తి స్పృహ. ఈ సుఖదుఃఖాలు ప్రారబ్ధకర్మమువల్ల బ్రాపించినవిగనుక, ఉద్ధతునియొక్క చిత్త వృత్తిసంభవాలు. అసుఖదుఃఖాలు రెండున్ను కలుగును. ఉద్వేగస్పృహలు వివేకికి సంభవింపవు. అటువలెనే రాగక్రోధభయాలున్ను తామసత్వేన కర్మ ప్రాపితాలుగావు గనుక, ఆతనికి లేవు. ఈప్రకారాలైన లక్షణాలచేత లక్షితమైన స్థితప్రజ్ఞునియొక్క బుద్ధి, స్వానుభవప్రకటనంచేతను శిష్యశిక్షార్థమై వుద్వేష........ది గమకమువాక్కులచేతం జెప్పబడుచున్నది. ఇంతే అభిప్రాయం.

యస్సర్వత్ర నభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినందతి నద్వేష్టి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

లోకమందు పరులకు హానివృద్ధులువస్తేను, తనవిగానారోపించుకొంట, అదిన్ని తాదృశమైన అన్యవిషయమైందిన్ని తామసవృత్తి విశేషమైన స్నేహము సుఖ హేతువు యేదిఅంటే, స్వకళత్రాదులు సుఖమేదిఅంటే, తద్గుణకథనాది ప్రవర్తకమైన బుద్ధివృత్తియొక్క అభినందము. అగుణకథనాలకంటె పరప్రయోజనార్థత్వం లేదుగాబట్టి, వ్యర్థమాయెగనుక, అందుహేతువైన అభినందమున్ను తామసమె య్యనిపించుకొనును. అసూయవల్లబుట్టిన దుఃఖాలకు హేతువులేవి అంటే, పరులయొక్క విద్యాదులు, అందునగూర్చి అశుభవిషయాలు తన్నిందా ప్రవృత్తిబుద్ధి యేదిగలదు అదిద్వేషం. అనిందను నిర్ధారణంజేయలేదు గనుక, అదిన్ని వ్యర్థమాయె గనుక, అవెల్లాను తామసధర్మాలాయెను. ఈతామస ధర్మాలు వివేకికియేల గలుగును? సర్వదాను వివేకికి లేవు, మరిన్ని

యదా సంహరతెచాయం కూర్మోంగానివ సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్యత్ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

అని కలదు. వ్యవహారకర్తయైన స్థితప్రజ్ఞునకు, సమస్తతామసవృత్తులున్ను లేవని యీచెప్పిన శ్లోకార్థాలవల్ల స్పష్టమాయెను. సమాధినిష్ఠునకు అయితే వృత్తులు లేవుగనుక, మరేలాగునను తామసత్వశంకకు పనేలేదు. అందుకు అభిప్రాయము, యీశ్లోకార్థము.

విషయా వినివర్తంతె నిరాహారస్య దేహినః।
రసవర్జంతసోప్యస్య పరందృష్ట్వా నివర్తతే॥

ప్రారబ్ధకర్మ సుఖదుఃఖహేతువులయిన విషయాలున్ను చంద్రోదయాంధకారాది రూపాలున్ను స్వయమేవ తమంతటతాముగనే కలిగినవి. తక్కిన గృహక్షేత్రాదులు పురుషోద్యోగద్వారేణ కలిగినవి. ఈసుఖదుఃఖహేతువులయిన యింద్రియాలున్ను, చంద్రోదయాంధకారాది రూపాలున్ను సమాధివల్లనె నివర్తకమౌను, "అహరణమాహారః ఉద్యోగః" యివి నిరుద్యోగికి గృహాదివిషయాలు నివర్తకమౌను. నీరసమనంగా మనస్సుందలి తృష్ణ. అతృష్ణాను పరమానంద రూపమైన పరబ్రహ్మదర్శనం గలుగంగాను, స్వల్పానంద హేతువులన్నిన్ని నివర్తకమౌను. ఈయర్థమందు శ్రుతి: "కింప్రజయా కరిష్యామో నాయమాత్మాయంలోకః।" అని కలదు మరిన్ని

యతతోహ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాదిని హరంతి ప్రసభంమనః॥
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసేతమత్పరః।
వశేహియస్యేంద్రియాణి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

ఉద్యోగత్యాగమె బ్రహ్మదర్శనప్రయత్నం. ఇందుచే అప్పుడు కదాచిత్ప్రమాదపరిహారం కొరకు, సమాధిని అభ్యసింపవలెను. ఈసమాధ్యభ్యాసం లేకుంటే హానికలదాఅంటే అందుకు ఉత్తరం జెప్పేము,

ధ్యాయతో విషయాన్ పుంసస్సంగ స్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

అనికలదు. గురుకారుణ్యంవల్ల స్వరూపదర్శనమైనను, అది సంతత మున్ను అనుసంధానం లేకయుండి విషయాతురుడాయెనా, సంగంప్రాప్తమౌను. సంగమనంగానేది అంటే, ప్రాకృతసంసర్గ. కామమనంగానేది అంటే, విషయాపేక్ష. క్రోధమనంగానేది అంటే, అభోగం కూడనందువల్ల ఆగ్రహం. మోహమనంగానేది అంటే, వివేకపరాఙ్ముఖత్వం. స్మృతిభ్రంశమనంగానేది అంటే స్వరూపానుసంధానం మరచుట. బుద్ధినాశమనంగానేది అంటే విపరీతభావనా దోషంచేత ప్రతిబంధకమైన జ్ఞానానకు మోక్షప్రదసామర్థ్యం కూడకపోవుట. ప్రణశ్యతి అనంగానేది అంటే అజన్మమందు మోక్షం లేదనుట. మరిన్ని

రాగద్వేష విముక్తైస్తు విషయానింద్రియైశ్చరన్।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥

విధేయాత్మత్వ మనంగా, వశీకృతమనస్త్వం. ప్రసాదమనంగా నైర్మల్యం. నైర్మల్యమనంగానేది అంటే బంధరాహిత్యము. సమాధ్యభ్యాస యుక్తుండైన యోగికి తద్వాసనాబలంవల్లను వ్యుత్థానదశయందు తనయింద్రియాలు విషయాలంగూడి విహరించినా గాని, ప్రసాదమును లెస్సగానే పొందును. ఈప్రకారాన స్థితప్రజ్ఞలక్షణం చెప్పంబడెను. ఓయి! ప్రజ్ఞయొక్క స్థిత్యుత్పత్తి చేతను, పూర్వమె సాధనంచేత రాగద్వేషరాహిత్యాదిక ముపేక్షింపంబడెను. మంచిది, అట్లైనాగాని అప్పుడు ఒకవిశేషం గలదు. అది వార్తికకారులు చెప్పుచున్నారు. విద్యాస్థిత్యభాక్ సాధనభూతాః। ప్రయత్ననిష్పాద్యాః లక్షణ భూతాస్తు। పునస్స్వభావాస్తే స్మృతాః స్థితప్రజ్ఞె ఇవ। అనికలదు. ఈజీవన్ముక్తి బాధింపంబడ్డటువంటి భేదప్రీతి కలదిన్నైన్ని, స్థితమైన ఆత్మబోధగలిగిందిన్నైన్ని అబాధితమైన ఆత్మప్రబోధ సామర్థ్యమును కలుగంజేయును. భగవద్భక్తుని లక్షణమేలాగంటే, భగవద్గీతలయందె ద్వాదశాధ్యాయంలో భగవానునిచేత వర్ణింపబడెను. అదియేలాగంటే,

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణఏవచ।
నిర్మమో నిరహంకార స్సుఖదుఃఖసుఖక్షమీ॥
సంతుష్ట స్సతతం యోగి యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధి ర్యోమద్భక్త స్సమేప్రియః॥ అనిన్ని
యోనహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి।
శుభాశుభపరిత్యాగి భక్తిమాన్యస్స మేప్రియః॥ అనిన్ని

సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।
శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥
తుల్యనిందాస్తుతిర్మౌని స్సంతుష్టోయేన కేనచిత్।
అనికేతస్థిరమతి ర్భక్తిమాజ్ మేప్రియో నరః॥

తత్రాపి వాక్యకారులున్ను విశేషంగా జెప్పినారు.

ఉత్పన్నాత్మప్రబోధస్య అద్వేష్టైత్యాదయో గుణాః।
అయత్నతో భవంత్యస్య నతుసాధనరూపిణః॥

అని కలదు. ఇత్యాదిగ్రంథాలచేత భగవద్భక్తుని గురించి చెప్పబడెను. ఇంక గుణాతీతుని లక్షణం యేలాగంటేను, గీతలలోనె చతుర్దశ అధ్యాయము చెప్పుచున్నది.

అర్జునః॥ కైర్లింగై స్త్రీన్గుణానేతా నతీతో భవతి ప్రభో।
కిమాచారః కథంచైతాం స్త్రీన్గుణా నతివర్తతె॥

గుణాలనంగా నేదిఅంటే, సత్వరజస్తమో గుణాలు. వాటిపరిణామ విశేషమే సమస్తమైనవారికిన్ని సంసారప్రవర్తకం. గుణాతీతమనంగాను అసంసారత్వం. జీవన్ముక్తిత్వమంటే, యేపర్యంతం పతితులైయే తదీయమైన గుణాతీతత్వబోధకాలైన వ్యాపారాలనాచరించుట ఆచారము. తదీయమనస్సంచారప్రకారమేలాగు సాధ్యమౌను? అనిఅడిగిన ప్రశ్నకు ఉత్తరం చెప్పుచున్నారు.

శ్రీభగవాన్॥ ప్రకాశం చ ప్రవృత్తంచ మోహమేవచ పాండవ।
నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి॥
ఉదాసీనవదాసీనో గుణైర్యో నవిచాల్యతే।
గుణావర్తంత యిత్యేవం యోవతిష్ఠతినేంగతే॥
సమదుఃఖసుఖః స్వస్థస్సమలోష్టాశ్మ కాంచనః।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందా త్మసంస్తుతిః॥
మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగి గుణాతీతస్స ఉచ్యతే॥
మాంచయోవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
సగుణాన్ సమతీత్యైతా న్బ్రహ్మభూయాయ కల్పతే॥

అని ప్రకాశప్రవృత్తి మోహకాలేవిఅంటే, సత్వరజస్తమోగుణాలు. ఆ గుణాలే జాగ్రత్స్వప్నములందు ప్రవర్తించును. సుషుప్తి సమాధి శూన్యచిత్త త్వావస్థలయందు నివర్తించును. ప్రవృత్తి రెండువిధాలు— అనుకూలమనిన్ని, ప్రతికూలమనిన్ని. మూఢుండైనవాడు జాగరణ ప్రతికూలప్రవృత్తిని ద్వేషించును; శూన్యచిత్తత్వదశయందు కాంక్షించును. గుణాతీతునికైతే అనుకూల ప్రతికూలాధ్యాస లేదుగనుక, ద్వేషాకాంక్షలుండవు. ఎటువలెనైనా నేమి,

యిద్దరుకలహిస్తే చూచెడికొందరు తటస్థులు తాము కేవలం ఉదాసీనులైయుం దురు, జయాపజయాలవల్ల ఇతస్తతః (ఇటుఅటు) చలింపరు. అటువలెనే, గుణాతీతుండైన వివేకిన్ని తానుకేవలం ఉదాసీనుండేయైయుండును, నేజేస్తిని అనెడిదిన్ని, నేను అనేదిన్ని అధ్యాసవచ్చి (అతనిని) చలింప జేయదు. ఈ యర్థమందు శ్రుతిః

అక్షీణత్వ మదీనత్వ మతవివేశ్వరస్మృతిః।
అలాభేనవిషాదిస్యా ల్లాభశ్చైంనచ హర్షయేత్॥

అని కలదు. క్షీణకర్మత్వమనంగా నేది అంటే, విధినిషేధాతీతత్వం నిస్త్రైగుణ్యేపథి విచరతామ్। కోవిధిః కోనిషేధః అనే స్మరణవల్లనున్ను, "త్రైగుణ్యవిషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున। నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో నిర్యోగ క్షేమ ఆత్మవాన్" అనెడి భగవద్వాక్యంవల్లనున్ను గుణాతీతలక్షణం చెప్ప బడెను. ఇంక అతివర్ణాశ్రమీ లక్షణమేలాగంటేను, సూతసంహితయందలి ముక్తిఖండములో పంచమాధ్యాయమందు పరమేశ్వరునిచేత వర్ణింపబడెను. అదియేలాగంటేను,

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోథ భిక్షుకః।
అతివర్ణాశ్రమీ చేతి క్రమాచ్ఛ్రేష్ఠో విచక్షణః॥
అతివర్ణాశ్రమీ ప్రోక్తో గురుస్సర్వాధికారిణామ్।
నకస్యాపి భవేచ్ఛిష్యో యథాహి పురుషోత్తమః।
అతివర్ణాశ్రమీ సాక్షాద్గురూణాం గురురుచ్యతె॥
తత్సమోనాధికశ్చాస్మిన్ లోకెస్త్యేవ నసంశయః।
యశ్శరీరేంద్రియాదిభ్యో విభిన్నం సర్వసాక్షిణమ్॥
పారమార్థికవిజ్ఞానసుఖాత్మానం స్వయంప్రభమ్।
పరతత్వం విజానాతి సోతివర్ణాశ్రమీ భవేత్॥
యోవేదాంతమహావాక్యశ్రవణేనైవ కేశవ।
ఆత్మానమీశ్వరం వేద సోతివర్ణాశ్రమీ భవేత్॥
యోవస్థాత్రయనిర్ముక్త మవస్థాసాక్షిణం ముదా।
మహాదేవం విజానాతి సోతివర్ణాశ్రమీ భవేత్॥
వర్ణాశ్రమాదయో దేవమాయయా పరికల్పితాః।
నాత్మనో బోధరూపస్య మమతె సంతిసర్వదా॥
ఇతియోవేద వేదాంతై స్సోతివర్ణాశ్రమీ భవేత్।
ఆదిత్యసన్నిధౌ లోకశ్చేష్టతె స్వయమేవతు॥
తథామత్సన్నిధావేవ సమస్తం చేష్టతే జగత్।
ఇతియోవేద వేదాంతై స్సోతివర్ణాశ్రమీ భవేత్॥

సువర్ణ్ణహారకేయూర కటక స్వస్తికాదయః।
కల్పితామాయయా తద్వజ్జగన్మయ్యేవ సర్వదా॥
ఇతియో వేద వేదాంతైస్సోతివర్ణాశ్రమీ భవేత్।
శుక్తికాయాం యథాకారం కల్పితం మాయయా తథా॥
మహదాది జగన్మాయా మయం మయ్యేవకల్పితమ్।

ఇతియోవేద॥

చండాలదేహే పశ్వాదిశరీరె బ్రహ్మవిగ్రహే॥
అన్యేషు తారతమ్యేషు స్థితేషు పురుషోత్తమ।
వ్యోమవత్సర్వదా వ్యాప్త సర్వసంబంధవర్జితః॥
ఏకరూపో మహాదేవస్థితస్సోహం పరామృతః।

ఇతియోవేద॥

వినష్ట దిగ్భ్రమస్యాపి యథాపూర్వం విభాతిదిక్।
తథా విజ్ఞానవిధ్వస్తం జగ త్తే భాతితన్నహి॥

ఇతియోవేద॥

యథాస్వప్నప్రపంచోయం మయి మాయావిజృంభితః।
తథా జాగ్రత్ప్రపంచోయం మయిమాయావిజృంభితః॥

ఇతియోవేద॥

యస్స్వవర్ణాశ్రమాచారో గళితస్స్వాత్మ దర్శనాత్।
సవర్ణానాశ్రమాన్ సర్వానతీత్య స్వాత్మని స్థితః॥
యఃక్త్వాసాశ్రమీన్ వర్ణాన్ నాత్మన్యేవ స్థితః పుమాన్।
సోతివర్ణాశ్రమీ ప్రోక్త స్సర్వవేదాంత వేదిభిః॥
నదేహనేంద్రియం ప్రాణో నమనోబుద్ధ్యహంకృతి।
నచిత్తం నైవమాయాచ నచ వ్యోమాదికం జగత్॥
నకర్తా నైవభోక్తాచ నచ భోజయితా తథా।
కేవలం చిత్సదానంద బ్రహ్మైవాత్మా యథార్థతః॥
జలస్యచలనాదేవ చంచలత్వం యథా రవేః।
తథాహంకార సంసారాదేవ సంసార ఆత్మనః॥
తస్మాదన్యగతాన్వర్ణా నాశ్రమానపి కేశవ।
ఆత్మన్యారోపితాఏవ భ్రాంత్యాతేనాత్మ వేదినః।
నవిధిర్న నిషేధశ్చ నవర్జావర్జకల్పనా।
ఆత్మవిజ్ఞానినామస్తి తథావాన్యజ్జనార్దనా॥
ఆత్మవిజ్ఞానినాం నిష్ఠామీదృశీమంబుజేక్షణా।
మాయయా మోహితామర్త్యా నైవ జానంతి సర్వదా॥

నమాంసచక్షుషాన్విష్టా బ్రహ్మవిజ్ఞానినామియమ్।
ద్రష్టుం శక్యాన్వతస్సిద్ధా విదుషాంనైవ కేశవ॥
యత్రసుప్తాజినా నిత్యం ప్రబుద్ధస్తత్ర సంయమి।
ప్రబంధాయఃత్రతే విద్వాణ సుషుప్తస్తత్ర కేశవ॥
ఏవమాత్మానమద్వంద్వం నిర్వికారం నిరంజనమ్।
నిత్యశుద్ధం నిరాభాసం సంచిన్మాత్రం పరామృతమ్॥
యోవిజానాతి వేదాంతే స్వానుభూత్యా వినిశ్చితమ్।
సోతివర్ణాశ్రమీ ప్రోక్త సయేవ గురురుత్తమః॥

అని కలదుగనుక, తదేవంవిముక్తశ్చ విముచ్యత యితి అనెడి శ్రుతి ప్రమాణాలచేతనున్ను అతివర్ణాశ్రమీలక్షణం చెప్పబడెను. ఈవిధమైనటువంటి జీవన్ముక్తి సద్భావమందు ఈప్రమాణాలవల్ల సిద్ధమాయెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యా సుధార్ణవే యోగశాస్త్రే
జీవన్ముక్త సద్భావప్రమాణనిరూపణం నామ
నవమప్రకరణం సమాప్తమ్

# పదవ ప్రకరణము

నమశ్రీగురవే తస్మై సమాజాద్వైతరూపిణె।
పరాయ బ్రహ్మరూపాయ విష్ణవె శివమూర్తయె॥
జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థితమయీ మాయామిమాం,
ఆత్మన్యధ్వని చక్షుషోస్త్రజగతామాలక్షయత్యద్భుతమ్।
మాయీనైవ పునశ్చయస్తు పరమానందానుసంధాయకో,
యోగీంద్రస్సవళక్షవక్షతి సుధీహృత్పుండరీకాంతరే॥

ఉత్తమాధికారులైన ముముక్షువుల విషయీకరించి పరమానందతీర్థులు జీవన్ముక్తిసాధనం నిరూపిస్తున్నారు. అదియేలాగంటే, తత్వజ్ఞానం, మనోనాశం వాసనాక్షయం యివి సాధనాలు. ఈయర్థము వాశిష్ఠరామాయణమందు ఉపశమన ప్రకరణావసానమందు జీవన్ముక్తులకు యీప్రస్తావమందు వశిష్ఠుండు చెప్పుచున్నాడు.

వాసనాక్షయవిజ్ఞాన మనోనాశా మహామతె।
సమకాలచిరాభ్యస్తా భవంతి ఫలదామతా॥

అన్వయం చెప్పి వ్యతిరేకం చెప్పుచున్నాడు.

యత్ర యత్రసమం యావన్నస్వభ్యస్తముహుర్ముహుః।
తావన్నసంపదప్రాప్తి ర్భవత్యపి సమాశతైః॥

సమకాలాభ్యానం లేనందువల్ల బాధకం చెప్పుచున్నాడు.

ఏకైకశోణిసేవ్యంతే యద్యేతె చిరమప్యలమ్।
తన్నసిద్ధిం ప్రయచ్ఛంతి మంత్రాసంకలితాయివ॥

ఎటువలెనైనానేమి, సంధ్యావందనమందు మార్జని యుక్తమైన ఆపోహిష్ఠామయేత్యాది ఋక్కులు మూడింట్లోను దినదినం ఒక్కొక్కఋక్కు చెప్పి మార్జనంచేస్తే శాస్త్రీయానుష్ఠానం సిద్ధించదు. ఎటువలెనైనానేమి, షడంగమంత్రాలకు ఒక్కొక్క మంత్రంచేత సిద్ధిగాదు. లోకమందు శాకసూపోదనాదులకు ఒక్కొక్కదానిచేతనే భోజనసిద్ధి గానేరనటువలెనే, వాసనాక్షయమనోనాశ తత్వజ్ఞానాలు ఏకకాలమందె కావలెగాని, ఒకటొకటే అభ్యానం చేయగూడదు. చిరాభ్యాసానకు ప్రయోజనం జెప్పుచున్నాడు.

త్రిభిరేతైశ్చిరాభ్యస్తైః హృదయగ్రంధయోదృఢాః।
నిశ్శంకమేవ త్రుట్యంతి బిసచ్ఛేదాద్గుణా యివ॥

అందుకు వ్యతిరేకం చెప్పుచున్నాడు.

జన్మాంతర శతోభ్యస్తారామ సంసారసంస్థితి।
సాచిరాభ్యానయోగేన వినాశక్షీయయతేక్వచిత్

కేవలం ఒకటొకటి అభ్యానం చేసేమంటే ఫలంలేదు. మరేదిఅంటే స్వరూపసిద్ధిన్నిగాదు. అదే చెప్పుచున్నాడు:

తత్వజ్ఞాన మనోనాశో వాసనాక్షయ ఏవచ।
మిథః కారణతాంగత్వా దుస్సాధ్యాని స్థితానహి॥

ఈమూటియొక్క నడుమను రెండురెండు మేళనం చేయంగా మూటికి మూటికి ద్వంద్వాలవును. మనోనాశమున్ను వాసనాక్షయమున్ను యీయుభయానకున్ను అన్యోన్యకారణత్వం వ్యతిరేకముఖంగా జెప్పుచున్నాడు.

యావద్విలీనం నమనో నతావద్వాసనాక్షయః।
నక్షీణావాసనా యావత్తావచ్చిత్తం నశామ్యతి॥

ప్రదీపజ్వాలానంతానం వలెనే, వృత్తిరూపంచేత పరిణామమానమైన అంతఃకరణమనే ద్రవ్యం మనసాత్మకత్వంవల్ల మనస్సని చెప్పంబడును. అమనస్సుకు నాశనమేలాగంటే, వృత్తిరూపపరిణామమును పరిత్యజించి నిరుద్ధాకారంచేత పరిణమించేది మనోనాశమని చెప్పంబడును, అలాగే పతంజలి సూత్రమున్ను చెప్పుచున్నది. "వ్యుత్థాననిరోధనంస్కారయోరభిభవప్రాదుర్భావా ఇతి సూత్రః।" నిరోధలక్షణాలంగల చిత్తాన్వయమె నిరోధపరిణామమని చెప్పంబడును. వ్యుత్థాననంస్కారాలు చెడి నిరోధనంస్కారాలే పుట్టును. నిరోధలక్షణాలుగల చిత్తమౌటంబట్టి చలింపదు. అదియిప్పుడు మనోనాశము· పూర్వాపరపరామర్శ లేనందున ఉత్పద్యమానమైనటువంటి క్రోధావృత్తివిశేషానికి హేతువైనటువంటి చిత్తగత నంస్కారాలేవికలవో అవియిప్పుడు· వాననలని చెప్పంబడును. అవి చిత్తమందుపాన్యమానాలై యుండును. అవాననలకు నాశమేలాగంటే, వివేకజన్యమయిన శాంతివానన నత్యంగానే దృఢీకరించినందువల్ల బాహ్యనిమిత్తంచేత క్రోధాదివాననలు పుట్టనేరవు. అక్కడ మనోనాశాభావమందు ఉత్పద్యమానమైన వృత్తులయందు ఒకానొకప్పుడున్ను బాహ్యనిమిత్తంచేత క్రోధాద్యుత్పత్తియందు, వాసనాక్షయం లేదు. అక్షీణమైనటువంటి వాసనయందు అలాగే వృత్యుత్పాదనమౌటంబట్టి మనోనాశం కూడదు, తత్వజ్ఞాన మనోనాశాలకు పరస్పరకారణత్వమును వ్యతిరేకముఖంగా జెప్పుచున్నాడు.

యావన్న తత్త్వవిజ్ఞానం తావచ్చిత్తశమః కుతః।
యావన్నచిత్తోపశమో నతావత్తత్త్వవేదనమ్॥

ఈనర్వమున్ను అత్మే, ప్రతీయమానమైన రూపరసాదికం జగన్మాయామయం, యేతద్వస్తుతః లేదు. ఇట్టి నిశ్చయమైన తత్వజ్ఞానం దానికిన్ని ఉత్పత్తియందు రూపరసాదివిషయాలకు సద్భావభ్రమ కలుగుటచే తద్గోచరాలైన వృత్తులనివారింప శక్యంగాదు, ఎటువలెనైనానేమి ప్రాప్యమాణాలయిన యింధనాలయందు అగ్నిజ్వాలలేలాగు నివారింపశక్యంగాదో అలాగే అసత్తైన చిత్తోపశమమందు వృత్తులచేత గ్రహింపబడ్డ రూపాదులయందున్ను.

"నేహనానాస్తి కించన।" అని శ్రుతి పలికెడిని. యజమానప్రస్తరయిత్యా దులకుంబలెనే ప్రత్యక్షవిరోధిశంకచేతను బ్రహ్మద్వితీయమనేది యేతాదృశమైన తత్త్వనిశ్చయం పుట్టనేరదు. వాసనాక్షయ తత్త్వజ్ఞానాలకు పరస్పరకారణత్వ మును వ్యతిరేకముఖంచేతను చెప్పుచున్నాడు.

యావన్న వాసనానాశస్తావత్తత్త్వశమః కుతః।
యావన్న తత్త్వసంప్రాప్తిః నతావద్వాసనాక్షయః॥

క్రోధాదివాసనలు నష్టంగాకుంటే, శమాదివాసనలు లేకపోవును. అప్పుడు తత్త్వం పుట్టనేరదు. అద్వితీయ బ్రహ్మతత్త్వమును యెరుంగనందువల్లను క్రోధాదినిమిత్తమైన అపాయమైన భ్రమకలుగంబట్టి వాసనాక్షీణంగాదు. యథోక్త మైన యీమూటియొక్క ద్వంద్వాలకు అన్యోన్యకారణత్వమును అన్వయ ముఖంచేతనే మేము ఉదాహరణం చేసేము. అదియెటువలెనంటేను, మనస్సు నష్టమౌచుండగాను సంస్కారోద్బోధకాలై నటువంటి బాహ్యనిమిత్తాలకు అప్రతీతిగాబట్టి వాసనక్షీణించును. క్షీణమైన వాసనయందు హేతువు లేనందు చేతను క్రోధాదివృత్తులు పుట్టవుగనుక, మనస్సునష్టమౌను. ఈప్రకారాన మనో నాశ వాసనాక్షయాలు రెంటికిన్ని ద్వంద్వం. "దృశ్యతె త్వగ్ర్యయ బుద్ధ్యా" అనెడి శ్రుతిచేత ఆత్మాభిముఖమైన వృత్తియొక్క దర్శనహేతుత్వంవల్లను యితర కృత్స్న వృత్తినాశానకుతత్త్వజ్ఞానహేతుత్వమె· అవగమమౌచుండగాను, మిథ్యా భూతమైన జగత్తునగల తత్త్వజ్ఞానమందు నరవిషాణాదులవలెనె శీఘ్రంగా వృత్తులు నాశమౌటనుబట్టి ఆత్మకున్ను ద్రష్టుత్వేనాపునః వృత్త్యుపయోగాలు గావుగనుక, నిరింధనాగ్నివలెనే మనస్సు నష్టమౌను. ఈప్రకారాన మనోనాశాన కున్ను తత్వజ్ఞానానకున్ను ద్వంద్వం. తత్వజ్ఞానానకు హేతువేది అంటే క్రోధాదివాసనాక్షయమే హేతువు. అదే వార్తికకారుండు చెప్పెను.

పరేబంధే స్వదేహేచ సమైకాత్మ్యం ప్రపశ్యతః।
వివేకినః కుతః కోపః స్వదేహావయవేష్వివ॥

క్రోధాదివాసనాక్షయరూపమైన శమాదులకు జ్ఞానహేతుత్వం ప్రసిద్ధం. అదేయావాసనాక్షయతత్త్వజ్ఞానాలు రెంటికిన్ని ద్వంద్వం. ఈమూడువిధాలయినటు వంటి తత్త్వజ్ఞాన వాసనాక్షయ మనోనాశాలు సంపాదించేటందుకు సాధనం చెప్పుచున్నాడు·

తస్మాద్రాఘువ యత్నేన పౌరుషేణ వివేకినా।
భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయమేతత్సమాశ్రయేత్॥

పౌరుషమనంగా పురుషప్రయత్నం, వివేకమనంగా విభజ్య నిశ్చ యము. తత్వజ్ఞానానకు శ్రవణాదికం సాధనం, మనోనాశానకు యోగం సాధనం, వాసనాక్షయానకు ప్రతికూలవాసనోత్పాదనం సాధనము. భోగేచ్ఛ స్వల్పమయిం దైనాను హరిషాకృష్ణవర్త్మేవ భూయయేవాభివర్ధతే। అనెడి న్యాయంచేతను అతిప్రసంగానకు దుర్వారంగనుక దూరతః పరివర్జయేత్ అని చెప్పంబడెను.

ముముక్షువైన పురుషునికి రెండుప్రయోజనాలు— జీవన్ముక్తిన్ని, విదేహ ముక్తిన్ని. అటుకనుక విముక్తశ్చ విముచ్యతె అనిశ్రుతి పలికెడిని. జీవవం తుండైన పురుషునికి దైవీసంపద మోక్షము, అసురసంపద బంధం. అటు గనుకే గీతలయందు షోడశాధ్యాయమందు భగవానుండు చెప్పినాడు.

దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా।

ఈదైవాసుర సంపదలక్షణం వివరించి చెప్పుచున్నారు.

అభయం సత్వసంశుద్ధిర్జ్ఞాన యోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్।
అహింసా సత్యమక్రోధస్త్యాగః శాంతిరపైశునమ్॥
దయాభూతేష్వలోలుత్వం మార్దవం హ్రీరచాపలమ్।
తేజః క్షమాధృతశ్శౌచ మద్రోహోనాతిమానితా॥
భవంతి సంపదందైవీమభిజాతస్య భారత।
దంభో దర్పోతిమానశ్చ క్రోధః పారుష్యమేవచ॥
అజ్ఞానం చాభిజాతస్య పార్థసంపదమాసురీమ్।

అశాస్త్రీయాలునైన్ని స్వభావసిద్ధాలునైన్నటువంటి అసురిసంపదలనెడి దుర్వాసనలున్ను శాస్త్రీయపురుషప్రయత్నంచేత సాధ్యమయిన దైవీసంపదల నెడి సద్వాసనలున్ను, క్షయమైతెజీవన్ముక్తి అవును. వాసనాక్షయమనోనాశాలు యీరెంటికిన్ని జీవన్ముక్తి హేతుత్వం గలదు.

మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్త్యై ర్నిర్విషయం స్మృతమ్॥

యతో నిర్విషయస్యాస్య మనసా ముక్తిరిష్యతె।
అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా॥
నిరస్తవిషయానంగం సన్నిరుద్ధమనోహృది।
యథాయాత్య మనోభావంతం తందాత్మరమం పరమ్॥
తావదేవ నిరోద్ధవ్యం యావద్ధృతిగతం క్షయమ్।
ఏతజ్ఞానంచ ధ్యానంచ శేషోన్యాయంచ విస్తరః॥

అనికలదు. బంధం — తీవ్రబంధం మృదుబంధమని రెండు విధాలు. అందు అసురిసంపద సాక్షాత్క్లేశహేతువయినది తీవ్రబంధము. ద్వైతమాత్రప్రతీతివల్ల స్వయంక్లేశరూపంగాబట్టి అసురసంపద ఉత్పాదకం గాబట్టి మృదుబంధము. వాసనాక్షయంచేతను తీవ్రబంధమొక్కటే నివర్తిం చును. మనోనాశమైతేనే ఉభయమున్ను నివర్తించును. అటుగనుక జీవన్ము క్తికి వాసనాక్షయమనోనాశాలు సాక్షాత్సాధనాలుగనక ప్రాధాన్యం. తత్త్వజ్ఞానానకు వాసనాక్షయహేతుత్వము బహుశ్రుతులచేతం జెప్పబడెను.

జ్ఞాత్వాదేవం సర్వపాశాపహానిః। అధ్యాత్మయోగాదధిగమేన దేవమ్। మత్వా ధీరో హర్షశోకౌ జహాతి। అనిన్ని, తరతి శోకమాత్మవత్। అనిన్ని, తత్ర కో మోహః కశ్శోకః అనిన్ని, జ్ఞాత్వాదేవం విముచ్యతే సర్వపాపైః। అనిన్ని, బహు శ్రుతులు చెప్పచున్నవి. మనోనాశహేతుత్వము తత్త్వజ్ఞానానకు శ్రుతిసిద్ధం. జీవన్ముక్తికి వాసనాక్షయమనోనాశాలవలెనే, విదేహముక్తికి సాక్షాత్సాధనమాయెను. కాబట్టి, జ్ఞానం ప్రధానం.

జ్ఞానాదేవతు కైవల్యం ప్రాప్యతేయేన ముచ్యతః।

అని శ్రుతిపలికెడిని. కైవల్యమనంగానేమనుట అంటే, కేవలస్యాత్మనో భావః కైవల్యం. ఇటసంగానేమనుట అంటే, దేహాదిరహితత్వం అంట. "ఏన జ్ఞానప్రాపిత కేవలత్వేన కృత్స్నబంధాద్వాముచ్యతే" అనికలదు. బంధాలు అనేకవిధాలు. అదియేలాగంటే, "అవిద్యాగ్రంధిః। అబ్రహ్మత్వం హృదయగ్రంధి సంశయః। కర్మాణి। అసర్వకామత్వం మృత్యుః పునర్జన్మ" ఇత్యాది బంధాలు సర్వమున్ను తత్త్వజ్ఞానం వల్ల నివర్తకాలౌను. అటువలెనే బహుశ్రుతులు పలుకుచున్నవి. యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్। సోవిద్యాగ్రంధి వికరతి అనిన్ని। హసోమ్య బ్రహ్మవేద బ్రహ్మైవ భవతీ। అనిన్ని

భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతె సర్వసంశయాః।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిణ్ దృష్టే పరావరే। అనిన్ని
యోవేద నిహితం గుహాయాం పరమే వ్యోమణ్।
సోశ్నుతే సర్వాన్కామాంత్సహ। అనిన్ని।
తవేవ విదిత్వాతి మృత్యుమేతి యస్తు విజ్ఞానవాణ్ భవతి।

సమనస్కస్సదాశుచి అనిన్ని। సతుతత్పదమాప్నోతి। యస్మాద్భూయో నజాయతె। యఏవంవేద అనిన్ని। అహం బ్రహ్మాస్మి అనిన్ని సయిదం సర్వం భవతి। అనిన్ని యిత్యాది అసర్వజ్ఞత్వాదిబంధనివృత్తి పరాలైనటువంటి శ్రుతి వాక్యాలు ప్రమాణాలాయెను. ఈవిదేహముక్తి జ్ఞానోత్పత్తినమకాలమందు జ్ఞేయ మైనటువంటి బ్రహ్మమందు అవిద్యారూపితాలయినటువంటి అశేషబంధాల కున్ను విద్యచేత నాశంగలుగుచు పునరుత్పత్తి లేదుగనుక, అననుభవమాయెను. అదే విద్యానమకాలత్వము. భాష్యకారులు సమన్వయసూత్రమందు చెప్ప చున్నారు. ఓయి! వర్తమానదేహపాతానంతర భావిదేహముక్తిరితి। అని శ్రుతులు బహుళంగా జెప్పచున్నవి. తస్యతావదేవ శరీరం యావన్న విమోక్ష్యేథ సంపత్స్యతః అని వాక్యవృత్తియందు ప్రారబ్ధ కర్మవేగేన , జీవన్ముక్తో యధాభవేత్।

కించిత్కాలమనారబ్ధ కర్మబంధస్య సంక్షయే।
నిరస్తాతిశయానందం వైష్ణవం పరమం పదమ్॥
పునరావృత్తిరహితం కైవల్యం ప్రతిపద్యతే।

అని సూత్రకారులు చెప్పుచున్నారు: భోగేనత్వితరే క్షపయిత్వాథ సంపద్యతయితి. ప్రారబ్ధపుణ్యాపాపమందె వశిష్టున్ను చెప్పెను.

జీవన్ముక్తిపదం త్యక్త్వా విదేహే కాలసాత్కృతే।
విశత్యదేహముక్తత్వం పవనోస్పందతామివ॥

అనిచెప్పంగాను జ్ఞానసమయకాలముక్తి యేలాగంటే, వివక్షావిశేషం చేతను మతద్వయానకున్ను విరోధంలేదు. విదేహముక్తియనంగాను దేహ శబ్దంచేత దేహజాతమైన కృత్స్నం వివక్షితంగాబట్టి బహుళంగా జెప్పెను. మాచేతనైతే భావిదేహమాత్రమే వివక్షితమని చెప్పవలెను. అది అరంభంకొరకు జ్ఞానము సంపాదింపంబడెగనుక ఈదేహము పూర్వమే అరబ్ధము. జ్ఞానంచేత నారంభమును వారింప శక్యంగాదు. తద్దేహనివృత్తిన్ని జ్ఞానఫలంగానేరదు. జ్ఞానులకు అరబ్ధకర్మక్షయమందెలా వృత్తె.... అటైతె. వర్తమానలింగదేహనివృత్తి జ్ఞానంలేకే దానికి నివృత్తి చెప్పగూడదంటే, అలాగుగాదు. సత్యమైన జీవన్ముక్తియందు వాటికి నివర్తకం గూడదుగనుక యిజ్ఞానానకు కించిత్కాలం ప్రతిబంధకత్వమైన ప్రారబ్ధకర్మంచేత నివర్తకంగాకయుండంగాను, ప్రతిబంధ క్షయమందే లింగదేహనివర్తకత్వం అవుననేమాట కూడదు. పంచపాదాచార్యు లున్ను చెప్పినారు: యతోజ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమ్। అని ప్రతిపాదించినారు గనుక, లింగదేహనివృత్తికి సాధనమేదిఅంటే, సామగ్రినివృత్తి చెప్పేము. కార్యనివర్తకం రెండువిధాలు: విరోధిసద్భావమున్ను, సామగ్రినివృత్తిన్ని. అదియేలాగంటేను, ఎటువలనైనానేమి, విరోధియైనటువంటి వాయువుచేత నున్ను, తైలసామగ్రినివృత్తిచేతనున్ను, దీపనివర్తకమౌను. లింగదేహనకైతే సాక్షాద్విరోధినిం గానము: గనుక, యేలాగుఅంటే, సామగ్రి రెండువిధాలు— ప్రారబ్ధమనిన్ని అనారబ్ధమనిన్ని. అజ్ఞానులకు లింగదేహము యిహాముత్ర భోగాలకు కలిగియుండును. జ్ఞానులకైతే సనారబ్ధజ్ఞానంచేత నివృత్తిఅవును. ప్రారబ్ధం భోగంచేత నివృత్తిఅవును. తైలవర్తిరహితమైన దీపమేలాగో అలాగే. సామగ్రినివర్తిచేత లింగదేహమున్ను నివర్తకమౌను. అవిద్యానివృత్తె విద్యా లాభంగనుక దోషంలెదు. అజ్ఞానము జ్ఞానంచేత నివర్తకమౌననేన్యాయం చేత విరోధంలేదు. అబ్రహ్మత్వాది అజ్ఞానసద్భావనియతులకు అజ్ఞానశబ్దం చేత పంచపాదికాచార్యులచేత వివక్షితమైనదిగనుక, అన్యథానుభవవిరోధమను సరింపంబడుచున్నది. అజ్ఞాననివృత్తివలెనే, అబ్రహ్మత్వాదినివృత్తిన్ని. అటు గనుక, దేహరాహిత్యలక్షణమే విదేహముక్తి. అవిదేహముక్తి జ్ఞానసమకాలత్వం చేతనే అయింది. అటువలెనే యాజ్ఞవల్క్యవచనమున్ను. అభయంవైజనక ప్రాప్తోసీతి అనిన్ని, ఏతావధరేఖల్వ మృతత్వమితి అనిన్ని, శ్రుత్యంతరమం దున్ను, తమేవం విద్వానమృత ఇహభవతి. ఉత్పన్నమైప జ్ఞానమందు తత్ఫల భూతమే విదేహముక్తి. అలాగుగాదు, కాలాంతరమందె అవును. అలాగే జ్యోతిష్టోమాదులయందేలాగో అలాగేగాస, జన్యంఅపూర్వం కించిత్కల్పించును.

కర్మశాస్త్రంవలెనే జ్ఞానశాస్త్రమున్ను. మంత్రాదులచేత నిలువంబడిన అగ్నివలెనే ప్రారబ్ధప్రతిబంధకజ్ఞానమున్ను కాలాంతరమందె విదేహముక్తిని యిచ్చునని చెప్పరాదు. విరోధమవును. మేము చెప్పేదియేలాగంటే, యింకమీద భావిదేహం లేదనే లక్షణమే విదేహముక్తి. వర్తమానదేహమాత్రమందే నిలిచిన ప్రారబ్ధకర్మంచేతను విరోధంలేదు. ఎందుచేత ప్రతిబంధమైనది? అది క్షణికత్వేన కాలాంతరమందు. స్వయమవిద్యమానమైన జ్ఞానమేలాగు ముక్తి నిచ్చును? జ్ఞానాంతరము చరమసాక్షాత్కారలక్షణమందు పుట్టునుఅంటే అది లేదు. ఎందువల్లనంటే, సాధనాభావంవల్లను ప్రతిబంధక ప్రారబ్ధనివృత్తితో గూడాను గురుశాస్త్రదేహేంద్రియాద్యశేష జగత్ప్రతిభాననివృత్తికి యేవిసాధ్య సాధనమౌను? అటైతే, "భూయశ్చాంతె విశ్వమాయానివృత్తిః" అనెడి శ్రుతికి అర్థమేది అంటివా, ఆరబ్ధాంతమందు నిమిత్తం లేదుగనుక, దేహేంద్రియాద్య శేషనిమిత్తక నివృత్తిఅనెడిదే అందుకు అర్థము. నీయభిమతమేది అంటే, వర్తమానదేహరాహిత్య లక్షణమె విదేహముక్తి, పశ్చాత్ అవునెడిది. మాయభిమతమేదిఅంటే, జ్ఞానసమకాలమందె విదేహముక్తి. ఈయర్థమందు స్మృతిః "తీర్థేవా శ్వపచ। గృహేవా నష్టస్మృతిరపి పరిత్యజం దేహం। జ్ఞానసమకాల ముక్తః కైవల్యం యాతి హతశోకః" అనికలదుగనుక, అదికారణాన విదేహ ముక్తియందు సాక్షాత్సాధనమైన తత్వజ్ఞానానకు ప్రధానత్వముపపన్నమాయెను. వాసనాక్షయమనోనాశాలకు జ్ఞానసాధనంచేతను వ్యవహితంగాగాను, ఉప సర్జనమాయెను. అసురవాసనాక్షయకారియైన దైవవాసనకు జ్ఞానసాధనత్వం శ్రుతిస్మృతులందు ఉపలభ్యమాయెను.

శాంతోదాంతోపరతిస్తితిక్షు స్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యతె। అనిన్ని। స్మృతియందు।

అమానిత్వ మదంభిత్వ మహింసాక్షాంతిరార్జవమ్।
అచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥
ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకారయేవచ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥
అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥
మయిచానన్య యోగేన భక్తిరవ్యభిచారిణి।
వివిక్తదేశసేవిత్వ మరతిర్జన సంసది॥
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్వజ్ఞానార్థదర్శనమ్।
ఎతజ్జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యతతోన్యథా॥

అని కలదు, తనకన్యమైన దానియందహంబుద్ధి యేదికలదో అది ష్వంగ. ఈవ్యుత్పత్తిచేతను జ్ఞానసాధనమందుకు అర్థము. మనోనాశానకు

జ్ఞానసాధనత్వం శ్రుతిస్మృతిసిద్ధం. అది యేలాగంటే, తతస్తుతం పశ్యతె నిష్కళం ధ్యాయమానం' అని శ్రుతి పలికెడిని॥ అత్మయోగాదధికమేన దైవ మత్వాధిరోపర్ష శోకాజహాతి' అనిన్ని శ్రుతిపలికెడిని. ప్రత్యగాత్మసమాధిప్రాప్తివల్లను యీప్రకారాన యెరుంగందగినది.

యం వినిద్రాజితేశ్వాసాస్సంతుష్టా స్సంయతేంద్రియాః।
జ్యోతిం పశ్యంతియం జానాః తస్మై విద్యాత్మనే నమః॥

అని స్మృతిపలికెడిని. ఇదేయీప్రకారాన తత్వజ్ఞానాదులు మూటికిన్ని. విదేహముక్తి జీవన్ముక్తివశాన ప్రధానోపసర్జన భావంచేతను, వ్యవస్థా సిద్ధి. వాసనాభేదం వాల్మీకిచేతం జెప్పబడెను.

వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధాచ మలినాతథా।
మలినాజన్మహేతుస్యాత్ శుద్ధా జన్మవినాశిని॥
అజ్ఞానసుఖసాకారా ఘనాహంకార శాలినీ।
పునర్జన్మకరి ప్రోక్తా మాలినావాసనా బుధైః॥
పునర్జన్మాంకురం త్యక్త్వా స్థితాసంభ్రష్టబీజవత్।
దేహార్థదీయతే జ్ఞాతృజ్ఞేయా శుద్ధేతిచోద్యతే॥

అని కలదు. శుద్ధవాసనచేతను జ్ఞాతృజ్ఞేయస్వరూపమును త్రయోదశాధ్యాయమందు భగవానులు చెప్పుచున్నారు.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే॥
సర్వతః పాణిపాదం తత్సర్వతోక్షి శిరోముఖమ్।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥
సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ॥
బహిరంతశ్చ భూతానామచరం చరమేవచ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికేచ తత్॥
అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితమ్।
భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణుప్రభవిష్ణుచ॥
జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।

అని చెప్పుచున్నది గనుక, అక్కడ తటస్థలక్షణ స్వరూపలక్షణాలతో డను పొందేకొరకు, సోపాధినిరుపాధిక స్వరూపద్వయమున్ను ఉపన్యస్తమాయెను. ఓయి! విడువంబడ్డటువంటి పూర్వాపరవిచారంగల వాసనాలక్షణం చెప్పంబడెను. జ్ఞేయమున్ను జ్ఞానమున్ను విచారింపంగాను అశుద్ధవాసనందున్ను అలక్షణం కద్దుగదా అంటేను, అలాగుచెప్పరాదు. లక్షణమందు దృఢభావనచేత చెప్పంబడె గనుక, యేలాగైనానేమి బహుజన్మాలందు దృఢంగాను

యీజీవన్ముక్తి వినాగాను, అహంకార కామక్రోధాలుఅనెడి మలినవాసనలేలాగు అంటేను, అలాగె ప్రథమమైన బోధకు విచారజనితత్వమైనటువంటి దీర్ఘ కాల నైరంతర్యాలైనటువంటి సంస్కారాలచేత భావించఁగాను, పశ్చాత్ యుక్తిపరామర్శవల్ల పురోవర్తియైనటువంటి ఘటాదులవలెనే సహజంగాను పరమందు తత్వం స్ఫురించును. తాదృశమైనటువంటి బోధానువృత్తితోగూడిన ఇంద్రియవ్యవహారము శుద్ధవాసన అనిపించును. అవాసనయును దేహజీవన మాత్రంకొరకే ఉపయోగ మింతేకాని, దంభదర్పాద్యాసుర సంపదకొరకున్ను జన్మాంతర హేతువయిన ధర్మోత్పాదనం కొరకున్ను కాదు. ఏలాగైనానేమి, సంభ్రష్టచణకబీజాలకు శూలపూరణ మాత్రోపయుక్తాలునైన్ని, భక్షణరుచికొర కున్ను, ఇంతేకాని పునరంకుర నిష్పత్తి కొరకుంగానిది యేలాగో అలాగే. ఇంక మలినవాసనయేలాగంటే, అదిమూడువిధాలై యుండును. లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అని. అదియెటువలెనంటే తన్ను సమస్తమైన జను లున్ను ఏలాగు నిందించకయుందురో, యేలాగు స్తోత్రం జేతురో అలాగే సర్వదా ఆచరించెననెడిది యేదికలదది మలినవాసన. అటువంటి ఆచరణ సంపాదించెడిది ప్రయాసంగనక మలినత్వమె. లోకమందు అలాగేకదా।

కోన్వస్మిన్సాంప్రతం లోకే గుణవాన్కశ్చ వీర్యవాన్।

అనెడి బహువాక్యాలచేత వాల్మీకి అడుగంగాను, నారదుండు

ఇక్ష్వాకువంశప్రభవో రామోనామ జనైశ్రుతః।

అనెడి బహువాక్యాలచేతం బ్రత్యుత్తరమిచ్చెను. తాదృశుండైన రఘు నాయకులకున్ను పాతివ్రత్యశిరోమణియై జగన్మాతయైన సీతాదేవికిన్ని జనుల చేతనపవాదం వచ్చెనంటే, తక్కినజనులకు నిందవచ్చేది స్వభావమే. అటు వలెనే దేశవిశేషంచేత పరస్పరనిందలు బహుళంగాకలదు. దక్షిణదేశమందలి విప్రులు ఉత్తరదేశవేదవిదులైన బ్రాహ్మణులను మాంసభక్షకులని నిందింతురు. ఉత్తరదేశబ్రాహ్మణులు యాత్రాకాలాల మృద్భాండపాకం జేయరాదని దక్షిణ దేశబ్రాహ్మణుల నిందింతురు. అలాగే స్వకులగోత్రబంధువర్గాలున్ను, ఒకరి నొకరు నిందించుకొందురు. దేవతాప్రశంసలయందున్ను, స్వకీయదేవతనవ లంబించి పరకీయదేవతలను ఒకరినొకరు నిందింతురు. ఈలాగు పరస్పర నిందాస్వభావమయ్యె. కాగా, ఎవ్వడును లోకమందు పొగడించుకొనేటందుకు సమర్థుండు? అటుగనుక।

విద్యతే నఖలు కశ్చిదుపాయః సర్వలోకపరితోషకరోయః।
సర్వదా స్వహితమాచరణీయం కింకరిష్యతిజనో బహుజల్పః॥

అనికలదు గనుక, లోకవాసన మలినత్వం గనుక, ఇందుకొరకె యోగీశ్వరులకు తుల్యనిందాస్తుతిత్వము మోక్షశాస్త్రాలయందు చెప్పంబడెను. ఇంక శాస్త్రవాసన యేలాగంటేను, అది మూడువిధాలు. పాఠవ్యసనం, అర్థ

వ్యసనం, అనుష్ఠానవ్యసనం. అందు పాఠవ్యసనం. భరద్వాజుండనే బ్రాహ్మడు మున్నూరుయేండ్లు అధ్యయనంజేసి పరమాయుస్సు మున్నూరుయేండ్లు సమాప్తిగాగా ఇంద్రునిగూర్చి తపస్సుచేసి మరినన్నూరేండ్లు ఆయుస్సు తీసుకొని, అధ్యయనం నన్నూరేండ్లున్ను చేసియును, అంతటా పరిసమాప్తి గాకపోయెను. మరిన్ని వేదాలు మిగిలేయుండెను. అటుగనుక, పాఠవ్యసనం మలినత్వం. అపాఠవ్యసనంకొరకె యింద్రునిచేతం బోధింపంబడి పాఠంనిలిపి అధికాయుస్సుకొరకు సగుణబ్రహ్మవిద్యను యింద్రునిచేతనుపదేశమాయెను. ఈయర్థమందు తైత్తిరీయబ్రాహ్మణము చూచుకునేది. ఇంక అశాస్త్రాలకు ఆత్యంతిక పురుషార్థంలేదు గనుక, మాలిన్యమె కౌషికేయ గీతలయందు చెప్పంబడినది. ఏలాగంటేను ఒకానొకముని బహువిధశాస్త్రపుస్తకభారాలతో గూడాను, మహాదేవునికి నమస్కారం చేయవచ్చి, ఆసభయందు మరొకమునీశ్వరుని చేత భారవాహియైన గార్ధభసామ్యమాపదించగాను, కోపంచేత పుస్తకాలనెల్లా లవణార్ణవమందు విడిచిపెట్టి, మహాదేవునిచేత నాత్మవిద్యనుపదేశమై కృతార్థుండాయెను. ఈయాత్మవిద్యచేత నంతర్ముఖుండైనాగాని గురుకారుణ్యంలేకే, శాస్త్రమాత్రంచేతలభించదు. ఈయర్థమందు శ్రుతి: "నాయమాత్మా ప్రవచనే నలభ్యతేన మేధయా నబహునాశ్రుతేన" అనిన్ని, "ఆచార్యవాన్ పురుషో వేద" అనిన్ని పలుకుచున్నది. మరిన్ని "బహుశాస్త్రకథా కంథారోమంథేన వృథైవకిం। అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్వజ్ఞై ర్జ్యోతిరాంతరం" అనిన్ని

అధీత్య చతురోవేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః।
బ్రహ్మతత్వం నజానాతి దర్వీపాకరసం యథా॥

అనిన్ని కలదు. నారదుండు, చతుష్షష్టివిద్యా కళాకుశలుండయిన్ని, ఆత్మవిద్యలేకుండినందున సనత్కుమారునిచేత నుపదేశింపంబడెనని ఛాందోగ్యం చెప్పుచున్నది. అనుష్ఠానవ్యసనం: విష్ణుపురాణమందు నిదాఘుండనె బ్రాహ్మణునకు చెప్పంబడెను. వాసిష్ఠరామాయణమందు దాశూరుండున్ను నిదాఘుండనే ఋషిచేత పునఃపునః బోధ్యమానుండు అయియుండిన్ని కర్మశ్రద్ధాజాడ్యం వల్లను, అనుష్ఠానంకొరకు శుద్ధప్రదేశము భూమిలోనెక్కడా గానకేపోయెను. అటుగనుక ఈయొక్కొక్క కర్మవాసనకున్ను పునర్జన్మహేతుత్వం గనుక మలినత్వమె. ఆకర్మమాలిన్యమే ఆథర్వణికమందు చెప్పబడినది: "ప్లవాంహ్యేతే అదృఢాయజ్ఞరూపా। అష్టాదశోక్తమపరం యేషుకర్మ। ఏతచ్ఛ్రేయో యేభినందంతి మూఢాః। జరామృత్యుం పునరావాపియంతి। అవిద్యాయామంతరె వర్తమానాస్స్వయంధీరాః పండితం మన్యమానాః। జఘన్యమానా పర్యంతి మూఢాః అంధేనైవ నీయమానేయథాంధాః। అవిద్యాయాం బహుధావర్తమానా వయం కృతార్థా యిత్యభిమన్యంతి బాలాః। యత్కర్మిణో నప్రవేదయంతి రాగాత్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే। యిష్టాపూర్తిం మన్యమానా వరిష్ఠం। నాన్యచ్ఛ్రేయో

వేదయంతె ప్రమూఢాః। నాకస్య పృష్ఠేతే సుకృతమనుభూత్వేమం లోకం హీన తరంవా విశంతి" అని కలదు. భగవద్గీత చెప్పుచున్నది.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥
కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥
భోగైశ్వర్యప్రసక్తానాం మయ్యాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధౌ నవిధీయతే॥
త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥
యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
తావాంత్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

అని కలదుగనుక, దర్పహేతువైన శాస్త్రవాసనయును మలినత్వమే. శ్వేతకేతువనే బ్రాహ్మడు స్వల్పకాలంచేతనే సకలవేదాలున్ను చదివి, గర్వం చేతను తండ్రి ముందరనున్ను వినయంజేయకే పోయెను. ఇది ఛాందోగ్య మందు, అష్టాధ్యాయమందు చెప్పబడియున్నది. ఇంక దేహవాసనయేలాగంటె, ఆత్మత్వగుణాధాన దోషాపనయభ్రాంతులచేత మూడువిధాలు. అందు ఆత్మత్వం మూడువిధాలు. భాష్యకారుడు చెప్పుచున్నాడుః చైతన్యవిశిష్టమైన దేహముమాత్రమె ఆత్మఅందురు ప్రాకృతులు. లోకాయతికుండున్ను అలాగేఅనును. "సవాఏషపురుషో న్నరసమయ" అనెడిశ్రుతి "ఆరభ్యతస్మాదన్నం తదుచ్చత యితి" అనెడిశ్రుత్యం తంగాను చెప్పెడిగ్రంథం చేతనున్ను, అదేప్రాకృతప్రతిపత్తిని తైత్తరీయోపనిష త్తందు స్పష్టంగాజెప్పుచున్నది. విరోచనుండు బ్రహ్మచేత వరంపుచ్చుకొనిన్ని, చిత్తదోషంచేత దేహాత్మబుద్ధిని దృఢీకరించి, రాక్షసులను అందరినిన్ని అను శాశిస్తుండెను. ఛాందోగ్యముష్టమాధ్యాయమందు చెప్పచున్నది: గుణాధానాలు రెండువిధాలు— లౌకికమున్ను శాస్త్రీయమున్ను. సమీచీనమైన శబ్దాదులనంపాదిం చేది లౌకికం. కోమలధ్వనిచేతం గానంచేసెడికొరకున్ను, అధ్యయనం చేసెడి కొరకున్ను, తైలపానరురుచిభక్షణాలచేత లోకులు యత్నంజేతురు. మృదు స్పర్శంకొరకు, పుష్టికరాలైన ఔషధాహారాలు పుచ్చుకొందురు. లావణ్యం కొరకు, అభ్యంగోద్వర్తన దుకూలాంబరాలు గైకొందురు. రుచికొరకు లవణా మ్లకటుతిక్తకషాయాదులు నంగీకరింతురు. సుగంధంకొరకు స్రక్చందనాదులు గైకొందురు. శాస్త్రీయమైన గుణాధానమేలాగంటేను, గంగాస్నాన సాలగ్రామ తీర్థాదికమును నంపాదింతురు. దోషాపనయమందున్ను చికిత్సకోక్తులచేత, ఔష ధాలచేత ముఖాదిప్రక్షాళనయిప్పుడు లౌకికము. శౌచాచమనాలు వైదికం. ఈ యుభయవిధులున్ను యీదేహవాసనకు మాలిన్యం చెప్పుచున్నవి. దేహానకు

ఆత్మత్వమే ప్రమాణికము గనుకానున్ను, దేహము అశేషదుఃఖహేతువు గనుకానున్ను మలినం. ఈయర్థమందు సమస్తమైన పూర్వాచార్యులున్ను పరాక్రాంతమైన గుణాధానమును ప్రాయేణయెప్పుడు చూడరు. గాయకులున్ను అధ్యాపకులున్ను ప్రయతమానులైనాగానిన్ని, ధ్వనిసాష్ఠవ మెప్పటికిన్ని లభించదు. పుష్టిన్ని కలుగనేరదు. లావణ్యసౌగంధాదుల యందున్ను దేహనిష్ఠంగాదు. అటుగనుక విష్ణుపురాణమున్ను చెప్పుచున్నది. మాంసాసృక్పూయ విణ్మూత్రస్నాయమజ్జాస్థినంయుతౌ।

దేహేచేత్ప్రీతిమాన్మూఢో భవితా నరకేపినః॥

స్వదేహాశుచిగంధేన నవిరజ్యేత యఃపుమాన్।

విరాగకారణం తస్య కిమన్యదుపదిశ్యతే॥

అనికలదు. శాస్త్రంయొక్క గుణమున్ను ప్రబలమైన శాస్త్రాంతరంచేతను అపాదింపబడును. అదియేలాగంటేను, "నహింసాత్సర్వా భూతాని" అనే వాక్యానకు "అగ్నిష్టోమీయాం పశుమాలభేత్" అనెడి ప్రబలవాక్యంచేత నేలాగు అపాదింపంబడెనో అలాగే।

యస్యాత్మబుద్ధి కుణపే త్రిధాతుకే,

స్వధీః కళత్రాదిషు భౌమయిజ్యధీః।

యస్తీర్థ బుద్ధిశ్చ జలేన కర్హిచిత్,

జనేష్వభిజ్ఞేషు సఏవ గోఖరః॥

అత్యంతమలినో దేహో దేహీచాత్యంత నిర్మలః

ఉభయోరంతరం జ్ఞాత్వా కస్యశౌచం విధీయతే॥

అని బహుశాస్త్రాలచేత దోషాపనయమున్ను ప్రతిషేధింపం బడెను. మరిన్ని పూర్వాచార్యులచేత ఇట్లు చెప్పంబడెను.

నవచ్ఛిద్రకృతా దేహాస్స్రవంతి ఘటకాయివ।

బాహ్యశౌచైర్న శుధ్యంతి అంతశ్శౌచంతు విద్యతే॥

అటుగనుక దేహవాసన మలినమె. కనుక, లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన యీమూడున్ను అవివేకులకు ఉపాధీయత్వేన ప్రతిభానమానమ్మయిన్ని వివేకులకు వేదనోత్పత్తి (కరములున్ను) విరోధంకాబట్టిన్ని వివేకులచేత హేయమైనది. అటుగనక వాశిష్ఠమందు చెప్పుచున్నాడు.

లోకవాసనయా జంతో శ్శాస్త్ర వాసనయాపిచ।

దేహవాసనయా జ్ఞానం తదావన్నైవ జానతః॥

అని కలదుగనుక, యీప్రకారాన తత్త్వజ్ఞాన వాసనాక్షయ మనోనాశ లక్షణం చెప్పంబడెను॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్య పరమానందతీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యా సుధార్ణవే యోగశాస్త్రే
జీవన్ముక్తిప్రశంసాయాం తత్త్వజ్ఞాన, వాసనా
లక్షణనిరూపణం నామ దశమ
ప్రకరణం సమాప్తమ్

# పదునొకండవ ప్రకరణము

జ్ఞానశక్తిసమారూఢం తత్త్వమాలావిభూషితమ్।
భోగమోక్షప్రదాతారం తస్మైశ్రీగురవే నమః
మలినంచైవ శుద్ధంచ వాసనాద్వితయం లయమ్।
నయం నయం జయత్యేవ పరమానందసంయమీ॥

ఉత్తమాధికారులైన ముముక్షువుల విషయీకరించి పరమానందతీర్థులు నాలుగోదైన మానసవాసనా లక్షణమీప్రకరణమందు నిరూపిస్తున్నారు. అదియేలా గంటేను: దంభదర్పాద్యాసుర సంపద్రూపమైనవి, మానసవాసనలు. కనుక నరకహేతువులు, కనుక మలినత్వమే ప్రసిద్ధము. అయితే, ఏయుపాయంచేత వాసనాచతుష్టయానకు నాశత్వం సంపాదించవలెను, ఎటువలె వాసనాక్షయం సంపాదించవలె నటువలెనే మనస్సుకున్ను. ఆమనస్సు సువర్ణంవలెనే, బహువిధ పరిణామార్హద్రవ్యం. ఆమనస్సుకు లక్షణమున్ను ప్రమాణమున్ను వాజసనేయమందు చెప్పబడియున్నది. “కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధా ధృతిరధృతి హ్రీర్ధీర్ గీర్భీర్ రిత్యేతత్సర్వం మనఏవ” అనెడిలక్షణం కామాదివృత్తులు. క్రమ్మానసే ఉత్పద్యమానాలౌను. చక్షుస్సుకు ప్రత్యక్షఘటం వలెనే సాక్షిప్రత్యక్షంగానె స్పష్టమై భావిస్తున్నది. అటువలెనె ఉపాదానం మనస్సు. మనస్సు అన్యమైతే జూచెడిది చూడదు. అన్యత్రమనస్సాయెనా, వినేది వినదు. మనస్సే చూచేదిన్ని, మనస్సేవినేదిన్ని. ఇది ప్రమాణం. పృష్ఠభాగమందున్ను స్పర్శేంద్రియద్వారా విశేషంగానే యెరుగుచున్నదీ. అటు గనుక సకలవిషయాలకున్ను వ్యతిరేకము. బాహ్యేంద్రియాలద్వారాయెరింగేది మనసె, మనసాన్మన ఇతి చేతనాచిత్తయితి అనికలదు. ఆచిత్తము సత్వరజస్తమోగుణాత్మకము ప్రకాశప్రవృత్తి మోహాత్మకమై యుండును. ప్రకాశమ నంగానేది అంటే, ఆత్మజ్ఞానం.

సత్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభఏవచ।
ప్రమాదమోహౌ తమసో భవతో జ్ఞానమేవచ॥

అని చెప్పుచున్నది గనుక జ్ఞానంవంటిదే సుఖమున్ను సత్వకార్యం।

సత్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞానమావృత్యతు తమః ప్రమాదే సంజయత్యుత॥

అని భగవద్వాక్యం గలదు. సముద్రతరంగాలవలెనే నిరంతరమున్ను పరిణామాలైన గుణాలయందు ఒకానొకప్పుడొకానొకటి పుట్టితే, యితరాలు అలాగే కలుగును. అదే భగవద్వాక్యం చెప్పంబడెను.

రజస్తమశ్చాభిభూయ సత్వం భవతి భారత।
రజస్సత్వం తమశ్చైవ తమస్సత్వం రజస్తథా॥
బాధ్యబాధకతాం యాంతి కల్లోలాయివ సాగరమ్।

అనికలదు గనుక, తమన్సు ఉద్భవమైతే, అసురసంపద ఉద్భవమౌను. రజస్సుద్భవమైతే, లోకవాసనాదులు మూడున్ను ఉద్భవమౌను. సత్వముద్భవమైతే దైవీసంపద బుట్టును. ఈయర్థమందు

సర్వద్వారేషు దేహేస్మిౕ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్వమిత్యుత॥

అని కలదుగనుక, యెటువలెనైనానేమి అంతఃకరణత్రిగుణాత్మకమై భాసిస్తున్నది. అటువలెనైనా సత్వమె అందుకు ముఖ్యమైన ఉపాదానకారణము. రజస్తమస్సులైతే అందుకవష్టంభకాలు. అటుగనుక, జ్ఞానులయొక్క యోగాభ్యాసంచేత రజస్తమస్సులు చెడి సత్వమె స్వరూపమై నిలుచును. ఈ యర్థమందు।

జ్ఞస్య చిత్తమచిత్తం స్యాత్ జ్ఞచిత్తం సత్వముచ్యతే॥

అని కలదు. అసత్వము చాంచల్యహేతువైన రజోగుణశూన్యంగాబట్టి, ఏకాగ్ర మనిపించును. భ్రాంతికల్పితాలై అనాత్మస్వరూపాలయిన స్థూలపదార్థాకారహేతువైన తమోగుణశూన్యంగాబట్టి, సూక్ష్మమై ఆత్మదర్శనయోగ్యమాయెను. అటుగనుకె శ్రుతి పలికెడిని॥

దృశ్యతే త్వగ్రియయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః।

అని కలదు. వాయువుచేతం గదలేది పంచాతమణిముక్తాది లక్షణాలు నిర్ధారించశక్యంగాదు గనుక, అటువలెనె స్థూలమైన గడ్డపారచేత సూక్ష్మమైన పటం సూక్ష్మమైన సూదిచేతనైనట్టు గాదుగనుక, అలాగెసూక్ష్మమైన సత్వమున్ను అయోగులయందు తమోగుణ గర్భితంచేత రజోగుణానం గూడి బహువిధ ద్వైతిసంకల్పంచేత చిత్తము తమోగుణాధిక్యంచేత నాసురిసంపదనుపొందును. ఈయర్థమే వాశిష్ఠము చెప్పుచున్నది:

అనాత్మన్యాత్మభావేన దేహమాత్రస్థయా తదా।
పుత్రదారకుటుంబైశ్చ చేతోగచ్ఛతి పీనతామ్॥
అహంకారవికారేణ మమతామల లీలయా।
ఇదం మమేతి భావేన చేతోగచ్ఛతి పీనతామ్॥
అధివ్యాధివిలాసేన సమాశ్వాసేన సంస్మృతే।
హేయహేయ విభాగేన చేతోగచ్ఛతి పీనతామ్॥
స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితామ్।
అపాత రమణీయేన చేతోగచ్ఛతి పీనతామ్॥
దురాశాక్షీరపానేన నభోగాని బలానిచ।
అస్థాదానేన చారేణ చిత్తాహిర్యాతి పీనతామ్॥

ఈప్రకారేణ నవినాశనీయమైన వాసనామనస్సులయొక్క స్వరూపం చెప్పంబడెను॥

అథ వాసనాక్షయమనోనాశౌ క్రమేణ నిరూపయామః।

వాసనాక్షయమేలాగంటె వాశిష్ఠము చెప్పుచున్నది:

బంధోహి వాసనాబంధో మోక్షస్యాద్వాసనాక్షయః।
వాసనా స్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వ మపిత్యజ॥
మానసిర్వాసనాత్పూర్వం త్యక్త్వా విషయవాసనా।
మైత్రాదిభావనానామ్ని గ్రహణామలవాసనా॥
తామప్యంతః పరిత్యజ్య తాభిర్వ్యవహరన్నపి।
అంతశ్శాంతతమస్నేహో భవ చిన్మాత్రవాసనా॥
తామప్యంతః పరిత్యజ్య మనోబుద్ధిసమన్వితామ్।
శేషస్థైరసమాధానో యేనత్యజతి సంత్యజ॥

అనికలదు. మానసవాసనా శబ్దంచేతను పూర్వోక్తాలయిన లోక, శాస్త్ర, దేహవాసనలు మూడున్ను వివక్షితాలాయెను. విషయవాసనాశబ్దంచేతను దంభదర్పాద్యాసురీసంపద వివక్షితమాయెను. అవి మృదుతీవ్రాలు తద్విపక్ష కారణమందు ఎవిగలవవి శబ్దస్పర్శరూపరసగంధాలు. వాటియొక్క కామ్యమానత్వదశయందు బుట్టిన సంస్కారం మానసవాసన. భుజ్యమానత్వదశా సంస్కారమిప్పుడు విషయవాసన. ఈపక్షమందు పూర్వోక్తాలైన మూడు వాసనలకున్ను మనస్సందంతర్భావము. అంతరబాహ్యవ్యతిరేకంగాను వాసనాంతరం లేదుగాబట్టి, ఓయి, వాసనలయొక్క పరిత్యాగమే కూడదు. పరిత్యాగమేలాగు ఘటించును, వాటికి మూర్తిలేదు గద. ఇప్పుడు సమ్మార్జనసమాహిత ధూళితృణాలవలెనే హస్తంచేత దుడిచిపారవేస్తున్నాము యిటనిచెప్పరాదు, ఉపవాసజాగ్రంవలెనె. అందుకు లక్షణం: స్వభావప్రాప్తాలయిన భుంజక్రియా నిద్రలయొక్క అమూర్తత్వమందున్ను, తత్పరిత్యాగరూపమైనటువంటి ఉపవాసజాగరణమందు సమస్తమైనవారలున్ను అచరిస్తున్నారు. అలాగే శుభవాసనారూపత్వేన మలినవాసన నివర్తకమౌను. ఓయి, అనంతాలైన శుభవాసనలున్నవి. ఒక్కటిచేతనన్ని శుభవాసనలున్ను అభ్యసింప శక్యంగాదు. అటుగనుక, తదభ్యాసప్రయాసం నిరర్థకము. తన్నివర్తకాలైన మలినవాసనలకు ఒకనియొక్క మనస్సునకు సంభవించవు గనుక, వేదోక్తాలయినటువంటి సకలమైన అవుషధాలున్ను ఒక్కకాలమందే ఒక్కనికి సేవించ శక్యంగాదు. సకలరోగములున్ను ఒక్కకాలమందే ఒక్కనికి సంభవించవు గనుక, తమ చిత్తమును పరీక్షించి యేకాలమందు యేమలిన వాసన గలిగియుండునో, ఆకాలమందు తద్విరోధియైన శుభవాసనను అభ్యసింపవలెను. ఎటువలెనైనానేమి, పుత్రమిత్ర కళత్రాదులచేత బీడితుండైనవాడు విరక్తుండై తన్నివర్తకమైన సన్యాసం గైకొనును. అటువలెనె, అవిద్యామద, ధనమద, కులమద,

ఆచారమదాది మలినవాసనలచేత పీడితుండైనవాడు తద్విరోధైన వివేక మును అభ్యసింపవలెను. అవివేకము జనకునిచేతను కనంబడెను.

అద్యమేమహతాం మూర్ధ్ని తెదినై ర్నిపతంత్యథః।
హంతచిత్తమహత్తాయాం కేయం విశ్వ స్తథా తవ॥
క్వథహాసి మహీపానాం బ్రాహ్మణః క్వజగంతివా।
ప్రార్తనాని ప్రయాతాని కేయం విశ్వస్తథాతవ॥
కోటయో బ్రహ్మణాం యాతా గతాస్వర్గపరంపరాః।
ప్రయతాః పాంసువద్భూతాః కాధృతిర్మమ జీవితైః॥
ఏషాం నిమేషణోన్మేషౌ జగతాం ప్రళయోదయౌ।
తాదృశాః పురుషాస్సంతి మాదృశాం గణనైవకా॥

అనికలదు. ఈవివేకోదయంవల్ల గలిగిన తత్వజ్ఞానోత్పత్తిగల ప్రాచీన యోగికి నిత్యానిత్యవస్తువివేకాది సాధనాలులేకే బ్రహ్మసాక్షాత్కారం లేదుగద. ఇప్పుడైతే ఉత్పన్న బ్రహ్మసాక్షాత్కారంయొక్క జీవన్ముక్తికొరకు, వాసనా క్షయాదిసాధనం చెప్పితివేమి అకాండతాండవమంటివా, "యనాయం దోషః" ఒకవిరోధమున్నూ లేదు. సాధనచతుష్టయసంపన్నునికి పశ్చాద్బ్రహ్మజ్ఞానము సర్వ పురుషసాధారణం. ప్రౌఢియైన రాజమార్గముగల జనకునికైతే పుణ్యాపుంజ పరిపాకంచేత నాకాశఫలపాకంవలెనే, ఒకానొక సిద్ధపురుషుని వాక్యాలు విని నమాత్రంచేతనె తత్వజ్ఞానముత్పన్న మాయెను. అయితే చిత్తవిశ్రాంతికొరకు యీప్రక్రియ చెప్పవలసెను. అకాండతాండవమేలా ఔను? కాండమె ఉచితం, తాండవం ఓయి. ఈవివేకికి జ్ఞానసమనంతర భావిత్వేన మలినవాసనానువృత్తి లేదు గనుక, శుద్ధవాసనాభ్యాస మనపేక్షితం గాదాఅంటే, అలాగనరాదు. జనకునికి తదనువృత్తిలేదు. యాజ్ఞవల్క్య భగీరథాదులకు తదనువృత్తి దర్శనంవల్లగదా అంటేను, యాజ్ఞవల్క్యునికి ప్రతివాదులైన ఉషస్తకహేళా దులకున్ను అధికమయిన విద్యామదం గలదు. ఎటువలెనంటే, సకలమైన వారికిన్ని జయించవలెననె ప్రవృత్తిగలుగంబట్టి వారలకు విద్యాంతరమెకాని బ్రహ్మవిద్యలేదంటివా, వారికిన్ని బ్రహ్మవిద్యకలదు. ఏలాగంటే, బ్రహ్మవిషయ మైన ప్రశ్నోత్తరాలు కలుగంబట్టి. అయితే బ్రహ్మవిషయమైన మాటలమాత్ర మైనటువంటి అపాదక జ్ఞానమేకాని సమ్యజ్ఞానం లేదంటివా, కలదు. సమ్య జ్ఞానమేలాగంటివా, అప్పుడు అస్మదాదులకున్ను వారివాక్యాలవల్లనె ఉత్పన్న మైన బ్రహ్మవిద్యకు అసమ్యక్త్వం సంభవించును. సమ్యక్త్వమైనా పరోక్షమే కాని, అపరోక్షం గాదంటివా, అపరోక్షమే, యెటువలెనంటే.

యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ। అనెడి ముఖ్యాపరోక్ష విషయమైనటు వంటి విశేషప్రశ్నలకుత్తరమిచ్చె గనుక, ఓయీ, ఆత్మజ్ఞానులకున్ను విద్యా మదం గలదని ఆచార్యులంగీకరించలేదు, ఎటువలెనంటేను, ఉపదేశసహ

శ్రీకయందు, బ్రహ్మవిత్తథా ముక్తా సఆత్మజ్ఞానచేతరః అనిన్ని, నైష్కర్మ్య సిద్ధి అనే గ్రంథమందున్ను।

నచధ్యాత్మాభిమానోపి విదుషోస్త్యాసురత్వతః।
విదుషోప్యాసురశ్చేత్స్యా నిష్ఫలం బ్రహ్మదర్శనమ్॥

అనిన్ని ఉందిగదా అంటివా, నాయందోషః విరోధంలేదు. జీవన్ముక్తి పర్యంతమైన తత్వజ్ఞానానకే యీయర్థంచెప్పబడ్డది. మేము జీవన్ముక్తులకు విద్యామదంగలదని అంగీకరించలేదు. ఓయి, వాదజయేచ్ఛ గలవానికి ఆత్మ జ్ఞానమేలేదు. ఎటువతెనంటే, "రాగో లింగమబోధస్య" అని ఆచార్యులు చెప్పుచున్నారు. అయినా యిదికాదుయెట్టంటె, రాగాదులున్ను గలుగని "కామం నతద్భావో వరాధ్యతి" అనిన్ని ఆచార్యులు చెప్పుచున్నారు గనుకాను, యీయర్థమందు పరస్పరవిరోధం లేదు. అదియెటువలెనంటే, స్థితప్రజ్ఞుండైన జ్ఞానియందు రెండువచనాలున్ను స్థాపించవచ్చును గనుక. అయితే, జ్ఞానికి రాగాదులు గల్గేటప్పుడు ధర్మాధర్మములద్వారా జన్మాంతరప్రాప్తి గలుగునంటివా, లేదు. ఎటువలెనంటే, నదగ్ధబీజవత్తు వంటి అవిద్యాపూర్వకమైన రాగాదులు గలవారికే పునర్జన్మహేతువుగాని, జ్ఞానులకైతే రాగాదులు దగ్ధబీజాల వలెనే ఆభానమాత్రాలు గనుక. ఈయర్థమందే స్మృతి।

ఉత్పద్యమానా రాగాద్యా వివేకజ్ఞానవహ్నినా।
తథా తదైవ దహ్యంతె కుతస్తేషాం ప్రరోహణమ్॥

అట్లైతే స్థితప్రజ్ఞునికిన్ని కలదుగద అంటివా, లేదు. ఏలాగంటే, తత్కాలమందు ముఖ్యపదమందు దోచినవల్లా బాధకాలుగనుక. అట్లైతే రజ్జు సర్పము (నిజ) సర్పంవలెనే భయమును పుట్టించును అంటివా, ఆభానమని వివేకంచేత విమర్శిస్తే బాధకం లేదు. అటుగనుక, మాకభిమతమైన జీవన్ముక్తిమార్గమునె స్థాపిస్తిమిగనుక, సుఖివైయుందుము. యాజ్ఞవల్క్యునకు యేకాలమందైనానేమి జయింపవలెననేయిచ్ఛ గలిగియుండె గనుక, చిత్త విశ్రాంతిలేదు. అదియేలాగంటే, ఇకమీద విద్వత్సన్యాసం జేయవలసిఉండగాను, జయాపేక్షమాత్రమే కాదు, ధనతృష్ణ చాలాగలిగియుండును. అదేలాగంటేను, అనేకబ్రహ్మవేత్తల మధ్యమందు సాలంకార గోసహస్రమును బలాత్కారానం గ్రహించి స్వయమేవ అసభామధ్యమమందు బలికెను; "నేనే బ్రహ్మవిష్ఠుండను గనుక యీసహస్రగోదానమందున్ను యిచ్ఛగలవానింబలెనె ఉన్నాడగనుక నాకొరకు నేనేనమస్కరించెదను" అనిపలికెను. ఇటనంగా యీవాక్యానకు తాత్పర్యమేమిఅంటె అసభయందు ఉన్నవారు బ్రహ్మవేత్తలు గారు తానేబ్రహ్మవేత్తను అని అబ్రహ్మలనవమానం చేసినట్టుగాదా అంటె, అంతేకాదు, అసభగల బ్రహ్మవేత్తలు తమ్మును తిరస్కరించి తానొక్కడె కొంచుబోవచ్చునా అని కోపించిరి. అకోపించిన బ్రహ్మవాదులలోను శాకల్యుండనె బ్రాహ్మణుని కోపించితే శపించెను, హరించెను. ఇటువంటి బ్రహ్మహత్య

చేసిన అతనికి మోక్షంలేదని శంకింపరాదు. అదియేలా అంటే కౌషీతకిశ్రుతి వాక్యం చెప్పుచున్నది: "నాస్యకేచన కర్మణా లోకోమీయతే। నమాతృవధేన నపితృవధేన। నస్తేయేన నభ్రూణహత్యయా" యిటని శ్రుతి పలికెడిని. శేష దున్ను తాజేసిన ఆర్యపంచాశతిలోనున్ను చెప్పినాడు:

"హయమేధ శతసహస్రాణ్యథ కురుతే బ్రహ్మఘాతలక్షాణి। పరమార్థ విన్నపుణ్యైర్నచ పాపైస్స్పృశ్యతె విమలః". శివయోగ ప్రదీపికయందున్ను, "కృత్వా మహాపాతకకోటికోటి హత్యాచభూతాని పృథగ్విధాని। దగ్ధ్వానమస్తం నచరాచరం తన్నలిప్యతె జ్ఞానబలేన యోగి।" అనికలదు. కింబహునా (ఇన్నిమాటలెందుకు) బ్రహ్మవేత్తలైన యాజ్ఞవల్క్యాదులకు మలినవాసనలైన వృత్తులు గలిగియుండెను. భగీరథుండు తత్వం యెరిగియుండిన్ని, రాజ్యం పాలించేటప్పుడు మలినవాసనలచేతం జిత్తవిశ్రాంతిలేకుండంగాను, సర్వమున్ను పరిత్యజించి వెనుక విశ్రాంతి బొందెను. ఈయర్థమందు వాశిష్ఠం చెప్పు చున్నది. అటుగనుక స్వకీయమైన మలినవాసనావిశేషమును పరకీయదోషం వలెనే లెస్సగా విచారించి తత్ప్రతీకారమభ్యసింప వలెను. ఈయభిప్రాయ మందు శ్రుతి,

యథానునిపుణం సమ్యక్పరదోషేక్షణే రతః।
తథాచేన్నిపుణస్స్వేషు కోనముచ్యేత బంధనాత్॥

అనికలదు. అదియందు విద్యామదం గలుగును. అందుకు ప్రతీకార మేలాగంటే, అమదం తనయందు గలిగినాను అన్యులయందు గలిగినాను సరే, అదియందు ఒకపరిభంగం గలుగును. కనుక నిరంతరమున్ను స్వరూప మును భావిస్తుండుట అందుకు ప్రతీకారము. ఎటువలెనైనానేమి, శ్వేత కేతువు విద్యామదంచేత ప్రవాహణుండనే రాజుయొక్క సభకుం బోయి, అతడు పంచాగ్నివిద్య వచ్చునా అనిఅడిగితే రాదుగనుక ఊరకేయుండగా అప్రవాహణునిచేత అపమానపడి తండ్రివద్దకువచ్చి అవమానం చెప్పగా ఆ తండ్రి విద్యామదం లేనివాడు గనుకతాబోయి ఆరాజుచేతం బంచాగ్నివిద్య గ్రహించెను. బాలాకియనే యాతండున్ను అజాతశత్రుడనే రాజుచేతం భర్త్సి తుండై దర్పమును పరిత్యజించి ఆరాజునే ఆశ్రయించెను. ఉషస్తకహేలా దులున్ను మదంచేత బరాజితులైరి. ఎటువలెనైనానేమి, మదము స్వనిష్ఠమై ప్రవర్తించనీ, పరనిష్ఠమై ప్రవర్తించనీ అలాగే తనవల్లబరునికి నిందాను అవమానమున్ను పరునివల్ల తనకు నిందాను అవమానమున్ను అయితే ఒకరి వల్లనున్ను ఒక్కరికిన్ని హానిలేదు అనిభావించుట, యీయర్థమందు

నిందావమానావత్యంత భూషణంయస్య యోగినః।
ధీవిక్షేపః కథం తస్య వాచాటైః క్రియతామిహ।

అనిన్ని। జ్ఞానాంకుశమందు॥

మన్నిందయా యరిజనః పరితోషమేతి,
నన్వప్రయత్న జనితోయ మనుగ్రహోమే।
శ్రేయోర్థినోహి పురుషాః పరితుష్టహేతోః,
దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజంతి॥
నతతసులభ దైన్యే నిస్సుఖే జీవలోకే
యది మమ పరివాదా ప్రీతిమాప్నోతి కశ్చిత్।
పరివదతు యథేష్టం మత్సమక్షంతిరోవా
జగదిహ బహుదుఃఖే దుర్లభప్రీతియోగః॥ అనిన్ని
తథా చర్యేతవై యోగీ సతాం ధర్మమదూషయన్।
జనాయథావమన్యేరన్ గచ్ఛేయుర్నైవ సంగతమ్॥

అనికలదు. యాజ్ఞవల్క్య ఉపస్తాదులకు, ఏస్వనిష్ఠపరనిష్ఠలయందు విద్యామదాలకు వివేకంచేత ప్రతికూలమాయెనో, అటువలెనే ధనాభిలాష క్రోధాలకున్ను ప్రతీకారం జేయవలెను.

అర్థానామర్జనే క్లేశస్తథైవ పరిపాలనే।
నాశే దుఃఖం వ్యయేదుఃఖం ధిగర్థాన్ క్లేశకారిణః॥

అనికలదు. ధనవిషయమవివేకం, క్రోధం రెండువిధాలు స్వనిష్ఠాను స్వవిషయమున్ను. అందుకు చెప్పుచున్నాడు।

అపకారిణీ కోపశ్చేత్ కోపేకోపః కథంను జాయతే।
ధర్మార్థకామమోక్ష ప్రాణియశోహాని కారణీక్రూరే॥
ఫలాన్వితే ధర్మయశోర్థ నాశనః నచేదపార్థన్స్వశరీరపాతనః।

నచేహనాముత్రహితాయనంతతం మనాంశికోపస్య నమాశ్రయేత్కథమ్॥
అనికలదు, స్వవిషయమునుంగూర్చి చెప్పుచున్నాడు।

నమేపరాధః కిమకారణే నృణాం
మదభ్యసూయేత్యపి నైవ చిన్తయేత్।
నయత్కృతా ప్రాగ్భవబంధ నిన్నృతిః
తతోపరాధః పరమో విచింత్యతామ్ ॥
నమోస్తు తవకోపాయ స్వాశ్రయజ్వాలినే భృశమ్।
కోపశ్యశ్యమమ వైరాగ్యదాయినే దోషబోధినే॥

అని కలదుకనుక, యేలాగైనా విద్యా, ధన, క్రోధ, పుత్రవిషయాలనే మలినవాసనలకు వివేకంచేత ప్రతీకారం జేయవలెను. ఆప్రతీకారం చేయుట వలన జీవన్ముక్తి లక్షణమైన పరమపదం లభించును. ఈయర్థమందు వశిష్ఠ చెప్పుచున్నాడు;

వాసనానంపరిత్యాగే యదియత్నం కరోత్ఫలమ్।
శత శిథిలాయంతి సర్వాధివ్యాధయః క్షణాత్॥
పౌరుషేణ ప్రయత్నేన బలాత్సంత్యజ్య వాసనామ్।
స్థితిం బద్ధ్వాశిచేత్తర్హి పదమాసాదయస్యలమ్॥

అని కలదు. పౌరుషేణ ప్రయత్నేన అనగానేదిఅంటే, పూర్వోక్తమైన విషయదోషములకు వివేకము పునఃపునః జేసుకొనిరాగా, ప్రబలమైన యింద్రియ వ్యాపారం వశీకరమౌను. ఈయర్థమందు భగవద్వాక్యం।

యతతోవ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభంమనః ॥
ఇంద్రియాణాంహి చరతాం యన్మనోనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥

అని కలదు ఈప్రకారాన ఉత్పన్నవివేకి రక్షణార్థంకొరకు యింద్రియాలను స్వవశం జేసుకోవలెను. మరిన్ని భగవద్వాక్యం:

తాని సర్వాణి సంయమ్య యుక్తఆసీత మత్పరః।
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥
తస్మాద్యశ్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

స్మృత్యంతర మందున్ను,

నపాణిపాద చపలో సనేత్రచపలోయది ।
నచ వాక్చపలశ్చైవ యితిసిష్టస్య లక్షణమ్॥

ఈయర్థమందు సంగ్రహవివరణమందు స్పష్టంగా జెప్పుచున్నాడు।

అజిహ్వాషండకః పంగు రంధోబధిరఏవచ।
ముగ్ధశ్చ ముచ్యతే యోగీ షడ్భిరేతైర్నసంశయః॥

అజిహ్వాఅనంగా నేదిఅంటే, ఇదిమృష్టాన్నం యిదికాదు అనేదిలేక యుండుట. షండః అనంగానేది అంటేను, వాక్యదుర్వాక్యాలు రెండులేకుండుట, అప్పుడు పుట్టినస్త్రీయందున్ను పదారేండ్ల యువతైన స్త్రీయందున్ను శతవర్షాలుచెల్లినస్త్రీయందున్ను ఒకరీతినే నిర్వికారం గలిగియుండుట. పంగుః అనంగానేది అంటే, భోజనార్థంకొరకున్ను మలమూత్రవిసర్జనం కొరకున్ను సంచరించుటయు యోజనమాత్రానకు అతిక్రమించి సంచారం లేకుండుటయును. అంధః అనంగానేదిఅంటేను, కూర్చున్నాను సంచరించినాను దృష్టిదూరంపోక యుండుట. బధిరః అనంగానేది అంటె, హితమున్నైా మితమున్నైా మనోహరమున్నైా శోకహరమైన వాక్కువినిన్ని విననివాడౌట. ముగ్ధ అనంగానేది అంటేను, విషయసాన్నిధ్యం గలిగియుండిన్ని సమర్థాలైన యింద్రియాలకు వికలత్వం పుట్టక సుప్తునివలెనే విహరించుట,

ననిందాం నస్తుతిం కుర్యాన్న కించిన్మమణి స్పృశేత్।
నసంభాషిస్త్రియం కాంచిత్పూర్వదృష్టాంచ నస్మరేత్॥
కథాశ్చ వర్జయేత్తాసాం నపశ్యేల్లిఖితామపి।

అనికలదుగనుక, యెటులైనానేమి యేకభుక్తోపవాసమౌనాది వ్రతాల సంకల్పించి సావధానంగా నాచరించుట, అటువలెనే అచింత్యాది వ్రతాల యందున్ను సావధానంగా వివేకమునుపాలించుట. ఈప్రకారానను వివేకేం ద్రియనిరోధాలచేత, దీర్ఘకాలము నిరంతరమున్ను సత్కారసేవచేతను ప్రతిష్ఠితాలైన మైత్ర్యాది వాసనలయందు అసురసంప్రదూపమైన మలినవాసనలు నష్టమౌను, ఉచ్ఛ్వాసనిశ్వాసాలవలెనున్ను, ఉన్మేషనిమేషాల వలెనున్ను పురుష ప్రయత్నంలేకయె ప్రయత్నవాసనలచేతను, మైత్ర్యాది వాసనలచేతను లోకమందు వ్యవహరిస్తుండిన్ని తదీయసాకల్య వైకల్యాది సంధానమును చిత్తమందు పరిత్యజించి నిద్రాతంద్రి మనోరాజ్యావిరూపాలైన సమస్తమైన చేష్టలనున్ను ప్రయత్నంచేతనే శాంతినిం బొందించి, చిన్మాత్రవాసననే అభ్యసించుట స్వతః అదేచిజ్జడోభయాత్మకమై భాసిస్తున్నది. ఏదైనానేమి, శబ్దస్పర్శాది జడవస్తువులు ప్రకాశరూపాలై యింద్రియాలగూడి యుండును. అటువలెనుండగా జైతన్యంయొక్క ఉపాదానకారణంచేత వర్జింపశక్యంగాదు గనుక, చైతన్య పూర్వకమయియే జడం ప్రకాశించును. ఈయర్థమందు శ్రుతిః "తమేవభావం తమనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి" అనికలదు గనుక తథాసతి అటౌచున్నండగాను పశ్చాద్భావమైన జడానకు మొదట ప్రకాశించెడిది చైతన్యంగనుక, వాస్తవం స్వరూపమేయని నిశ్చయించి జడమును విడిచి, చిన్మాత్రమును చిత్తమందు నిలుకడచేసుట, యీయర్థమందు బలిశుక్రసంవాదం కలదు.

కిమిహాస్తి కియన్మాత్ర మిదం కిమయిమేవచ।
కస్త్వం కోహం కయేతేహ లోకాయితి వదాశుమే॥
చిదిహాస్తీతి చిన్మాత్ర మిదం చిన్మయమేవచ।
చిత్త్వం చిదహమేతేచ లోకాశ్చిదితి సంగ్రహః॥

అని కలదు. ఎటువలెనైనానేమి, స్వర్ణకారుడు కటకం చేసేటప్పుడు వలయాకారంయొక్క గుణదోషాలను విడిచి గురుత్వమందున్ను స్వర్ణమందే వానిమనస్సు దృఢమైయున్నట్టి చిన్మాత్రమందు మనస్సు దృఢంజేయవలెను. ఏకాలమందు జగమును సర్వదాయుపేక్షచేసి చిన్మాత్రమందు మనఃప్రవృత్తి నిశ్వాసాదులవలెనె స్వాభావికంగా సంపాదించునో ఆకాల పర్యంతమును, చిన్మాత్రవాసనయందే ప్రవర్తించును, ఓయి. అదియందే చిన్మాత్రవాసన గలుగంగా, అవాసనచేతనే మలినవాసన నివృత్తిగాగా, 'నెందుకు మైత్ర్యాద్యభ్యాసం?' యిటనిచెప్పరాదు. చిద్వాసనకు అప్రతిష్ఠవచ్చును. ఎటువలెనైనానేమి, కుట్టిమదార్ఢ్య వ్యతిరేకంగా స్తంభకుడ్యాద్యాత్మకమైన గృహార

ప్రతిష్ఠలేకే పోవును. తనకు ఉనికిలేకే పోవును. ఎటువలెనైనానేమి, రేచనం చేత ప్రబలదోషం బోజేయకే ఔషధం సేవిస్తే ఆరోగ్యంగానేరదేలాగు అలాగే. అట్లైతే దాన్నివిడిచిపెట్టితే నేమిఅని అలాగనరాదు. చిన్మాత్రమున్ను విడిస్తే అన్యధా దానికి చిదుపాధేయత్వం లేదుగనుక, విరోధంలేదు. అచిన్మాత్రవాసన రెండువిధాలు—మనోబుద్ధిసమన్వితమును, తద్రహితమున్ను. కరణం మనస్సు, కర్తృత్వోపాధి బుద్ధి. అలాగైయుండగాను ప్రమత్తుండై అహంఅనే అర్థంచేత నేకాగ్రమైన మనస్సుచేతను చిన్మాత్రమనుభావించెను, అనెడి యేతాదృశమైన కర్తృకరణానుసంధానంతో గూడిండి యీప్రాథమికమైన చిన్మాత్రవాసన యేది కలదదిధ్యానశబ్దాభిధేయమయినది. అధ్యానశబ్దాన శబ్దాభిధేయమైన వాసనవిడిచి, యేఅభ్యాస పాటవంచేత కర్తృకరణాద్యనుసంధాన వ్యవధానరహితమేది గలదో. అసమాధినే నిలువవలెను. ధ్యానసమాధిలక్షణం పతంజలిసూత్రం జెప్పుచున్నది:

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః" అనికలదు. తాదృశసమాధియందు దీర్ఘకాల నైరంతర్యసత్కారాలచేత సేవిస్తే, ధైర్యంగలుగును. అవెనుకను కర్తృకరణాద్యనుసంధాన పరిత్యాగార్థము అప్రయత్నాసనే వాటిసన్ని విడువవలెను. అట్లైతే ఈప్రకారాన తత్త్యాగప్రయత్నమున్ను విడిచేటప్పుడు అనవస్థాయెగదా అనరాదు. కతకరజోన్యాయం[1] చేతను, స్వపరనిర్వాహకత్వమౌను. ఎటువలెనైనానేమి, అడుసునీళ్లలో కరంచిన కతకరజస్సు అయడుసును పోజేసి యందు తోగూడా దానుంజెడిపోవును. అలాగే త్యాగార్థప్రయత్నము కర్తృకరణానుసంధానాసను వర్తించి తానుగూడానే పోవును. అలాగు నివర్తకంగాగా మలిన వాసనవలెనే శుద్ధవాసనయును క్షీణమౌను. అప్పుడు మనస్సుకు నిర్వాసనత్వం సిద్ధించును. ఈయర్థమందు వశిష్ఠు చెప్పుచున్నాడు.

తస్మాద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః।
నామ నిర్వాసనభావ మాహురాశు వివేకతః॥
సమ్యగాలోకనాత్సత్యా వాసనా ప్రవిలీయతే।
వాసనావిలయాచ్చేత శ్శమమాయాతి దీపవత్॥ అనిన్ని
యోజాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రం నవిద్యతే।
యస్య నిర్వాసనో బోధస్సజీవన్ముక్త ఉచ్యతే॥
సుషుప్తివత్ప్రశమిత భావవృత్తినా
స్మితస్సదా జాగ్రతి యేన చేతసా।
కళాన్వితో విధురివ యస్సదా బుద్ధైః
నిషేవ్యతే ముక్తయతీహ సన్మృతః॥ అనిన్ని।
హృదయాత్సంపరిత్యజ్య సర్వమేవ మహామతేః।
యస్తిష్ఠతి గతవ్యగ్ర స్సముక్తః పరమేశ్వరః॥

---

1 కతకరేణున్యాయము

సమాధిమథ కర్మాణి మాకరోతు కరోతువా।
హృదయేనాస్తసర్వాస్థో ముక్తయేవోత్తమాశయః॥
నైష్కర్మ్యేణ నతస్యార్థో స్తస్యార్థస్తి నకర్మభిః।
ననమాధానజప్యాభ్యాం యస్య నిర్వాసనం మనః॥
విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః।
సంత్యక్త వాసనాన్మౌనాదృతేనాప్యుత్తమం పదమ్॥

అనికలదు. అట్లైతే నిర్వాసనామనస్కునకు దేహయాత్ర హేతువైన వ్యవహారం కూడదుగదా అనిశంకింపరాదు. చక్షురాదివ్యవహారానకున్ను మానస వ్యవహారానకు లోపమేలాగౌను అంటే, అదియందే ఉద్దాలకుని వల్ల చెప్పంబడెను.

వాసనాహీనమప్యేత చ్చక్షురాదింద్రియం స్వతః।
ప్రవర్తతే బహిస్స్వార్థే వాసనామాత్ర కారణమ్॥ అనిన్ని।
అయత్నోపనతేష్వక్షి దృగ్ద్రవ్యేషు యథాపునః।
నిరాగమేవ పతతి తద్వత్కార్యేషు ధీరధీ॥

అని కలదు. తాదృశమైనటువంటి బుద్ధిచేతను, ప్రారబ్ధభోగము అదే సంపాదించుకొను. ఈయర్థమందు వాశిష్ఠంకలదు.

పరిజ్ఞాయోపభుక్తోహి భోగో భవతి తుష్టయే।
విజ్ఞానసేవితశ్చోరో మైత్రీమేతి నచోరతామ్॥ అనిన్ని।
అశంకితోపసంప్రాప్త గ్రామయాత్రా యథాధ్వగైః।
ప్రక్ష్యతే తద్వదేవజ్ఞై ర్భోగశ్రీరవలోక్యతే॥

అని కలదు. భోగకాలమందున్ను వాసనలచేత నిర్వాసనలకు విశేషం గలదు.

నాపధి గ్లానిమాయాంతి. దేహపద్మం యథానిశి
నహంతే ప్రకృతాదన్య ద్రమంతే సిష్టవర్త్మని॥
నిత్యమాపర్ణతా మంతరక్షుబ్ధా మిందుసుందరీమ్।
అపద్యపీనముంచంతి శశిన శ్శీతతామివ॥
అబ్ధివద్ధృతమర్యాదా భవంతి విగతాశయాః।
నియతిం నావముంచంతి మహాంతో భాస్కరాఇవ॥

అని కలదు. జనకునకున్ను సమాధిచాలించిన వెనుక యీాదృశాచరణ చెప్పుచున్నాడు.

తూష్ణీమథ చిరం స్థిత్వా జనకో జనజీవితమ్।
వ్యుత్థితశ్చింతయామాన మనసా శమశారినా॥
కిముపాదేయమస్తీహ యత్నాత్సంసాధయామికిమ్।
స్వతస్థితస్య శుద్ధస్య చింతా కామేస్తి కల్పనా॥

నాభివాంఛామ్యసంప్రాప్తం సంప్రాప్తం నత్యజామ్యహమ్।
స్వస్థ ఆత్మని నిష్ఠామి యన్మమాస్తి తదస్తుమే॥
ఇతి నంచింత్య జనకో యథాప్రాప్త క్రియామసౌ।
అశక్తః కర్తృముక్తస్థా దైనం దీనపతిర్యథా॥
భావిష్యం నానుసంధంతే నాతీతం చింతయత్యసౌ।
వర్తమానే నిమేషంతు హసన్నేవాభివర్తతే॥

అని కలదు గనుక, ఈప్రకారాన యథోక్తమైన వాసనా క్షయం చేతను, యథోక్త జీవన్ముక్తి సిద్ధమౌను. ఇటని వాసనాక్షయ లక్షణం చెప్పబడెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ
యతికృతౌ బ్రహ్మవిద్యా సుధార్ణవే యోగశాస్త్రే
వాసనాక్షయనిరూపణం నామ ఏకాదశ
ప్రకరణం సమాప్తమ్



# పండ్రెండవ ప్రకరణము

స్థావరం జంగమంచైవ నిర్మలం స్థిరమేవచ।
జగత్సర్వంచ సౌమ్యంచ తస్మైశ్రీ గురవేనమః॥
మనోలయమతిక్రమ్య మనోనిగ్రహ మవ్యయమ్।
పరమానంద తీర్థేంద్రో పరమానందమశ్నుతే॥

ఉత్తమాధికారులైన ముముక్షువుల విషయీకరించి పరమానందతీర్థులు జీవన్ముక్తిసాధనమైనటువంటి మనోనాశం యీప్రకరణమందు నిరూపిస్తున్నారు అదియెటువలెనంటేను, యెప్పుడైనానేమి అశేషవాసనాక్షయం గలుగంబట్టి మనస్సు నాశమేఅయెను. మనస్సు నాశమౌటంబట్టి వాసనాక్షయం రక్షింపం బడెను. ఓయి! అజింహ్వాషండకాభ్యానం వలెనే వాటికి రక్షాసిద్ధియని చెప్ప కుమీ. నష్టమైన మనస్సందు అజింహ్వాతాదులకు అభ్యాసప్రయత్నం లేదు గనుక, అలాగుగాదు. మనోనాశాభ్యానం నీకుగలుగవలెను. అటుగనుక, మనో నాశనమును జనకుండు చెప్పుచున్నాడు.

సహస్రాంకుర శాఖాత్మ ఫలపల్లవ శాలినః।
అస్య సంసారవృక్షస్య మనోమూలమితి స్థితమ్॥
సంకల్పమేవ తన్మన్యే సంకల్పోపశమేన తత్।
శోషయామి యథాశోష మేతి సంసారపాదపః॥
ప్రబుద్ధోస్మి ప్రబుద్ధోస్మి దుష్టశ్చోరో మయాత్మనః।
మనోనామిహనె ఏవం మనసాస్మి చితం హతః॥

వశిష్ఠున్ను చెప్పుచున్నాడు.

అస్య సంసారదుఃఖస్య సర్వోపద్రవదాయినః।
ఉపాయ ఏక ఏవాస్తి మనస్సర్వస్య నిగ్రహః॥
మనసోభ్యుదయో నాశో మనోనాశో మహోదయః।
నమనో నాశమభ్యేతి మనోజ్ఞస్యహి శృంఖలా॥
తావన్నిశిధభేతాళా వల్గంతి హృదివాసనా।
అకతత్వదృఢాభ్యాసో ద్యావంనివిజితం మనః॥
ప్రక్షీణచిత్త దర్పస్య నిగృహీతేంద్రియద్విషః।
పద్మిన్యయివ హేమంతె క్షీయ్యంతె భోగవాసనాః॥
హస్తం హస్తేన సంపీడ్య దంతైర్దంతాన్విచూర్ణ్య చ।
అంగాన్యంగైస్సమాక్రమ్య జయేతాదౌ స్వకంమనః॥
ఏతావతి ధరణితలే సుభగాస్తే సాధుచేతనాః పురుషాః।
పురుషసుధానుచ గణ్యేన జితాపి చేతనాస్వేన॥

హృదయబిలే కృతకుండల వుల్బణకలనావిషో మనోభుజగః।
యస్యోపశాంతి మగమదుదితోన్నత మవ్యయంవందే॥ అనిన్ని।
చిత్తన్నాభిః కిలాస్యేహ మయా చక్రన్య సర్వతః।
స్థీయ్యతే చేత్తదాక్రమ్య తన్నకించిత్ప్రబాధతే॥

అనికలదు గనుక, యీయర్థమందు గౌడపాదాచార్యులున్ను చెప్పుచున్నారు.

మనసో నిగ్రహాయత్తమభయం సర్వయోగినామ్।
దుఃఖక్షయ ప్రబోధశ్చాప్యక్షయా శాంతిరేవచ॥

గీతలయందు చెప్పుచున్నాడు।

చంచలంహి మనః కృష్ణప్రమాథి బలివద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే హయోరివ సుదుష్కరమ్॥

ఈవచనము హఠయోగవిషయం కాబట్టి, వశిష్ఠున్ను చెప్పుచున్నాడుః

ఉపవిశ్యోపవిశ్యైక చిత్తకేన ముహుర్ముహుః।
నశక్యతే మనోజేతుం వినాయుక్తిమనిందితామ్॥
అంకుశేనవినా మత్తో యథాదుష్ట మతంగజః।

అని కలదు గనుక, యీమనోజయానకు నాలుగుసాధనాలు గలవు. అదియేలాగంటేను, అధ్యాత్మవిద్యయందు బుద్ధిన్ని సాధుసంగమమున్ను వాసనాపరిత్యాగమున్ను. ఈయుక్తులచేత చిత్తజయం కలుగును. ఈలాగు చిత్తజయం చేయనేరక, హఠానను ఎవ్వడు నియమించునోవాడు చిత్తమనే దీపమును విడిచిపెట్టి తమన్సనే అంజనాలచేతం బోగొట్టిననేటందుకు సమానము. ఏమూఢుండైనానేమి హఠంచేత మనోజయం చేసితిననునో, వాడు మదించిన యేనుగను బిసతంతులచేతం గట్టిననేటందుకు సమానము. నిగ్రహం రెండు విధాలు— హఠనిగ్రహమున్ను క్రమనిగ్రహమున్ను. చక్షురాది జ్ఞానేంద్రియాలున్ను, వాగాది కర్మేంద్రియాలున్ను తద్గోళకనిరోధమాత్రం చేతను హఠంవల్ల నిగ్రహింపంబడును. అదృష్టాంతంచేతను మనసునున్ను అలాగే నిగ్రహించెదననే ముగ్ధునికి భ్రాంతికొరకు అవును. అందుచేతను నిగ్రహం కూడదు. తద్గోళకనిరోధంవల్ల మనస్సు నిగ్రహించగూడదు గనుక, యీనిగ్రహానకు క్రమనిగ్రహమే యోగ్యం. క్రమనిగ్రహమందు అధ్యాత్మవిద్యాప్రాప్తె యుపాయము. అవిద్యయేమి జేసును అంటే, దృశ్యమిథ్యాత్వమునున్ను, అదృశ్యవస్తుస్వప్రకాశమునున్ను బోధించును. ఇటువలె బోధింపంబడుటంబట్టి అమనస్సుకు స్వగోచరమైన దృశ్యాలందు ప్రయోజనంలేదు; అగోచరమైన దృగ్వస్తువందు ప్రయోజనం గలదని యెరింగి అదినిరింధనాగ్ని వలెనే స్వయమేవ శాంతింబొందును. ఈయర్థమందు:

యథా నిరింధనో వహ్ని స్వయోనావుపశామ్యతి,
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనా ఉపశామ్యతే॥

ఈతత్వబోధ వినేటందుకు సమర్థుండైనవానికిన్ని విన్నవెనుక విస్మృతైనవానికిన్ని యీయిద్దరికిన్ని సాధుసంగమముపాయము. సాధువులు పునఃపునః బోధింతురు, స్మరింపంజేతురు. ఇంక విద్యామద దుర్వాసనచేతం బీడ్యమానుండైన వానికిన్ని, నివర్తించనుత్సాహం లేనివానికిన్ని, పూర్వోక్తమైన వివేకంచేత వాసనాపరిత్యాగముపాయము, వాసనలున్ను అతిప్రాబల్యంచేత విడువశక్యంగానివానికి ప్రాణస్పంద నిరోధముపాయము. ప్రాణస్పందవాసనలు రెంటికిన్ని చిత్తప్రేరకత్వం గలుగంగాను ఆరెంటియొక్క నిరోధమున్నొకున్నుండగాను చిత్తశాంతి పుట్టును. ప్రేరకత్వం వశిష్ఠు చెప్పుచున్నాడు:

ద్వేబీజే చిత్తవృక్షస్య వృత్తిప్రతతిధారిణః।
ఏకం ప్రాణపరిస్పందో ద్వితీయం దృఢభావనా॥
సతాసర్వగతా సవిత్ప్రాణ స్పందేన బోధ్యతే।
సంవేదనాదనంతాని తత్వే దుఃఖానిచేతసః॥

అని కలదు. ఏలాగైనానేమి భస్మంచేతం గప్పుకొన్న యగ్నిని లోహకారుండు కొలిమితిత్తిచేతనూదితేను ఆవాయువుచేత నగ్నిజ్వలించును. ఆలాగే చిత్తోపాదాన కాష్ఠస్థానమైన అజ్ఞానంచేత నావృతమైన సంవిత్తు ప్రాణస్పందంచేత బోధ్యమానమైన చిత్తవృత్తిరూపంచేతం బ్రజ్వలించును. అందువలన చిత్తవృత్తినామకమైన సంవిజ్వాలారూపంవల్ల దుఃఖాలం బుట్టించును. ఇది ప్రాణస్పందప్రతీతైన చిత్తోత్పత్తి. ఇంక భావసంవిత్ప్రకటితమున్నై అనుభూతయుక్తమున్నై అపరమున్నైన వాసనాజనితమైన చిత్తోత్పత్తి యేలాగంటేను, దృఢాభ్యాసంవల్లనైనటువంటి పదార్థైక్యభావనవల్లను అతిచంచలమైన చిత్తం పుట్టును. అది జన్మజరామరణ కారణమైనది. కేవలమున్ను ప్రాణవాసనలు రెంటికిన్ని చిత్తప్రేరకత్వం గూడదు. మరేలాగంటే, పరస్పర ప్రేరకత్వం గలదు. అదియేలాగంటే,

వాసనావశతః ప్రాణస్పంద స్తేనచ వాసనా।
క్రియతే చిత్తబీజస్య తేన బీజాంకురక్రమః॥

అని కలదు గనుక, ఒకటి నాశమైతే రెండున్ను నాశమౌను. అది యేలాగంటే, చిత్తానకు రెండు బీజాలు— ప్రాణస్పందనయును వాసనయును. ఇందులోనొక్కటికి నాశంవస్తే రెండోదిన్ని నాశమౌను. ఈయర్థమందు వాశిష్ఠం చెప్పుచున్నది.

ద్వే బీజే రామచిత్తస్య ప్రాణస్పందన వాసనే।
ఏకస్మింశ్చ తయోఃక్షీణే క్షిప్రం ద్వే అపి నస్యతే॥

అని కలదు గనుక, ప్రాణాస్పంద నిరోధమున్ను వాసనాక్షయమున్ను అయితే అక్షణమందే చిత్తనాశం గలుగును. అందుకు ఉపాయమేలాగు అంటేను, అసంగవ్యవహారత్వం వల్లనున్ను భవభావనలేనందువల్లనున్ను వాసన

ప్రవర్తించదు. అవాసనాపరిత్యాగంవల్ల చిత్తము అచిత్తత్వమును బొందును. అప్పుడు తత్వం ప్రకాశించును. అయితే లయానకు ప్రతిదినమున్ను సుషుప్తి యందు స్వతస్సిద్ధంగాగాను నిరోధప్రయత్నము వ్యర్థము అంటివా, ధారణ, ధ్యాన, సమాధిసాధ్యమైన సంప్రజ్ఞాతసమాధియొక్క యేకాగ్రవృత్తి రూపంచేత హేతుత్వంగాగా, శాంతాత్మయందవరుద్ధమైనటు వంటి అసంప్రజ్ఞాత సమాదినిం బొందినటువంటి చిత్తానకు వృత్తిరహితమైనటువంటి సుషుప్తి దర్శనహేతుత్వం గాదు అనరాదు. స్వతస్సిద్ధమైన దర్శనమును నివారించ గూడదు. అటు గనుక శ్రేయోమార్గమందున్ను చెప్పుచున్నది.

అత్మానాత్మాకారం స్వభావతోవస్థితం సదాచిత్తమ్।
అత్మైకాకారతయా తిరస్కృతానాత్మదృష్టి విదధీత ఇతి॥

అని కలదు. ఎటువలెనైనానేమి, ఘటం ఉత్పద్యమానమయ్యేటప్పుడు ఆకాశమున్ను స్వతస్సిద్ధంగానే పూర్ణమైయున్నది. అఘటం జలతండులాదుల చేత పూర్ణమయ్యేది పురుషప్రయత్నంవల్ల పశ్చాత్ కలుగును. ఆజలతండు లాదులు కుమ్మరిస్తేను, అకాశమునుకూడా కుమ్మరించవశంగాదు. ఘటముఖం మూసిపట్టినాగాని, అంతర్వ్యోమం స్థితమయ్యే యున్నదిగనుక, అలాగే ఉత్ప న్నమానమైన చిత్తము ఆత్మచైతన్యపూర్ణమయ్యే ఉత్పన్నమౌను. ఆఉత్పన్నా నకు ఎటువలెనైనానేమి, మూసబెట్టిన తామ్రంవలెనే, సుఖదుఃఖాది వృత్తి రూపత్వము భోగహేతువులైన ధర్మాధర్మవశాన భోగహేతువు కొరకౌను. అది రూపరసాద్యనాత్మాకారంగాగా, నివారింపంబడెను. నిర్నిమిత్తమైన చిదాత్మా కారం నివారింపశక్యంగాదు. అటుగనుక యాచిత్తం నిరోధసమాధిచేత నివర్త కమై సంస్కారమాత్రమశేషించి సూక్ష్మంగాబట్టి చిదాత్మమాత్రాభిముఖమయి నందువల్ల యేకాగ్రంగాబట్టిన్ని యాచిత్తంచేతను నిర్విఘ్నంగాను ఆత్మ అను భవింపంబడుచున్నది. ఈయభిప్రాయమే వార్తికకారుండున్ను, సర్వానుభవుం డున్ను, యోగిన్ని యాఖుద్దరిచేతనున్ను చెప్పబడెను. అదియేలాగంటేను, బుద్ధికి ధర్మాదివృత్తులవల్ల దేహదుఃఖాదిహేతుత్వం గలుగును. వస్తువువల్లను నిర్హేతుకమైనటువంటి ఆత్మసంబోధ రూపత్వం గలుగును. ఈయర్థమందు వార్తికకారులు చెప్పుచున్నారు.

ఘటదుఃఖాదిహేతుత్వం ధియోధర్మాదిహేతుతః।
నిర్హేతుత్వాత్మసంబోధ రూపత్వం వస్తువృత్తితః॥
ప్రశాంతవృత్తికం చిత్తం పరమానందదీపకమ్।
అసంప్రజ్ఞాత నామాయం సమాధిర్యోగినాం ప్రియా॥

ఆత్మదర్శనము స్వతస్సిద్ధమైయున్నాగాని, అనాత్మ నివారణంకొరకు నిరోధాభ్యాసం చేయవలెను. అటుగనుకే,

ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్।

అని కలదుగనుక, యోగశాస్త్రం చిత్తచికిత్స సమాధిమాత్రమే చెప్పి గాని ఆత్మదర్శనం సాక్షాత్కారం చెప్పలేదు. గత్యంతరంవల్ల గలదు. ఈ యర్థమందు పతంజలి సూత్రం:— యోగశ్చిత్తవృత్తినిరోధః॥ ఈసూత్రంచెప్పి అనిరోధమైనపుడు ఉత్తరసూత్రం చెప్పుచున్నాడు. తద్రష్టుస్స్వరూపేవస్థానం అని చెప్పినందువల్లను, నిర్వికారద్రష్ట అయినవాడు సదాస్వరూపమయ్యేయుండును. అలాగైనా వృత్తులు ఉత్పద్యమానమవుచుండగాను అందు చిత్తఛాయ ప్రతిబింబించియుండగాను. తదవివేకంచేత నస్వస్థునివలెనే ఆద్రష్ట అవును. ఇదిన్ని అనంతరసూత్రమందే చెప్పుచున్నది: వృత్తిసారూప్యమితరత్ర। అని కలదు గనుక, అనత్మానకున్ను పురుషునికిన్ని అత్యంతసంబంధంలేదు గనుక, ప్రత్యయమందు విశేషమేదికద్దో అదిభోగం. చిదాభాసతోగూడియున్న బుద్ధికి, తదాకారోపపత్తి గలిగినప్పుడు తనస్వరూపమని యెరుంగును. నిరోధసమాధిచేతను శుద్ధత్వం పదార్థం సాక్షాత్కరించంగాను, అబుద్ధికి బ్రహ్మత్వం గోచరించెడి కొరకు, మహావాక్యంచేతను బ్రహ్మవిద్యా నామకమైనటువంటి వృత్యంతరమును గలుగచేస్తున్నది. శుద్ధత్వ పరార్థసాక్షాత్కారమందు నిరోధసమాధి యొక్కటే సాధనమని చెప్పరాదు. చిజ్జడాల నేర్పరించే వివేకమున్ను కలుగవలెను. అటుగనుక వాశిష్ఠము చెప్పుచున్నది:

ద్వౌక్రమౌ చిత్తనాశస్య యోగం జ్ఞానంచ రాఘవ।
యోగస్తద్వృత్తినిరోధోహి జ్ఞానం సమ్యగవేక్షణమ్॥
అసాధకస్య చిద్యోగం కస్యచిద్జ్ఞాననిశ్చయః।
ప్రకాశాద్వ్యౌతతోదేవో జగాద పరమేశ్వరః॥

అయితే వివేకానకున్ను యోగమందే పర్యవసానం. దర్శనవేళయందు ఆత్మమాత్రగోచరమైనటువంటి, ఏకాగ్రవృత్తికి క్షణమాత్రం సంప్రజ్ఞాతరూపంగాబట్టి, వివేకము యోగమందు పర్యవసానం అంటివా, అలాగైనాను, సంప్రజ్ఞాతసమాధికిన్ని అసంప్రజ్ఞాతసమాధికిన్ని స్వరూపంచేతనున్ను సాధనంచేతనున్ను మహద్వైలక్షణ్యం గలదు. అదియేలాగంటే వృత్తిచేతనున్ను అవృత్తిచేతనున్ను స్వరూపభేదం స్ఫుటమైయున్నది. సాధనానైకత్వేన సంప్రజ్ఞాతసమాధికి సజాతీయత్వం గాబట్టి, ధారణాదిత్రయము అంతరంగము. అసంప్రజ్ఞాతసమాధికి అవృత్తికాబట్టిన్ని, విజాతీయత్వంగాబట్టిన్ని బహిరంగము. ఈయర్థమందు పతంజలిసూత్రం:— బహిరంగ నిర్బీజస్యేతి। అని కలదు గనుక, విజాతీయత్వమవుచుండగాను, అనాత్మవృత్తినివారకానకు ఉపకారికత్వం గలుగంగాను బహిరంగము అవిరుద్ధము. అయుపకారకత్వమే విశదంగాను సూత్రకారుడు చెప్పుచున్నాడు:

శ్రద్ధావీర్యస్మృతిసమాధి ప్రజ్ఞాపూర్వకమితరేషామ్।

కొందరు దేవత్వం వహించి మనుష్యులయి వచ్చినవారికి పూర్వసూత్రమందు జన్మంచేతనే సమాధిచెప్పి, మనుష్యులంగూర్చి యీసూత్రం చెప్పి

చున్నది. మాకు యీయోగమే పరమపురుషార్థ సాధనము. ప్రత్యయమున్ను శ్రద్ధో త్కర్షశ్రవణం చేత పుట్టును. ఆయుత్కర్ష స్మరింపంబడును।

తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః।
కర్మిభిశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥

అని భగవద్వాక్యం కలదుగనుక, ఉత్తమలోకసాధనాలైనటువంటి కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సులకంటె జ్యోతిష్టోమాది కర్మాలకంటె యోగమే అధికం. జ్ఞానమునుగూర్చి అంతరంగసాధనం గాబట్టిన్ని చిత్తవిశ్రాంతి హేతువుగాబట్టిన్ని, జ్ఞానముకంటె యోగమె అధికమని యెరింగి యోగమందు శ్రద్ధగలుగును. అశ్రద్ధయందు వాసనచేయంగాను వీర్యమున్ను ఉత్సాహమున్ను గలుగును. సర్వదా యోగంసంపాదించెను అనెడి ఉత్సాహంచేతను తదనుష్ఠేయమైనటు వంటి యోగాంగాలను స్మరించును. ఆస్మరణచేతను లెస్సైకాగ్ర ఆచరింపదగి నటువంటి సమాధిగలవానికి అధ్యాత్మప్రసాదంవల్లను ఋతంభరప్రజ్ఞగలు గును. తత్ప్రజ్ఞాపూర్వకమనంగా తత్ప్రజ్ఞాసాధనమంట. అసంప్రజ్ఞాతసమాధి యితరేషాం అనంగాను దేవాదులకంటె నితరమైనటువంటి మనుష్యులకు సిద్ధిం చును. అప్రజ్ఞనే తిరుగ సూత్రమందు చెప్పుచున్నాడు.

ఋరతం భరతాతత్ర ప్రజ్ఞేతి. ఋతమనంగా సత్యవస్తువు. యధా స్వరూపం భరించెడిది అనంగా ప్రకాశించెడిది. ఋరతం భరా, అంట. అందు సమాధ్యుత్కర్ష జనితమైనటువంటి అధ్యాత్మప్రసాదం గలవానికి ఋతంభర ప్రజ్ఞ గలుగును. ఈలాగు అసంప్రజ్ఞాతసమాధికి బహిరంగసాధనం చెప్పి, తన్నిరోధమైనటువంటి అంతరంగసాధనమును సూత్రంచేత జెప్పుచున్నాడుః— "తస్యాపి నిరోధే సర్వనిరోధాం నిర్బీజసమాధిరితి". ఈసమాధి సుప్తిసమానమైన సాక్షిచైతన్యంచేత అనుభవించ, సమర్థుండు. ఈసుప్తిసమానమైన సాక్షిచైత న్యుందు సకలధీవృత్తిరాహిత్యంగాబట్టి, సుషుప్తే అని శంకింపవలదు. మనసుకు స్వరూప సదసత్తులచేత విశేషం గలదు గనుక, సుషుప్తికిన్ని సమాధికిన్ని భేదం చెప్పబడెను. ఈయర్థమందు గౌడపాదాచార్యులు చెప్పినారు।

నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః।
ప్రచారస్సతు విజ్ఞేయ స్సుషుప్తాన్యోన్య తత్సమమ్॥
లియ్యతేహి సుషుప్తేతన్నిగృహీతన్న లియ్యతే।
తేదేవనిర్భయం బ్రహ్మప్రజ్ఞానాలోక సంతతమ్॥

మాండూక్యశాఖయు చెప్పుచున్నదిః—

ద్వైతస్యాగ్రహణం తుల్యముభయోః ప్రాజ్ఞతుర్యయోః।
బీజనిద్రాయుతః ప్రాజ్ఞస్సాచతుర్యేన విద్యతే॥
స్వనిద్రాసంయుతౌ వాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్న నిద్రయా।
ననిద్రా నైవచ స్వప్నం తుర్యే పశ్యతి నిశ్చితాః॥

అన్యథా గ్రహణం స్వప్నో నిద్రాతత్త్వమజానతః।
విపర్యాసే తయోః క్షీణేత తుర్యం పరమశ్నుతే॥

అద్యులైనటువంటి విశ్వతైజసులు, అద్వైతవస్తువందె అన్యథాగ్రహణమైనటువంటి ద్వైతరూపమందు తోస్తున్నారు. ఆతోపు విశ్వతైజసులకు స్వప్నమని చెప్పబడును. తత్వమును యెరుగకయుండుట నిద్రయని చెప్పబడును. అనిద్ర విశ్వతైజసప్రాజ్ఞులయందె వర్తించును. అస్వప్ననిద్ర రూపాస్వరూపభూతాలైన స్వప్ననిద్రలకు విపర్యాసంగలదు. మిథ్యాజ్ఞానము సమాధియందు విద్యచేతనే క్షీణంగాగాను, తుర్యమున్నై అద్వితీయమైన వస్తువును పొందును. ఓయి, అలాగెఅవును, అసంప్రజ్ఞాతసమాధికిన్ని సుప్తికిన్ని చాలాభేదం గలదు. అందు తత్వమెరుంగ నిచ్చగించినవానికి, సమాధ్యపేక్ష గలిగినాగాని సాక్షాత్కారం గలవానికి జీవన్ముక్తి కొరకైలేదు. అసమాధ్యపేక్ష రాగద్వేషాది క్లేశబంధనివృత్తి సుషుప్తిచేతనే సిద్ధిఅవుచున్నది అంటివా, అటనరాదు. ప్రతిదినమున్ను తనంత ఒకవేళ వచ్చేటటువంటి సుషుప్తి బంధనివృత్తి గలిగిందా? కాదు. అయితే, బంధనివృత్తి అభ్యాసంవల్లనున్ను కాదు. నిరంతరమైనటువంటి జాగ్రమందు అవునంటివా, అందునాగాదు. ప్రసక్తిలేదు గనుక, లీనభావమైనటువంటి సుషుప్తిని అవునంటివా అందునాగాదు, మూఢులకు సహాలేదు, అది యేలాగంటే, ఉత్పత్తి గలిగిగదా లయంగలుగవలెను. కాబట్టి లేదంటాయెను. స్వప్నమందున్ను లేదనంభవం గాబట్టి, సుషుప్తియందు లేదనవచ్చునా అంటివా కాలాంతరవర్తి అయినటువంటిది గనుక, లేదంటిమి. కలిగినట్లైతే మూఢులయొక్క జాగ్రత్స్వప్నాలయందున్ను కలుగవలెను. నైరంతరసుషుప్తే చాలునంటివా ఒకానొకప్పుడున్ను కూడదు. అదియేలా అంటివా, కర్మక్షయ నిమిత్తమైందిగాబట్టి, తత్వవేత్తలకున్ను క్లేశక్షయంకొరకు సుషుప్తికంటె సమాధి కలదు. అసంప్రాజ్ఞాతసమాధియొక్క అపేక్షగలవానికి, సమాధిభూమికి నాలుగు విధాలు, గోస్తురంగాలవలెనె. వాఙ్నిరోధం ప్రథమభూమి. బాలునివలెనే నిర్మననత్వం ద్వితీయభూమి. తంద్రవలెనే అహంకారరాహిత్యం తృతీయభూమి. సుప్తివలెనే మహత్తత్వరాహిత్యం చతుర్థభూమి. ఈనాలుగు భూములకున్ను క్రమాక్రమాననే ఉపరతి సంభవించును. ఆసమాధియందు ధైర్యంచేత గ్రహింపంబడ్డ ఉపరతి గలుగుచుండంగాను, బుద్ధిసాధనమైనటువంటి మహదహంకార మనోవాగాదులకు స్వతఏవ తీవ్రవేగంచేతను, ప్రవహిచేటటువంటి కూలంకషములైన నదులయొక్క ప్రవాహంవలెనే కలుగగాను, నిరోధమందు ధైర్యమును అపేక్షింపవలెను. బుద్ధి తనకు పూర్వభూమి జితమాయెనో లేదో అని లెస్సగా బరీక్షించి జితంగాగా ఉత్తరోత్తరభూమినే ఉపక్రమించవలెను. జితంగాకుంటె అపూర్వభూమినె లెస్స అభ్యసింపవలెను.

ఆత్మసంస్థం మనఃకృత్వా నకించిదపి చింతయేత్।

అనెడి శ్లోకార్థంచేతను, చతుర్థభూమ్యభ్యానము విస్మృతిగాగాను, కామభోగాలయొక్క విక్షిప్తంగల బుద్ధిని ఉపాయంచేతనే నిగ్రహింపవలెను. మునుపు కామోపభోగాలయందు యేలాగు ప్రవృత్తి గలిగెనో అలాగే, లయమందు ప్రవత్తి గలుగవలెను. అటుగనుక, గౌడపాదాచార్యులు చెప్పుచున్నారు:

లయేసంబోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః
సకషాయం విజానీయా త్సమప్రాప్తం నచాలయేత్॥
నస్వాదయేత్సుఖం తత్ర నిస్సంగః ప్రజయా భవేత్।
నిశ్చలం నిశ్చరం చిత్తమేకీకుర్యాత్ప్రయత్నతః॥
యథానలియ్యతే చిత్తం నచవిక్షిప్యతే పునః।
అలింగనమనాభానం నిష్పన్నం బ్రహ్మతత్వతః॥

లయ, విక్షేప, కషాయ, సమప్రాప్త యీనాలుగున్ను చిత్తంయొక్క అవస్థలు. అందు నిరుద్ధమానమైన చిత్తము విషయాల వెంటంబోక మళ్లును; ఎందువల్లనంటె పూర్వాభ్యాన వశానను, అది లయమనెడి సుషుప్తికొరకై అభిముఖమవును. అప్పుడు దానివుత్థానప్రయత్నంచేత లయకారణనివారణచేతం జిత్తమును లెస్సగా మేలుకొలుపుట. లయహేతువేది అంటె నిద్రాజీర్ణ బహ్వాశన శ్రమములు. ఈయర్థమందు: "సమాపనీయ నిద్రాంనుజీర్ణేల్పభోగి। శమత్యాజ్యబాధివివిక్తప్రదేశే। సదా సితనితృష్ణ విషప్రయత్నో యదాప్రాణరోధో నిజాభ్యాన మాత్రాత్" అనికలదు. లయంవల్లనుద్ధాపితమైన చిత్తము దినదినప్రబోధాభ్యాన వశానను కామోపభోగాలయొక్క విక్షేపం పుట్టితేను, అప్పుడు వివేకియైన యోగి, జనప్రసిద్ధ భోగ్యవస్తుగతమైన దుఃఖానుస్మరణ చేతను, శాస్త్రప్రసిద్ధమున్నైన జన్మాదిరహితమున్నైన అద్వితీయ బ్రహ్మతత్వానుస్మరణ పూర్వకంగాను, భోగ్యవస్తుదర్శనమందు మరిమరిపుట్టిన విక్షేపాలవల్లనుండి చిత్తమును శమింపజేయును. కషాయమనంగా చిత్తదోషము. తీవ్రరాగద్వేషాదివాసనలచేతను గ్రస్తమైనటువంటి చిత్తము, ఏకాగ్రంవలెనే, లయవిక్షేపరహిత దుఃఖాలచేతను యేకాగ్రమైయుండును. తాదృశమైన చిత్తము కషాయమని యెరుంగవలెను. అయేకాగ్రమైన చిత్తంవల్లను వివేకంచేత మళ్లుట, యిది యేకాగ్రంగాదని యెరింగి, లయవిక్షేపాలవలెనే కషాయమును తిరస్కారం జేయుట. ఇంక సమప్రాప్తి యనంగానేమి అంటె బ్రహ్మప్రాప్తి:

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్।

అని శ్రుతిపలికెడిని. లయవిక్షేపకషాయాలయందు పరిహరించినందువల్ల, చిత్తంచేతను బ్రహ్మము పొందంబడును. అనమప్రాప్తమైన చిత్తము కషాయులయువిక్షేప భ్రాంతులచేతను చలింపకుండుట, సూక్ష్మబుద్ధిచేతను లయ

విక్షేపకషాయసమప్రాప్తిని లెస్సగా వివరించి, సమప్రాప్తియందతిప్రయత్నానను చిత్తమును స్థాపించవలెను. స్థాపించినందువల్లను, బ్రహ్మస్వరూపభూతమైన పరమానందము లెస్సగానే ఆవిర్భవించును. ఈయర్థమందు శ్రుతి:—

సుఖమాంత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్,

అని కలదు. స్మృతిన్ని అలాగె:

సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్।
నశక్యతే వర్ణయితుం గిరాతదా స్వయంతదంతఃకరణేన గృహ్యతే॥

అని కలదు. ఓయి! సమాధియందు మరపులేని బ్రహ్మానందానకు బుద్ధి గ్రాహ్యమని శ్రుతిస్మృతులచేతం జెప్పబడెను. ఆచార్యులచేతనైతేను, నాస్వాదయేత్సుఖంతత్ర అని బుద్ధిగ్రాహిత్వము నిషేధింపంబడెనంటివా, విరోధంలేదు. సమాధి విరోధియైనటువంటి వ్యుత్థానరూపంయొక్క పరామర్శకే నిషిద్ధం చెప్పబడెను. ఎటువలెనైనానేమి, గ్రీష్మకాలమందు మధ్యాహ్న సమయాన, జాహ్నవీహ్రదమందు మునింగినవానిచేత ననుభవింపంబడిన స్వరూపసుఖమును ఆమునింగినప్పుడు సవికల్పకమైన అంతఃకరణవృత్తిజ్ఞానం చేతం గ్రహింప శక్యంగాదు. ప్రబోధకాలమందైతే స్మరణవల్ల స్పష్టంగా పరామర్శింపబడు చున్నది యేలాగు అలాగే, వృత్తిరహితమైన సమాధియందు సంస్కారశేష మాత్రంగాను సూక్ష్మమైన చిత్తంచేతనైన సుఖానుభవము శ్రుతిస్మృతులచేత వివక్షితమైంది. నేను సమాధిసుఖమును అనుభవిస్తిని అనెడి యేతాదృశమైన వ్యుత్థితచిత్తంగల సవికల్పకంయొక్క పరామర్శ యెదిగలదోఅది ఆస్వాదన మని చెప్పంబడెను. అది ఆచార్యులచేత ప్రతిషేధింపంబడెను. అదేస్వాభిప్రాయం ప్రకటింపవలసి, నిస్సంగః ప్రజ్ఞయా భవేత్ అని చెప్పిరి. ప్రకృష్టమైనటువంటి సవికల్పక జ్ఞానమును, ప్రజ్ఞచేతను విడువవలెను. అప్పుడు ధృతి గృహీతమైనబుద్ధి ప్రజ్ఞఅనిపించుకొనును. తదాత్మకత్వంచేతను సాధించినటువంటి, సుఖాస్వాదనమునున్ను తద్వర్ణనాదిరూపమునున్ను వాటియందానక్తినిన్ని వర్జించవలెను. సమాధియందు బ్రహ్మానంద మందు మగ్నమైన చిత్తము యెప్పుడు సుఖాస్వాదనంకొరకు వాతమశకాద్యుపద్రవాలచేత చలించరాదు. అచలించని చిత్తము మరిమరిన్ని, చలించకుండా దృఢంజేయవలెను. అటువలెనె పరబ్రహ్మముతో యేకాకారం జేయవలెను. అందు నిరోధప్రయత్నమే సాధనం. ఏకీభవందానె। యదానలియ్యతె చిత్తం అనెడి శ్లోకంచేత స్పష్టంగా జెప్పబడుచున్నది. అ....ంగనమనాఖ్యానం అనెడి యీారెంటివల్లనున్ను కషాయ సుఖాస్వాదాలు నిషేధింపంబడుచున్నవి. లయవిక్షేపకషాయ రసాస్వాదాలవల్ల నుండిన్ని రక్షింపంబడ్డటువంటి చిత్తము విఘ్నములేకయే బ్రహ్మమందు నిలుచును. అటుగనుక దీర్ఘకాలసత్కారం తోస్తేకూడానభ్యసింప వలెను. అయభ్యాస జితంవల్లను సమాధిధార్ఢ్యము కలుగును. అప్పుడు సుఖదుఃఖవాసనలచేత

